శ్రీరస్తు

శ్రీ మత్పోతులూరి వీరబ్రహ్మణేనమః

శ్రీమద్విద్వద్గద్వాలా స్థానకవియును
చతుర్విధ కవితా విశారదుండును
నానారాజ సన్మానితుండును, శ్రీ విశ్వకర్మ కులోద్భవుండును
బోడిలవీటి నివాసుండును, కవిసింహాద్యనేక బిరుదాంకితుండును
శ్రీసారంగధరీయ నామకత్ర్యర్థికావ్యాదిబహుగ్రంథకర్తయును
అగు
బ్ర॥ శ్రీ॥ పోకూరి కాశీపతికవి ప్రణీతంబైన

---

# శ్రీ సిద్ధయోగి చరిత్రము

---

ఇయ్యది
కడపజిల్లా దువ్వూరిపురనివాసుండును
శ్రీ విశ్వకర్మ కుల భూషణుండును
అరుణోదయ పత్రికా సంపాదకుండునునగు
బ్ర॥ శ్రీ॥ మతోద్ధారక జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులవారిచే
కృతినీయబడి కృతిభర్తవలన
దువ్వూరు శ్రీ అరుణోదయ ముద్రాక్షర శాలయందు
ముద్రింపించి ప్రకటింప బడియె.

కాపిరైటు 1953 వెల 2—0—0

అరుణోదయ గ్రంథమాల.

దువ్వూరు,

★ దశమ గుచ్ఛము

సర్వహక్కులు;— కృతిభర్తవి —

మూల్యం 2-0-0 లు మాత్రమే

ప్రచురణ కాలము

1953 మే నెల

ప్రచురణ 500 కాపీలు

విజయ వసంత ఋతువు



ప్రాప్తి స్థానము.

మేనేజరు:

అరుణోదయ గ్రంథమాల

దువ్వూరు పోస్టు (కడప జిల్లా)



## కృతిభర్త

* సంఘోద్యమమునకు ముందు పంచాయితి కోర్టు
* ప్రెసిడెంటుగా వున్నప్పటి
* ఫోటో

# తొలి పలుకు

---

శ్రీసిద్ధయోగి చరిత్రమును పద్యకావ్యముగ వ్రాయ నాకరిప్రేరణచే కుతూహలముకలిగి మూడాశ్వాసములు రచించితిని కాని కారణాంతరములచే పూర్తి జేయఁజాలకయుంటిని ఒకసభలో కొందరి మహాశయులకోర్కెపై ఆగ్రంధమునందలి కొన్ని పద్యములు చదివివినుపింపుచుండఁగా బ్రహ్మశ్రీ జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులవారు వినియానందించి యీగ్రంధమును తనకు కృతినీయవలసినదనియు గ్రంధమునకు తగినట్లుగా బహూకరింపజాలకపోయినను యథాశక్తి బహూకరింతుననయుచెప్ప నేనందులకంగీకరించి తక్కిన రెండాశ్వాసములు పూర్తిచేసి అయిదాశ్వాసముల గ్రంధమును పార్థివసంవత్సర మహాశివరాత్రి పుణ్యదినంబున కందిమల్లయపల్లె శ్రీ వీర బ్రహ్మక్షేత్రమున శ్రీ వీరబ్రహ్మాచార్యులవారికి కృతినొసంగ యథాశక్తి నన్ను సత్కరించి కృతిస్వీకారమునందిరి. సప్తసంతానములలోనగ్రగణ్యమైన మత్కృతిసంతానమునుపరిగ్రహించిన యీకృతిభర్తకు శ్రీపరమేశ్వరుఁడు సకలశుభంబులొసంగి రక్షించుగాక.

గ్రంధకర్త —

బ్రహ్మశ్రీ కవిసింహ పోకూరి కాశీపత్యవధానులు

# ... విషయసూచిక ...


పుట
అవతారిక కృత్యాద్యవస్థ
2 కృతిపతి వంశావళి
3 శిల్పనైపుణ్యము
4 వైదికచర్య
లౌకికచర్య
5 పారమార్థికచర్య
6 విఖ్యాతి
కృతిప్రేరణము
7 కవిప్రశంస
8 షష్ఠ్యంతములు
— ప్రథమాశ్వాసము —
1 కథాప్రారంభము
3 సంతానకాంక్ష
8 సిద్ధయోగి జననము
12 సిద్ధయోగివిద్యాభ్యాసము
13 సిద్ధయోగి ప్రవర్తనము
14 సిద్ధయోగి ప్రబోధము
16 గురుసంఘటనకాంక్ష,
సిద్ధయోగి కుత్సితమంకు
రించెనని తలంచుట
20 సిద్ధయోగికి సదానందయోగీంద్రుడు ప్రసన్నుండగుట
వీరబ్రహ్మేంద్రచారిత్రము
25 సిద్ధయోగి వీరబ్రహ్మేంద్ర
స్వామిగా జెలంగుట
28 సిద్ధయ్యవీరబ్రహ్మేంద్రుని
నకుతనకోర్కెను దెల్పుట
30 శ్రీవీరబ్రహ్మేంద్రుడు యిందు
పరమపదము సామాన్య
ము కాదనుట
33 పీరుసాహెబు కుమారుని
వెదకుట
34 సిద్ధవిగానక యాదంబీ వి
లపించుట
35 ఆదంబీ గద్దె నడుగుట
39 ఆంబీకికుమారుడున్న వర్త
మానము చెలియుట
41 ఆశ్వాసాంతములు
— ద్వితీయాశ్వాసము —
43 పీరుసాహెబ్ కుమారున్
గాంచుట
49 ఆదంబీ కుమారుని యిం
టికి రమ్మని బతిమాలుట
51 గురువిడిచి సిద్ధయ్య యిం
టికి రాననుట
53 సిద్ధయ్యను తండ్రి కట్టి
వేయుట

# విషయసూచిక


58 చాటునకువచ్చిన సిద్దని
 పీడుట ధర్మముకాదనుట
58 పీరుసాహేబ్ వీరేశ్వరుని
 నిందించుట
60 కడప నవాబుకడ వీరేశు
 నిపై నేరమునుస్థాపించుట
61 వీరేశుని సిద్దని పట్టుకరం
 డని భటులకు నవాబుత్త
 ర్వు చేయుట
69 సిద్దయ్యను భటులుపట్టు
 కొని నవాబుకడకు గొం
 పోవుట
70 సిద్దయ్యను భటులుదం
 డించుట
74 సిద్దయ్య గుంటికిమొక్కి
 ప్రదక్షిణలు జేయుట
76 పీరుసాహేబ్ను సతీసుత
 యుక్తంబుగా నవాబుగృ
 హంబునకున్ దోడ్కొని
 పోయి సత్కరించుట
9 ఆదంబీ పీరుసాహేబులు
 వీరేశునకు తమకుమారు
 నప్పగించి యేగుట
80 ఆశ్వాసాంతములు

.. తృతీయాశ్వాసము ...
84 సిద్దండు వీరేశ్వరునుపదే
 శమిమ్మనుట
86 సిద్దని కుపదేశంబిచ్చుట
91 సిద్దని ఖ్యాతికోర్వలేకగు
 రునందలు వెళ్లిపొమ్మనుట
93 సిద్దని కన్నపానాదులులిడ
 కుమని గురునందనులు
 తల్లికి జెప్పుట
95 గోవిందమ్మ సిద్దనివెళ్లగొ
 ట్టుటన్యాయముకాదనుట
97 వీరేశుడు సిద్దని పిడననుట
102 సిద్దనికి గోవిందమాంబ
 యన్నపానాదులు విచా
 రింపకుండుట
104 గురునందనులు సిద్దని
 గండించుట
107 వీరేశ్వరుండుసిద్దనిరక్షిం
 చుట
111 వీరేశ్వరుండు సిద్దినికి
 బ్రిపంచోత్పత్తినిదెల్పుట
115 పిండోత్పత్తి విధానము
119 పంచముద్రిలు (లు)
120 మూలాధారాదిచక్రము

విషయ సూచిక


121 అష్టదళపద్మము
122 అష్టాంగ యోగములు
124 ఛాయాపురుషలక్షణము
125 స్వరవివేచనము
127 ఆసనములు
128 కాలజ్ఞానము
130 సిద్ధనిసహింపలేనిభక్తులు గర్వభంగమగుట
132 ఆశ్వాసాంతములు
— చతుర్థాశ్వాసము —
134 వీరేశ్వరుండు భార్యతో జీవసమాధినొందెదననుట
136 గురునందనులు సిద్ధని పూలకనుపుమని తల్లిని నిర్బంధించుట
141 గోవిందమ్మ సిద్ధనిపూలు దెమ్మనుట
144 శ్రీ వీరబ్రహ్మేంద్రుని సమాధిన్ జేర్చుట
145 సిద్ధయ్య పూలకైబనగానపల్లెకు నేగుట
149 గోవిందమ్మసిద్ధనికి మఠద్వారము దెరువననుట
150 సిద్ధుడుదర్శనంబిమ్మనివీరగురుని నుతించుట
152 సిద్ధనికివీరేశ్వరుండుదర్శనంబిచ్చుట
156 గోవిందయు సిద్ధయనుమరల నింటికిరమ్మనుట
15? సిద్ధయోగిసర్పదష్టుడైమృతినొందిన తిమ్మారెడ్డిం బ్రతికించుట
160 సిద్ధయోగి స్వగృహంబునకుం జేరుట
163 సిద్ధయోగి దర్శనమునకు గోవిందస్వామి యనువిప్రుండు వచ్చుట
163 కరణముపాపరాజు సిద్ధయను బరిహాసింపుట
167 పాపరాజు సిద్ధయోగినిక్షమాపణమును గోరుట
169 ఆశ్వాసాంతములు
... పంచమాశ్వాసము ...
170 అచ్చాంబీ పరిణయము
171 అచ్చాంబీని మనుమడుగుట
172 అందబీసి శాకింబీ పరాభవించుట

విషయసూచిక


170 అచ్చాంబీవిరహతాపము

179 అచ్చాంబీ లనచేటినిసిద్ధయకడకనుపుట

185 అచ్చాంబీని సిద్ధయ పెండ్లియాడెదననుట

191 అచ్చాంబీని సిద్ధయకుచేసుకొమ్మని తలిదండ్రులు బత్రిమాలుట

198 సిద్ధయోగిని సంహరింపబూనుట

200 ఖాజీలు పరాభవమొందుట

204 అచ్చాంబీకి సిద్ధయోగి నల్లలుగట్టుట

208 సిద్ధయోగికి గురుపట్టాభిషేకము జేయుట

210 గోవిందస్వామి యను విప్రుడు సిద్ధయోగిని గురునిగా గైకొనుట

2 3 సిద్ధయోగి జీవసమాధినొందుట

214 మంగళవాచకము

,, ఆశ్వాసాంతములు






:) కృ తి క ర్త (:

శ్రీ మద్గద్వాలాస్థానకవి

బ్రహ్మశ్రీ కవిసింహా పోకూరి కాశీపత్యవధానులుగారు

బోదిలవీడు = వెలుదుర్తి పోష్టు

పల్నాడుతాలూకా — (గుంటూరుజిల్లా)



— కృతిభర్త —

జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు

శ్రీ సిద్ధయోగిచరిత్రము కృతిస్వీకారము నందినప్పటి

ందలి

చాయా చిత్రము



— కృతిభర్త —

మహోద్ధారక జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు

సంధ్యావందన గ్రంథమును ప్రకటించబడిన కాలమందలి

ఫోటో

# అవతారిక

శా. శ్రీరామారమణాంశ జాతుఁడుఁ గృపా ♦ సింధుండుఁ బ్రాంచద్విరా
ద్వీరబ్రహ్మ జగద్గురు ప్రభుఁడు గో ♦ విందా సతీశుండుల
క్ష్మి రాజీవముఖీ మనోజ్ఞ మధుపున్ ♦ జిల్లెళ్ల వంశోద్భవున్
వీరబ్రహ్మ సుధీమణిన్ మనుచుతన్ ♦ విఖ్యాతిమైభాసిలన్ 1

గీ. ఆదిమధ్యాంత రహితమై ♦ యద్వితీయ
మై నిరాకారమై వ్యాప్త ♦ మై సమస్త
సృష్టిపోషణ సంక్షయ ♦ కృత్యములకు
మూలమగు పరమాత్మకు ♦ మ్రొక్కులిడుదు 2

ఆ. క్షితిని గ్రంథతతిని ♦ సృష్టింప వెలయింప
బెంపఁగర్తలనియు ♦ విబుధులనియుఁ
బరమ కవులనంగ ♦ వాక్యాసనునిఁక శ్రీ
నాథు రుద్రుఁదలఁతు ♦ నాదుమదిని 3

గీ. అరయ మలినాత్ముఁ బరుల ప ♦ దార్థములను
మొనసి దూరఁగనేర దృ ♦ ష్టిని గనుఁగొనుఁ
గుజనులన్ జేరుఁ గరకుశో ♦ క్తులను బలుకుఁ
గానఁ దలఁపఁగనేల కా ♦ కవిని మదిని 4

వ. అని యిట్లు కృతిభర్తృ కాశీర్వాదంబును స్వేష్టదేవతాభివం
దనంబును సుకవిజనాభి వందనంబును గాకవినిందనంబు
నుంగావించి మత్కృతిపతి వంశావతారం బభివర్ణించెద
నది యెట్లన్నను 5

## : కృ తి ప తి వం శా వ ళి :

క శ్రీరాయలసీమనఁ జె
న్నారెడు పురసముదయంబు • నందున విపుల
శ్రీరాజితమగుచును దు
వ్వూరను పురంబలరుఁ బ్రొద్దు • టూరికి సరసన్ 6

క. ఆపురవరం సమందునఁ
గాఁపురమున్నట్టి జన ని • కాయములోనన్
దీపింతురు సత్కారుణా
కుపారులు విశ్వకర్మ • కుల జాలు గరిమన్ 7

క. వారలలో శిల్పకలా
పారీణుఁడు సద్గుణుఁడు సు • వర్ణసగోత్రో
ద్ధారుఁడు ధీరుఁడు లక్ష్మీ
నారాయణుఁ డెసఁగు బుధజ • న స్తుతుఁ డగుచున్ 8

గీ. అతఁడు జిల్లెళ్ల గేహా నా • మాంచితుఁడయి
తగ గృహస్థాశ్రమంబున • ధన్యుఁడనఁగ
భద్రిమహితాత్మ యనఁదగు • పత్నియందుఁ
గనియె రామయ యనునట్టి • తనయు వినయు 9

శా. రామాధీశుని చారుకీర్తి ఫణపున్ • రాజున్ హాలిన్ బా
ర్వతీ
రామాధీశుని గేరు వైభవమిఁకన్ • రాణింపఁగా నందనా
రామాధీశునిదూరు సత్కరుణ యో • రక్షోన్వయధ్వంసిరా
రామాధీశుని మీఁజు నేరికగు నా • రా వీని వర్ణింపఁగన్

చ. నిరుపమ మంత్రశాస్త్రమును • నేర్చి యమేయ పరోపకారత
త్వరత ననారతంబు గ్రహ • బాధితులన్ సుఖమందఁ జేయుచున్
నిరతము యాచకావళికి • నిర్జరభూజము నా నభీష్టముల్
సరవిని దీర్చు రామయకు • సాటివదాన్యులు లేరిలాస్థలిన్

చ. సరసుఁడు రామయాఖ్యుఁడతి • శాంతుఁడు దాంతుఁడుఁ బెద్దబాకరా
పురమున శ్రీరమారమణ • భోగివరాభరణాలయంబులన్
దిరముగఁ గట్టి వేల్పులఁ బ్రి • తిష్టలు సల్పి యభేదబుద్ధి శ్రీ
వరుని గిరీశు నెప్పుడు స్త • వంబులొనర్చు నచంచలాత్ముఁడై 12

క. అయ్యలఘు చరితుఁడగు రా
మయ్య సుశీల యచ్చెల్ల • నగు సతియందున్
నెయ్యమునఁ గనెను సుతుల ము
నయ్యాచారి యన సుబ్బ • యాచారి యనన్ 13

ఉ. ఆడఁడు కల్లలన్ మరచి • యైనను గేలికి నైన నెన్నఁడున్
వీడఁడు లేశమాత్రమును • వేదహితంబగు ధర్మమార్గమున్
వేడఁడు లాతి వేలుపుల • విష్ణుమహేశులఁ దప్ప దుష్టులన్
గూడఁడు పోమునయ్య బహు • కోవిద సంస్తుతి పాత్రుఁడారయన్ 14

క. ధీమంతుఁడు సుందరుఁడును

శ్రీమంతుఁడు నగు మునయ్య ♦ చెన్నలరారన్
బ్రేమించి పెండ్లియాడెను
సోమకళా సమాఖ్య సతిని సు ♦ బ్బమ సాధ్విన్ 15

క. పేరిమి సుబ్బమయందున
శ్రీరాజిల్లగ మునయ్య ♦ శేషాంబన్ జె
న్నారఁగ వీరబ్రహ్మ
చారిన్ గాంచెన్ బుధుల్ సు ♦ సంతానమనన్ 16

క. లక్ష్మీవసుధల హరివలె
లక్ష్మీనరసమను మఱియు ♦ లక్ష్మమనుసుధీ
లక్ష్మణుఁడగు వీరబ్ర
హ్మాత్ముఁ ధరధీరుఁడాస్థ ♦ మై పెండ్లాడెన్ 17

క. వీరబ్రహ్మచారి క
లారమణాస్య యగునట్టి ♦ లక్ష్మమయందున్
సారగుణాంచితయగు పు
త్రీరత్నమునుగనెఁ బార్వ ♦ తీదేవి యనన్ 18

క. శ్రీమద్వీరబ్ర సు
ధీమణి నిజసుతను బార్వ ♦ తీదేవినిన
త్ప్రేమనఁ బాణాలాన్వయ
కామాక్షయకిచ్చి పెండ్లిఁగావించెనహో 19

— శిల్పనైపుణ్యము —

మ. స్వకుశిల్ప ప్రతిభావిశేషమునుజూ ♦ పన్ గావసింపంగనా
మయనిర్మాణ సభాగ్రిధామమనస ♦ మ్యగ్దాంరబంధాలితో

నయనానందదమౌ కవాటతతితో ♦ నానావిచిత్రాళికా
శ్రీమహానట్లు రచించియుండలరె పీ ♦ ఠబ్రహ్మాధీరుండహా

— వైదికచర్య —

మ. శ్రీమహార్కతనిజ్యోతిషంబునముహూ ♦ ర్తప్రశ్న వాస్త్వాదిభా
గములన్ వేదమునందుషోడశమహా ♦ కర్మాదులన్ నేర్చి నే
ర్పుమెయిన్ భాసిలఁగొన్ని యోగ్యులకుపౌ ♦ రోహిత్యమున్ జేసినా
గ్రిమణున్ దప్పులు బట్టఁగాఁగలిగెవీ ♦ ఠబ్రహ్మాధీరుండహా

మ. శ్రీమకున్ వైచికిత్రియా ప్రయోగములువి ♦ స్పష్టంబుగాఁ గూర్చి భా
ష్యమునా భూతలమందు భాసిలఁగసం ♦ ధ్యావందనం బచ్చు ప్రా
త్రములన్ జేసియు వెల్లడించెనహాహా ♦ తర్కింపఁగాభారతీ
రమణుండైనగణింపఁగాఁగలఁడెవీ ♦ ఠబ్రహ్మవిద్వన్మణిన్

— లౌకికచర్య —

సీ. స్వపురంబునన్ గల ♦ పంచాయతీకోర్టు
నందున సభ్యుఁడై ♦ యలరినాఁడు
అలకోర్టులోన భా ♦ సిలునట్లొకప్పుడు
ప్రెసిడెంటుపదవిని ♦ బడసినాఁడు
మొగిఁగొంతకాలము ♦ మునసబుద్యోగమున్
జిల్లెళ్లపురమునఁ ♦ జేసినాఁడు
తలఁపళివిల్ క్రిమి ♦ నలు రివిన్యూలలోనఁ

వేసులనెన్నియో ♦ గల్పినాఁడు
ఆ. పౌలుపురియాటఁ గాఁబ్రి ♦ భుత్వమువారిచేఁ
బ్రిజలచేతమెప్పుఁ ♦ బడసినాఁడు
విపులరాజకీయ ♦ విదునివీరబ్రిహ్మ
ధీరునెన్నఁదరమె ♦ యేరికైన 23

— పారమార్థికచర్య —

సీ. స్వపురమందేకాక ♦ బహుజనపదములన్
గులసంఘముల నెల ♦ కొల్పినాఁడు
దీపింప శిల్పక ♦ ళాపరిమత్తులన్
బలుచోట్లనధిపుఁడై ♦ సలిపినాఁడు
శ్రీలిఁగంచు కడప క ♦ ర్నూల్మండలద్వయ
ప్రజనమహాసభల్ ♦ జరిపినాఁడు
అబ్బురంబుగ సభ ♦ లాంధ్ర విశ్వబ్రాహ్మ
ణజనమహాసభల్ ♦ నడిపినాఁడు
ఆ. వేదపాఠశాల ♦ వెలయఁగాస్థాపించి
తనదుయాజమాన్య ♦ మునను గొంత
కాలమలరఁజేసెఁ ♦ గానవీరబ్రిహ్మ
నామధేయునెన్న ♦ నలువవశమె 24

శా. అబ్బింబాగలి భారతావనికిఁగ ♦ ల్యాణంబు చేకూర్పఁ బం
చబ్రిహ్మాధ్వరమున్ బుధోత్కరము మెచ్చన్ జేసిజిల్లెల్ల వం
శాబ్రాశీందుఁడు సత్ప్రవర్తనుఁడు ♦ లత్యున్నత్యంబేర్చఁ డైనట్టిపే
రబ్రిహ్మయ్యఁడు సోమయాజియనఁగాఁ ♦ గాశించెఁ ధాత్రీస్థలిన్

— విఖ్యాతి —

సీ. మతవాదమున నిగ్గి ♦ ప్రతివాదివలనను
యోగ్యతాపత్రము ♦ నొందినాడు
కాదిమండలయుగా ♦ గ్రిసభన్ మతోద్ధార
కాంకమున్ బుధులచే ♦ నందినాడు
పలువిధసభలలోఁ ♦ బాల్గొని భాషించి
కవులపొగడ్తలు ♦ గాంచినాడు
మేదినిపై నరు ♦ ణోదయపత్రికన్
బ్రకటింపుచును గీర్తిఁ ♦ బడసినాడు
ఆ. మోదమలరువట్లు ♦ వైదిక లౌకిక
పారమార్థిక ప్ర ♦ వర్తనముల
వెలయుచును లెస్సఁ ♦ గలరె వీరబ్రహ్మ
ధన్యుఁడొకఁడు దక్క ♦ దలఁచిచూడ 26

— కృతిప్రేరణము —

క. అలవీరబ్రహ్మార్యుం
డెలమిఁ గృతినందినట్టి ♦ యీగ్రంథము నే
ఎలఁగగ రచియించుటకొక
విలసితకారణము గలదు ♦ వినుఁడది యెదినాన్ 27
సీ. నాదు మేనల్లుఁడు ♦ నాప్రియబంధువు
నాదు సతీద్వయీ ♦ సోదరుండు
వెలుదుర్తివాసుండు ♦ లలితవిలాసుండు
శ్రీపాదపన్వయ ♦ సింధువిధుఁడు

ప్రథితుఁడు గోటమాం ♦ బాపిరయాచార్య
నందనుండాశ్రిత ♦ చందనుండు
లలితాంబికా వేంక ♦ మలకనుజుండు సా
త్త్వికుఁడుసీతారామ ♦ మకువిభుఁడగు
గీ. సిద్దయాచారియును నేను ♦ సిద్ధయోగి
మతమునకు నొకసారినె ♦ మ్మనములలర
నేఁగిభక్తులవలన యో ♦ గీంద్రుకథలు
వినినయంతెనెనాయుల్లుఁ ♦ డనియెనిట్లు 28
క. మామావిన్నారము కద
సామాన్యుఁడెసిద్ధయోగి ♦ చర్చింపఁగనీ
వామాన్య చరితమును సు
ధీమండలి మెచ్చుగతి కృ ♦ తిన్ జేయఁగదే 29
సీ. ప్రథితనిరోష్ఠ్యని ♦ ర్వచన శుద్ధాంధ్రి హ
రిశ్చంద్రకథను ని ♦ ర్మించినావు
కడుచిత్రమగుత్య్రర్థి ♦ కావ్యంబనంగసా
రంగధరీయమున్ ♦ వ్రాసినావు
యాతురాద్యేకాద ♦ శాతురంబులతోడ
శౌరిశైశవలీల ♦ సల్పినావు
గద్యపద్యములఁజ ♦ కచఁగను మన్నముకొండ
భక్తవిజయమునే ♦ ర్పరచినావు
గీ. సత్యనారాయణవ్రత ♦ చరితమును శి
వవ్రిసన్నము వెంకటే ♦ శ్వరశతకముఁ

గోశవేంద్రాది శతకముల్ ♦ కృతిరచించి
క్షితినిబాగడొంది తారకా ♦ శ్రీపతికవి 30

క. సర్వబుధవిధేయుఁడవు చ
చతుర్విధ కవితావిశార ♦ దుండవుగద్యా
లోర్వీశాస్థాన కవివి
గర్వవిరహితుఁడవుగాదె ♦ కవిసింహాంకా 31

క. త్రివిధావధాన వేత్తవు
వివిధరసజ్ఞుఁడవు విపుల ♦ వేదాంతవిభూ
ధవసన్మానిత కృతిక
ర్తవు కాశీపతికవీంద్ర ♦ ప్రతిభాసాంద్రా 32

క. ఘనకవివగు నీకా పా
వనుకథ రచియించుటెంతొ ♦ పనిగాదిఁక దా
నిని నీవురచించినచో
కనకముమెఱుఁగిడినవెలయు ♦ గతినదివెలయున్ 33

గీ. గానఁదత్కథవెలయించి ♦ తేనినీదు
ఖ్యాతియాచంద్ర తారకా ♦ ర్కముగవెలయు
ననుచుఁబ్రేరేపణముఁజేయ ననుమతించి
కృతిరచించితి సిద్ధయో ♦ గీంద్రకథను 34

క. కూరిమినేనొక పరిశ్రీ
వీరబ్రహ్మమఠమునకు విచ్చేసి సభా
స్తారుల కోరికపై దై
వారఁగనలసిద్ధయోగి ♦ వరుకథఁజదువన్ 35

క. వినిజిల్లెల్లాన్వయ సం
జనితుఁడు మధ్వారిపుర ని ♦ శాంతుఁడు దీనా
వనుఁడగు వీరబ్రహ్మ
ఖ్యనయాన్వితాత్ముఁడనుప ♦ మానందుండై 36

— కవి ప్రశంస —

సీ. పలనాటిసీమలో ♦ పలుఁగలబోదిల
వీటిని వాసుని ♦ విశ్వకర్మ
కులభద్రదత్త స ♦ ద్గోత్రుఁబోకూరి సు
బ్బయకును రామల ♦ క్ష్మమకుఁదనయు
మహితకోటమకెల్ల ♦ మందయ కీశ్వరాం
బికకును లింగమాం ♦ బికకు ననుజు
లచ్చమ చిన్నమ ♦ లకువిభు సుబ్బరా
మయులక్ష్మినారాయ ♦ ణయులకిఁకను
గీ. సాంవర్తనమైనకో ♦ టీరమకును
రమ్యమతియైన వేంకట ♦ రామమకును
సిద్దయకును జనకునిఁగా ♦ శ్రీపతికవి
వరునిననుగాంచి యాతఁడీ ♦ కరణిఁబలికె 37

శా. ఆలోచింపఁగఁ బూర్వమందు మనరు ♦ ద్రాచారి శ్రీకృష్ణ భూ
వాలాస్థానకవీంద్రుఁడై తనరెవా ♦ హ్వానేడునీవట్లెగ
ద్వాలాస్థానకవీశ్వరుండవగుచున్ ♦ భాసిల్లితౌబిమ్మొరుల్
బోలన్ నేర్తురె విశ్వకర్మకులజా ♦ పోకూరుకాశీపతీ 38

సీ. గద్వాలభూవరా ♦ గ్రిణిసభాస్థలినీవు
కవిసింహబిరుదంబుఁ ♦ గాంచినావు
జటప్రోలుధారణీ ♦ శ్వరుసభాస్థలిసల్లి
కవిజటిలాఖ్యను ♦ గాంచినావు
గోపాలపేటధా ♦ త్రీపాలుసభనాఁడు
కవిశిరోమణ్యాఖ్యఁ ♦ గాంచినాఫు
వనపర్తి నేలుభూ ♦ వరుసభాస్థలిలోన
నగ్రతాంబూలంబు ♦ నందినావు
ఉయ్యూరుభూపాల ♦ కోత్తముచేఁజిత్ర
కవితాప్రవీణాఖ్యఁ ♦ గాంచినావు
ప్రథితపిఠాపుర ♦ రాజకుమారుచే
బహుళసత్కారముల్ ♦ బడసినావు
ఆత్మకూరునృపాల ♦ కామాత్యవరునిచే
కవిశేఖరాఖ్యను ♦ గాంచినావు
తాటికొండనృపాల ♦ తల్లజుచేనాఁడు
కవిపుంగవాఖ్యను ♦ గాంచినావు
బెళగంటిరామమరా ♦ ట్తిలకుని వలన స
త్కవికోకిలాఖ్యను ♦ గాంచినావు
తగఁజెన్నపట్టణాం ♦ ధ్రమహాసభన నవ
ధానప్రవీణాఖ్య ♦ నూనినావు
బెజవాడ శి. క. సభన్ ♦ బృదులచిత్రకవితా
పంచాననాఖ్యను ♦ గాంచినావు

మైసూరునేలురా • ణ్మణిచే మహాకవి
సన్మానమొందఁగా • జాలినావు
పృథులవీరబ్రహ్మ • పీఠేశుచేఁగలా
పరిపూర్ణబిరుదంబుఁ • బడసినావు
మంత్రాలయాస్థాన • మాధ్వజగద్గురు
వలనవార్షికమును • వడసినావు
అలచిన్నకండ్లకుం • టూగ్రిహారికునిచే
హస్తకంకణముల • నందినావు
రాగిశ్రీ పెద్దవీ • రయనామకునిచే మ
కరకుండలంబులన్ • గాంచినావు
వరప్రొద్దుటూరివి • శ్వబ్రాహ్మణులచేత
గండపెండేరమును • గాంచినావు
గీ. మరియువీరలవలె పెక్కు • మందియిడిన
వార్షికములను బంగరు • పతకములను
యోగ్యతాపత్రి ధనముల • నొందినావు
బాపురే విబుధుఁడవు కా • శీపతికవి 39
క. గద్వాలరాజవరునకు
విద్వన్మణులలరఁగ్రుతులు • పెక్కులునిడి ప్రాం
చద్వైఖరి విలసిల్లిన
సద్విశ్వబ్రాహ్మణుఁడవు • సామాన్యుఁడవే 40
క. తావకవిరచిత సిద్దయ
జీవిత చరితమును గృతిని • జేకొని సిను సం

భావింప నెంచినాఁడను
గావున నంగీకరింపఁ ♦ గదె కవిసింహా 41

వ. అనిన నేనందుల కంగీకరించినంతనే శ్రీ వీరబ్రహ్మాచార్యుం డానందించి నాటి పార్థివసంవత్సర మాఘబహుళ త్రయోదశి పూర్వాహ్ణ శుభముహూర్తంబున శ్రీమత్పోతులూరి వీరబ్రహ్మేంద్ర పుణ్యక్షేత్రంబున వేదోక్తంబుగా నన్న ర్చించి తాంబూల జాంబూనదాంబరంబుల నొసంగిన నే నత్యంత సంతుష్టాంతరంగుండనై తత్సత్కారంబున్ స్వీకరించి 42

గీ. అరయ మత్కృతికిని దగి ♦ నట్టిభర్త
సంఘటించె నటంచుఁ ద ♦ త్సభ్యులలర
నతనికిని సిద్ధయోగి చ ♦ రితమునపుడు
శ్రుతిహితమ్ముగఁ గృతినొసం ♦ గితిని ధృతిని 43

— షష్ఠ్యంతములు —

క. ధీరునకున్ సుగుణాలం
కారున కతులిత పరోప ♦ కారునకు సదా
చారునకు సూనబాణా
కారునకున్ వాహినీశ ♦ గంభీరునకున్ 44

క. దాంతునకుఁ నిర్గళ సు
స్వాంతునకున్ దీనవన వ ♦ సంతునకున్ శ్రీ
మంతునకనుపమ సమధిక
శాంతునకుఁ గీర్తి విజిత ♦ సత్కాంతునకున్ 45

క. వీరునకు కుజనకృత్య వి
దూరిత కవికారునకును ♦ దుర్వారిపురా
గారునకు రుచివినిర్జిత
సూరున కనవరత భూరి ♦ సువిచారునకున్

క. సూరిగణముఖ్యునకు వి
స్తారాభిఖ్యునకు సుకవి ♦ జన సఖ్యునకున్
శ్రీరాజిత లేఖ్యునకున్
వీరబ్రహ్మాఖ్యునకును ♦ బృథుసౌఖ్యునకున్ 47

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధియగునట్లుగా నేఁగృతి నొసం
గిన శ్రీ సిద్ధయోగి చరిత్రంబునకుఁ గథావిధానంబు నా
ద్యంతంబు నాకర్ణింపుమని యుత్కృతి భర్తన్ సంబోధిం
చి తెల్పం బూనితి నది యెట్లన్నను 48



శ్రీ ర స్తు.



# శ్రీ సిద్ధయోగిచరిత్రము.

కథా ప్రారంభము.



క. శ్రీ రమణీయ గుణాలం
కారా సువిచార నిర్వి ♦ కారా సారా
చారా మారాకారా
వీరబ్రహ్మాఖ్య ధీర ♦ శివు లోదారా 1

క. శ్రీ మదమేయ సమస్త
ధాత్రీమండలి నెసఁగు భరత ♦ ఖండమున మహీ
స్తోమ ధన కనక ధాన్య ర
మా మండిత మగుచుఁ గడప ♦ మండల మలరున్ 2

వ. అందు 3

సీ. సిరులతో నిగమ త ♦ త్పరులతో మేటి తీ
ర్పరులతో వాణిజ్య ♦ పరులతోడ
మణులతోఁ గృషికా ♦ గ్రణులతో సత్య భా
షణులతో శాంత భూ ♦ షణులతోడ
ఘనులతో నాశ్రితా ♦ వనులతో గాయనీ
జనులతో మాంగళ్య ♦ ధ్వనులతోడ
బహులతో వేశ్యల ♦ గుహలతో మేడ లం
గడులతో మేల్మి చా ♦ వడులతోడ

గీ. వసుల తోడను బతితపా ♦ వసులతోడ
పసుల తోడను భవ్యతా ♦ పసులతోడ
సతుల తోడను నీటివ ♦ సతులతోడఁ
బరగె ముదుమాల యన నొండు ♦ పురము జూడ. 4

క. ద్వైతా ద్వైత విశిష్టా
ద్వైతార్య మహాప్మదీయ ♦ బౌద్ధాదిమతో
పేతులుం గలరా పురమున
నీతిసమంచితులు స్వమత ♦ నిష్ఠాత్ములనన్. 5

సీ. దానధర్మాసక్తిఁ ♦ దనగు వారలె కాని
యన్యాయవర్తను ♦ లచట లేరు
సాధుసాంగత్యంబు ♦ సలుపు వారలె కాని
యజ్ఞులఁ జేరు వా ♦ రచట లేరు
ఉపకృతు లొనరింపు ♦ చుండు వారలె కాని
యపకృతుల్ సేయు వా ♦ రచట లేరు
ముక్తి సాధింపఁగా ♦ మొనయు వారలె కాని
యన్యజిజ్ఞాసువు ♦ లచట లేరు

గీ. అట్టివారలలో మేటి ♦ యగుచు శమద
మాదిసద్గుణ యుతుఁడు మ ♦ హాప్మదీయ
కులపవిత్రుఁడు సద్వైద్యు ♦ గోత్రవార్ధి
హిమకరుండనఁ బీరు వా ♦ హె బెసంగు 6

ఉ. చెప్పుడు పక్షపాతమొటఁ ♦ జేరిన వ్యర్థముగాను వాతెఱన్
విప్పుడు మేలుఁగూర్పనొక ♦ వేళవచించిన వాక్యమెయ్యెడన్
దప్పుడు సుంతయేని సుప ♦ థంబును వీడి చరించువారి తీ
రొప్పుడయారెయాతనిమ ♦ హాత్మ్యచర్యల నెన్న శక్యమే 7

క. మోదంబునను ఖురానను
వేదంబునఁ గల్గు ధర్మ ♦ విధిఁ గచజిత స
త్పాదంబిని యనఁ దనరిన
యాదంబీ బెండ్లియాడె ♦ నతఁడయ్యారే. 8

వ. ఇట్లుఁ బెండ్లియాడి తత్సతీ రత్నంబు నత్యంతాను
రాగంబున నేలుకొనుచున్నంత 9

సంతానకాంక్ష

మ. పతియే జీవుఁడు దేవుఁడున్ గురుఁడు స ♦ ద్బంధుండ
టంచున్ సదా
మతి నూహించి సపర్యలాతనికిఁ బ్రే ♦ మన్ జేయుచున్ బ్రాలు త
త్సతి యొన్నేండ్లకు సంతు గల్గమికిఁ జిం ♦ తన్ గృష్ణపక్షక్షపా
పతిబింబక్రియ రాను రాను గృశియిం ♦ పన్ సాగె వీక్షింపఁగన్ 10

ఆ. ఇటులఁ జింతతోడఁ ♦ గృశియింపుచున్నట్టి
ఇంతిఁ గాంచి నాథుఁ ♦ డిట్టులనియె
నెలఁత యిటులనీవు ♦ నిష్కారణముగఁ గృ
శింతు వేటికో వ ♦ చింపఁ గదవె. 11

గీ. ఒడలికేదైన జాడ్యమే ♦ పొడమె లేక
నిన్నుఁ బరులెవ్వరేని నిం ♦ దించినారొ
ఎఱుఁగకేమైన నపరాధ ♦ మే నొనర్చి
నాడనే తెల్పఁగదవె కాం ♦ తాలలామ. 12

ఆ. భూమియందు దొడ్డ ♦ శ్రీమంతులము గాము
కాని కలిగినంత ♦ లో సమసము
అన్ని విధములందు ♦ నంతయో యింతయో
కొఱఁత లేక జరుపు ♦ కొనుట లేదె. 13

శ్రీ సిద్ధయోగిచరిత్రము.

క. రూకలు లేవా సొమ్ములు
కోకలు లేవా భుజింపఁ ♦ గూటికి ననువో
నూకలు లేవా నేఁడే
త్మకలు లేవా మఱేమి ♦ లేవో చెప్పుమా 14

క. పరమాన్నమైన బాగుగ
నగవిడచి భుజించి యెఱుఁగ ♦ వాభరణములన్
ధరియింపవు నగ వెన్నఁడుఁ
గురులన్ దువ్వకొనవేల ♦ కొమ్మా చెప్పుమా 15

వ. అని కుచ్చి క్రుచ్చియడుగు ప్రాణేశ్వరుఁ గాంచి
యాదంబి యిట్లనియె. 16

ఆ. ప్రాణనాథ వినుము ♦ పరికింపఁగా మన
కెన్ని కలిగియున్న ♦ నేమి ఫలము
సంతు లేని దొండు ♦ చాలదే గేస్తుల
కింతకన్న లోప ♦ మేమి వలయు 17

గీ. తోడి చెలులాత్మజులఁ గాంచి ♦ దోసర వారి
యగ్గు ముద్దుల కానంద ♦ మందుచుండ
బాలకులు లేక దౌర్భాగ్య ♦ శాలనగుచు
వ్రీడ నుర్వీళులూరుచుఁ ♦ జూడవలసె 18

సీ. గార్హస్థ్యమునకు శృం ♦ గార కారకులైన
తనయులు లేని భ ♦ వనము వనము
బాధుజాలమును సం ♦ ప్రాప్తిగాఁ జేసెడు
కొడుకులు లేని వం ♦ గడము గడము
పైతృకవిత్తాను ♦ భవపాత్రులగు సత్పు
త్రులు లేని వి ♦ భూతి భూతి

వీక్షింప వంశాభి ♦ వృద్ధికిఁ దగిన సం
తతిలేని మానవా ♦ దితము దితము

గీ. వార్ధకావస్థ నెసఁసి చె ♦ వఁజెడియించు
కేని యటునిటుఁ దిరుగఁగా ♦ లేనియపుడు
సంతతముఁ బ్రేమతోడఁ బో ♦ షణ మొనర్చు
వరసుతులు లేని వారి జీ ♦ వమ్ము వమ్ము॥ 19

గీ. మొనసి యెవ్వరేని శుభకార్య ♦ ములకు నేఁగు
తరిని సంతతిలేని కాం ♦ త యెవ్వరైన
దుశ్శకునమని తిరిగి వ ♦ త్తురిలుఁజేర
నకట! గొడ్రాలి బ్రతుకేల ♦ యవనియందు॥ 20

చ. ప్రకటముగాఁగ మున్నుమన ♦ గ్రామమునందునాడినట్టినా
టకమున నామరుద్వతి క ♦ డఁగ మునికన్యలు మంచితీర్థ మం
టకచనుటల్ మృకండునిదృ ♦ ఢంబుగ బ్రహ్మసభాంగభటాళి కొం
చక మెడఁబట్టి నెట్టుట్లు ♦ సంతతి వారికి లేమినేకదా? 21

గీ. నాటకముఁ దిలకించిన ♦ నాటనుండి
నిమర కింటికిరాదు తిం ♦ డిఁదినఁబోవ
లోపలికిఁ బోదు నేనిఁక ♦ లోకమందు
నెట్టుల గొడ్రాలినై చని ♦ యింతునాథ॥ 22

ఆ. హితవుమాట వినఁగ ♦ దే గృహారత్నంచ
బాలకాయటంచుఁ ♦ బలుకు సూక్తి
బుధుల వలన వినమె ♦ పుత్రులు లేనట్టి
సదన మేల మర్త్య ♦ జన్మమేల॥ 23

క. తగని పాపరముల లోలప
సుగతులు గల్గించువారు ♦ సూనులెపో యా

ట్లుగఁ గానివో "యపుత్ర
స్యగతిర్నాస్తి" యనియెందు ♦ కందురు విబుధులి॥ 24

వ. అనిన నాదంబికి ప్రాణేశ్వరుండిట్లనియె 25

గీ. పాణినాయకి నీకింత ♦ భ్రాంతియేల
ఇటుల గొంతెమ కోర్కెల ♦ నేమిఫలము
సగముకాలము గడచిన ♦ సతికి నీకు
సంతుగల్గుట సంశయా ♦ స్పదము గాదె॥ 26

ఆ. పుట్టి కొన్నినాళ్లు ♦ పుత్రధర్మములను నె
సంగి యువలఁ బెరిగి ♦ శత్రులగుట
కనమె యిట్టిపుత్ర ♦ కాంత నీకేటికే
విమల మధుర వాణి ♦ కమలపాణి॥ 27

క. అరయఁగఁ బైగంబరు లెం
దరొ సంతానంబులేక ♦ తిగజ్ఞాన సుతో
త్కరమును గాంచియు సద్గతు ♦
లిరవొందఁగఁ గనుట వినమె ♦ యిహ పరములలోన్॥ 28

క. మనపురిని బుధులు నిత్యం
బును వచియించెడు పురాణ ♦ ములు వినమే శాం
త నవ శుకులు సంతానముఁ
గనిరే సద్గతులు వారు ♦ గాంచఁగలేదే॥ 29

చ. సంతతి గల్గనేని యిలు ♦ చక్క వికలాంగులుగా జనింప న
త్యంతము చింత రుగ్మతల ♦ సంభవిస న య్యాధి చింతసాక సే
శ్రాంతముఁజింతదుష్టులయి ♦ క్రాలినఁజింతయికన్ దమతన్ను ద్రోహ
చింతలు సంఘటింపఁ గను ♦ జేసెడు సంతును గోరనేటికే॥ 30

క. మగువా సంతతి లేదని
దిగులున వగచెదను కోర్కె ♦ తీరంగలదే
భగవత్కృప లేకుండిన
జగతిని సంతతిని బడయ ♦ సాధ్యము మనకున్. 31

వ. అనిన ప్రాణేశ్వరునకు నాదంబి యిట్లనియె 32

ఆ. ప్రాణనాథ నీవు ♦ పలికిన గతి భగ
వత్కృపను వహింప ♦ బడయరాని
కోర్కెలెందు గలవు ♦ గురుతరంబుగ దైవ
కృపను గాంతు నాజ్ఞ ♦ నీయఁ గదవె. 33

ఆ. మనసుఁ గల్గు విత్త ♦ మునఁ దగు పాటి దా
నములు మఱియు సద్వ్ర ♦ తము లొనర్చి
దైవకృపను వడతుఁ ♦ దత్కృపను సంతతిన్
గాంతు నాజ్ఞనీయఁ ♦ గదవె నాథ. 34

ఆ. అనిన నాలకించి ♦ యానెలంతుకతో ని
జేశ్వరుండు గాంచి ♦ యిట్టులనియె
ముదిత నీయభీష్ట ♦ మునుదీరఁ గాదాన
సద్వ్రతముల నీకను ♦ సలుపఁ గదవె. 35

వ. అని వల్లభుండనుజ్ఞనిచ్చిన నాదంబీ సంతోషితస్వాంతయై 36

సీ. ఉభవు నల్లాఖుదా ♦ యని సదా ధ్యానించుఁ
బెద్దల కొగి నొక్క ♦ ప్రార్థులుండు
కబిడీ పీర్లకు సరి ♦ గస్తులుఁ జేయించు
సముచితంబుగను నా ♦ డములు వేయు
సారె సారెకును గం ♦ దూరులు సేయించుఁ
దసర మకాల్వీలకు ♦ దక్షిణవిడు

రహిఁబక్కీర్లకు సమా ♦ రాధనల్ సేయించుఁ
    బైరంగులకు సే ♦ వ లొనరించు

గీ. మ్రొక్కు కులదేవతలకెల్ల ♦ ముడుపుఁ గట్టుఁ
జొన్నజండాల నెత్తించుఁ ♦ జిత్తములకును
బీదలకు లేదనక యిచ్చుఁ ♦ బెట్టుముందు
నెంతనిగణింతు నాయింతి ♦ సంతతేచ్ఛ (ప్ప) 37

వ. ఇట్లు సంతానకాంక్షఁ బెక్కు తెఱంగుల దానంబులొనర్చు నాదంబికి భగవదనుగ్రహంబున నెలదప్పి చూలేర్పడి క్రమక్రమంబుగా 38

సిద్ధయోగి జననము.

సీ. తెలుపెక్కు సతికి ము ♦ద్దుల కపోలములు నా
    స్తికులు నెమ్మొగములుఁ ♦ దెలుపు బార
నలు పెక్కు సతికి ని ♦ ర్మల చూచుకములు ధూ
    ర్తుల వదనంబులు ♦ నలుపు బార
బలు పెక్కు సతికి దు ♦ ర్బల వలగ్నము మహా
    త్ముల తపోనిష్ఠలు ♦ బలుపు మీఱఁ
బాలు పెక్కు సతికి సొం ♦ పుగ దేహమెల్ల సా
    ధుల హృదంభోజముల్ ♦ పొలుపు మీఱ

గీ. సలసల ఘటిల్లసతికి భూ ♦ స్థలిని గల్గు
కుటిల మతులెల్ల రకునల ♦ సటఘటిల్లఁ
బావ సజ్ఞాన మూర్తిగాఁ ♦ బాపునట్టి
పిండమాసతి కడుపులోఁ ♦ బెఱుగు కలిని॥ 39

క. సల్లఁగఁదగు మంటినిబలు
ఫుల్లఁగ నుండెడు పదార్థము ♦ ములుఁ దినఁ గోరుఁ

మెల్లఁగ వీచెడు సురటిన్
జల్లఁగ నేతెంచు గాలి ♦ సతిగోరు నెదన్॥ 40

క. పిండము తదుపరి నవగావ
మండిత జీవప్రయుక్తి ♦ మంజుల తర బా
లుండయి సతికడుపున మను
చుండెన్ ముందటికి పరమ ♦ యోగీంద్రుఁడుగాన్॥ 41

సీ. క్షోణి యాగర్భస్థుఁ ♦ జూడ నేగు ననంగ
వనిత రేవడిమన్నుఁ ♦ దినఁగఁ బూనె
జలమా చిఱుతఁ గాంచి ♦ వెలికి వచ్చెననంగ
నువిదస్మై ఘర్మ బిం ♦ దువులు వెడలెఁ
దేజమా బాలకుఁ ♦ దిలకింప డాసెనా
రాజీవ ముఖమేను ♦ దేజరిల్లె
ననిల మాశిశుమాటి ♦ కరసి వచ్చుననంగ
నతివయూర్పులవేగ ♦ మతిశ యిల్లె

గీ. గగన మాపాప సరసక ♦ రిగెననంగ
గలికి జఠరంబుఁ బెంపొంది ♦ గగనమయ్యెఁ
బంచ భూతప్రియుండయి ♦ పరగునట్టి
బాలుఁడామమ కడుపులోఁ బ్రబలు కతన॥ 42

వ. ఇట్లాదంబీ సతీమణి గర్భిణీ చిహ్నంబులతో నెలలు గడుపుచుఁ దొమ్మిదవ మాసానంతరంబు నందొక శుభముహూర్తంబున

మ. కనిమెన్ గేశజతేంద్రనీలు విలస ♦ త్ఫాండేందుఫాలున్ వినూ
తనసౌందర్యమావిశాలుఁబృథులో ♦ ద్యద్బాహుమూలున్ సుధీ

జనసంస్తుత్యగుణాలవాలునురుభా ♦ స్వచ్ఛీలు నత్యంత పా
వనశృంగారకపోలురమ్యతరశో ♦ భాజాలుసద్బాలునిఁ ॥44॥

ఆ. మాన్యుఁడైన ముద్దు ♦ మగబిడ్డఁ డుదయించి
నట్టికాలమందు ♦ నబ్ధి పొంగె
మలయ మారుతములుఁ ♦ బొలుపారఁగా వీచె
జీవకోటియుల్ల ♦ సిల్లె నహహా॥ 45

వ. అట్టియెడ నాదంబికి సుందరుండగు నందనుండుద్భవించె
నని యెఱింగి యిరుగు పొరుగు తొయ్యలు లెల్లరరుదెంచి
యాబ్బాలకుఁగాంచి 46

సీ. మొగము చందురుఁ గేరు ♦ ముక్కు సంపఁగి మీఱు
గనులుఁ గల్వల సౌరుఁ ♦ గినిసి దూఱు
నుదురు క్రొన్నెల నేలుఁ ♦ బెదవి కెంపును బోలుఁ
జెక్కులద్దముడాలుఁ ♦ జెనకఁ జాలు
భుజము లున్నతి మించు ♦ బొమలు సింగిణి నెంచు
సెఱులు దేటులసంచు ♦ నిగ్గడంచు
మేను మేల్మిని గెల్చుఁ ♦ గాని భారిని వాల్చు
గళము సంకున దల్చు ♦ కరణిఁ బోల్చు

గీ. నింతచక్కని శిశుఁగాన ♦ మెందునైన
నహహ శుభచిహ్నములఁగన్న ♦ నార్యులెన్న
భోగియేని మహాఘన ♦ యోగిగాని
తథ్యముగ నగుసుమ్మ నీ ♦ తనయుఁడమ్మ॥ 47

వ. ఇట్లు కాంతామణులెంతయో వర్ణింపుచుండఁగా జనకుం
డంత రంగంబున సంతసింపుచుఁ దొమ్మిదవదివసంబునఁ బురు

షుర్గావించి ముద్దులపట్టికిఁ బెద్దలయనుమతంబున సిద్ధయ యను నామకరణంబుఁ జేసి ఫకీరుల నన్నవస్త్ర దక్షిణ తాంబూలాదులతోఁ దృప్తినొందించి యిరువదొకటవ దివసంబున డోలారోహణ మహోత్సవంబొనరించునెడ ముత్తైదువల్ విచ్చేసి యబ్బాలు డోలనూపుచు 48

కం. జోజో ముద్దుల కూనా
జోజో తేజోవితాన ♦ శుభ సంధానా
జోజో విమల జ్ఞానా
జోజో సిద్ధాభిధాన ♦ సుగుణ నిధానా॥ 49

వ. అని జోలలుఁ బాడుచు బాలు నుద్దేశించి 50

సీ. జోల నూకొట్టుచు ♦ నాలించి నటులున్న
భక్తుఁడా ననిపల్కెఁ ♦ బడఁతి యొకతె
చలనంబు లేక ని ♦ శ్శబ్దాబుగా నున్న
మౌని యౌనని పల్కె ♦ మగువ యొకతె
తెప్పలార్పక యేక ♦ దృష్టి నించుకయున్న
జ్ఞాని యౌనని పల్కె ♦ చాన యొకతె
అరగన్ను వేసిలో ♦ నరయు రీతిగనున్న
యోగియౌనని పల్కె ♦ యువతి యొకతె

గీ. అహహా సిద్ధయ్య శైశవ ♦ సహజ వర్త
నంబు లెవ రెవ్వరికి నెవ్వి ♦ ధంబుఁ దోచు
చుండెనో యవ్విధమున న ♦ య్యువిద లెల్ల
భావిసూచన లేర్పడఁ ♦ బలికి రపుడు॥ 51

వ. ఇట్లు పొగడు చుండఁగా డోలారోహణ మహోత్సవంబొ సరించి శుక్లపక్షనిశాకరుని చందంబున దినదిన ప్రవర్ధమానుండై పెరుగుచున్న నబ్బాలునకు నన్నప్రాశనంబును గ్రమక్రమంబుగా మతాచార క్రియలును నెరవేర్చుచు నైదవ వత్సరంబున నొక్క శుభముహూర్తంబున సిద్ధయకు నక్షరాభ్యాసంబుఁ జేయించుటకు జనకుండు మహోపాధ్యాయునకు నప్పగింపఁగా 52

సిద్ధయోగి విద్యాభ్యాసము.

సీ. కొద్దికొద్దిగ వ్రాసి ♦ దిద్దఁ బెట్టిననాఁడె
 యోనమాలన్నియు ♦ నొప్పగించెఁ
బదియొంట్లుజూపి యే ♦ ర్పడ సంజ్ఞనెఱిఁగింప
 ఖర్వంబునకుమించఁ ♦ గా లిఖంచె
నొక కవర్ణమునకు ♦ నొగి గుణింతముఁ జెప్ప
 నన్నిఁటి కింతెకా ♦ యనుచు వ్రాసె
తెంఁడెక్కములను నే ♦ ర్పిన వెను వెంటనే
 పెక్కు లెక్కములు ♦ కల్పించి నుడివె

గీ. పద్యమును వ్రాయుమని చెప్పఁ ♦ జోద్యముగను
పొల్లుపోనీక వ్రాసి యిం ♦ పుగను జదివె
నురుదు గైర్వాణమును నట్లె ♦ సరగ నేర్చె
నహహ సిద్ధయనేర్పు నేం ♦ తని గణింతు॥ 53

ఆ. సరవిఁ బూర్వజన్మ ♦ సంస్కార ఫలమున
 బాలుఁడయ్యు శీఘ్ర ♦ కాలముననె

సకల కోశ కావ్య ♦ శాస్త్ర పురాణేతి
హాసములను సిద్ధుఁ ♦ డభ్యసించె 54

క. చిన్నగ గురుఁ డెఱిఁగించుట
కన్నన్ బదిరెట్లు హెచ్చు ♦ గాఁ జదువులు వే
ఱన్నేర్చుకొనియు సిద్ధయ
గ్రన్నన బడి వదలుకొనియెఁ ♦ బ్రాజ్ఞుండగుటన్ 55

వ. ఇట్లు బడిన్ వదలుకొని పూర్వపుణ్య ఫలవిశేషంబున జ్ఞాన బీజంబంకురించి వృద్ధియగుచుండఁగాఁ దటస్థించిన పెద్ద లసేవింపుచుఁ బదియాఱు వత్సరంబుల ప్రాయంబువచ్చువరకు సత్కాలక్షేపంబున్ జేయుచు 56

## సిద్ధయోగి ప్రవర్తనము

సీ. తన జీవరక్ష నా ♦ ర్థము పాటుపడిన య
ట్లన్యజీవుల రక్ష ♦ కై కడఁగు
పెఱవారలందులు గాను ♦ పింప మాత్యసమాన
...లంచు నెంతయు గౌర ♦ వించి చనును
సాధు సత్తముల ద ♦ ర్శనము ఘటిల్లి నఁ
బలు తెఱంగులను సే ♦ వ నొనరించుఁ
బరుల విత్తము కంటఁ ♦ బడిన మంటిని బోలె
చులకనఁగా నెంచి ♦ తొలఁగి పోవు

గీ. హితుల తన జన్మ్మలనుచును ♦ మతిఁ దలంచు
గురువులను దైవతంబుల ♦ కరణి నెంచుఁ

గీ. పరుల విత్తంబు గ్రుచ్చిళ్లు • వారికెపుడు
మానహాని తనూహాని • ప్రాణహాని
రాజశిక్షయు మఱి నిర్మ • రాజశిక్ష
గలుగుఁ గాపునఁ జౌర్యంబు • వలదెవరికి॥ 63

వ. అని యిట్లు బోధింపుచు బోధించిన ప్రకారముఁ దానాచ
రింపుచు నిక మోక్షంబుఁ సాధించు సదుపాయం బెయ్యది
యగునని యోజింపుచు 64

గురుసంఘటన కాంక్ష

సీ. బోనులేకెట్లు వేట • కానికిఁ జిక్కుఁ
శార్దూల ముఖదుష్ట • జంతు చయము
వలలేక యెట్లు బెస్త • వానికి లభియించు
జలమున వర్తించు • ఝషనికరము
ఉరులు లేకెట్లు కిరా • తరమణునకుఁ జిక్కు
వివశత వర్తించు • విహగపాళి
ఓడ లేకెట్లు నావి • కోత్తమునకుఁ జిక్కు
వార్థికావల నుండు • వస్తు వితతి
గీ. ముఖ్యముగ నెంచి చూడ ము • ముక్షునకు
సంతతాశ్రిత రక్షణా • సక్తియుక్త
మానసోత్పల్ల కంజాతుఁ • డైనయట్టి
సద్గురుఁడు లేక యెట్లు మో • క్షము లభించు॥ 65
ఆ. కాంచ సంత్ర తెల్వి • గలవానికైనను
దాతకైన ధర్మ • నేతకైన

ఆ. పిల్లవానికేమొ ♦ పిచ్చిబుట్టుచునుండె
నెడ్డెమాపుఁజూచు ♦ నేమ్యునవ్వుఁ
బిచ్చిబాలకునకు ♦ హెచ్చెకపూర్వమే
తగుచికిత్సఁజేయ ♦ నగునటంచు 71

గీ. కనుపడినవైద్యులకు నెల్ల ♦ దనయుఁజూప
వైద్యులాబాలకుని కేలు ♦ బట్టినాడి
పైనివేళ్లిడి తలనూపి ♦ పైకిఁజూచి
పెదవివిరచుచు నిటులఁ బ ♦ ల్కుదురయారె 72

సీ. బాలకునకు సీత ♦ పైత్యంబుచే మాంద్య
మేర్పడెనని వచి ♦ యించునొకఁడు
పిల్లవానికివాత ♦ పిత్తంబుచే పిచ్చి
గలుగుచుండెనటంచుఁ ♦ దెలుపునొకండు
ఈకుఱ్ఱనికిగాము ♦ సోకివికారమే
ర్పడియెనటంచును ♦ బలుకునొకఁడు
పగతులెవ్వరో వీని ♦ పైగ్రహంబుఁబ్రయోగ
మునుజేయ మతిచెడె ♦ ననునొకండు

గీ. తనరమందిచ్చినయముఁజే ♦ తుననునొకఁడు
యంత్రమిడిదయ్యమునడంతు ♦ ననునొకండు
మంత్రమునబాగుఁజేతు సు ♦ మ్మనియునొకఁడు
అజ్ఞులగువైద్యులింతెకా ♦ యవనినెందు 73

ఆ. పిల్లవానికేమొ ♦ పిచ్చిబుట్టుచునుండెఁ
బెండ్లిఁజేతురేని ♦ పిచ్చిగుదురుఁ

బిచ్చికఁ గరకెట్లు ♦ పెండ్లియోగ్యాలిఁక మీర
లకటయేమిసేతు ♦ రను నొకండు 74

వ. అనిపల్కువురు పలువిధంబుల నుడువు చుండఁగాఁ బీరు
సాహేబు నిజనందనుఁ గాంచి యిట్లనియె 75

క. నందననీచాపల్యము
మ్రిందింపఁగఁ జేయనీకు ♦ మందిప్పింతున్
బొందుగ భుజియించి మహా
నందముసౌఖ్యమునుగాంచి మ ♦ సంగదవరొయ్యా 76

సిద్ధయ్య

ఉ. పంచకులైధరిత్రియను ♦ వైద్యులమందులతోఁ బ్రయోజనం
బించుకలేదు లేదుమఱి ♦ యెట్లనినన్ గురువర్యభక్తశే
షాంచిత సత్ప్రసాదపర ♦ మౌషధసేవఘటించె నేని మ
చ్చంచలతోఁ గ్రిరోగము వె ♦ సన్ జనుసౌఖ్యముఁ గాంతు
నిత్యమున్ 77

తండ్రి

క. తనయా నిన్నొక భూతం
బనివార్యంబుగను బూనె ♦ ననివింటెనిగా
వునఁదీర్ఘమైన నిప్పిం
తును గ్రోలుము సౌఖ్యమందఁ ♦ దువుసికటముగన్ 78

కుమారుఁడు

ఉ. సప్పిమ్మ తెలాతిమాటలను ♦ నన్నొకభూతమె కాదు పంచభూ
తమ్ములు బూనె వానినియ ♦ థార్థముగా విడిపించి సౌఖ్యమున్

సముద్రమున్ సతంబునిడ • సద్గురు తీర్థము దప్పవేతు
ర్ధమ్ములసాధ్యమెట్లగుఁబ్రి• తావిరమింపుము నీప్రయత్నమున్

తండ్రి

గీ. ఎవ్వరో శాత్రిఘులు నీవ • యిన్ గ్రహాప్రి
యోగమును జేసిరనివింటి • బాగుపడఁగ
మేటిమాంత్రికు చేగ్రిహాో • చ్చాటనంబు
నొనరఁ జేయింతు నేమందు • వోయిసిద్ధ

కుమారుడు

క. కామాద్యరివర్గము నా
పైమాయాగ్రహమునొండు • బరపినది నిజం
బేమంత్రింబైనను న
న్నోమదుగురు మంత్రిమాప్రి • యోగమునడచున్ 81

వ. అనిపలుకుచుండఁగా నొకభిషగ్వర్యుండరుదెంచి సిద్ధయన్ బరీక్షించియారోగ్యవంతుండగు నీబాలకుని రోగిగానెంచినవారెల్లరును వెఱ్ఱివారగుదురుగాని చిదానందమూర్తియగు నీకుఱ్ఱవాఁడెన్నటికిని వెఱ్ఱివాఁడుగాడంతియే కాక కేవలజ్ఞాని బాలోన్మత్తపైశాచికుల చందంబునన్ గాన్పించుట సహజంబని యెఱింగించి చనినయంతనా యాదంబీపీరుసాహేబు లెంతయోసంతసించి యీతండీ చిన్నప్రాయంబుననే పరమజ్ఞానియై సంసారవిముక్తుండగునేమో వివాహంబుంగావించినన్ గాని భవపాశంబులన్ జిక్కువడనేరఁడని కన్యాన్వేషణాయత్తచిత్తులైయుండునెడ సిద్ధం

ఏకాకియై యొక్క దేవాలయంబునం బ్రవేశించి గురుచిం
తనంబున్ జేయుచున్న సమయంబున 82

సిద్ధయోగికి సదానందయోగీంద్రుడు ప్రసన్నంబగుట

గీ. బాలశశిఁబోలఁగాఁజాలు ♦ ఫాలమూల
మందుగంధము సిందుర ♦ మందమొందఁ
గేలఁగల పాలజపమాల ♦ కోలగ్రాల
నరిగెనొకజోగిసిద్ధఁడు ♦ న్నట్టిగుడికి 83

కం. వచ్చినమునిఁగని సిద్ధయ
చెచ్చెరఁబ్రణమిల్లి మౌని ♦ శేఖర యిటకున్
విచ్చేయుట యెటనుండి యి
యెచ్చోటికేగెదవో నాకు ♦ మెదియో చెప్పుమా 84

కం. అనముని దీవించియు ని
ట్లనె బాలక కందిమల్ల ♦ యపురంబునకున్
జని వీరబ్రహ్మంబుని
గని పుణ్యక్షేత్రములను ♦ గనఁజనుచుంటిన్ 85

గీ. కొంచెమిట విశ్రమించిపో ♦ నెంచివచ్చి
యున్నవాఁడ సదానంద ♦ యోగియనెడు
పేరువాఁడను నీసవి ♦ స్తారముగను
దెలుపుమన నతఁడెట్లేఁగింపఁ ♦ దెలిసికొనియు 86

వీరబ్రహ్మేంద్రచారిత్రము

గీ. సిద్ధనినుగనముందొక ♦ పెద్దతపసి
వగుదువనితోఁచెఁగాననీ ♦ యందునాకుఁ

కరుణజనియించి యలవీర ♦ గురునిచరిత
మొనర నెఱిఁగింపఁబూనితి ♦ వినఁగదయ్య 87

క. ఘనుఁడగు వీరబ్రహ్మం
ద్రుని చరితం బెవ్వఁడేని ♦ తోరప్రభక్తిన్
వినినన్ నుడివిన ముక్తిన్
గొనుఁగావునఁదెల్పబూను ♦ కొంటినివిను మా 88

వ. అనిపసిద్ధాండమందానంద కందళిత హృదయారవిందుఁడై 89

మ. మిమునే నీయొక మాన్యుఁదెల్పుఁడనికూ ♦ ర్మిన్ వేడ నూహింపుచో
తమరే తెల్పఁగ బూనుకొంటిరిఁకదు ♦ ద్భాగ్యంబు సామాన్యమే
అమితాశక్తి నివిందుఁదెల్పఁగదవ ♦ య్యాయంచునర్థింప శ్రీ
ఘ్రిమెయోగీంద్రుఁడుదెల్పఁగాఁదొడఁగెవీ ♦ రబ్రహ్మ చారిత్రమున్ 90

సీ. వినుశౌరిపోతులూ ♦ రనుపురంబందున
విశ్వకర్మాన్వయా ♦ విర్భవులగు
వీరనారాయణీ ♦ వీరభద్రులకుఁ జె
న్నారఁగా గోనదీ ♦ తీరమందు
జనియించిరానాఁడె ♦ జననీజనకులఁ గో
ల్పోయి యతిప్రమునీంద్రు ♦ పోషణమునఁ
బెరుగుచుఁ బాపఘ్ను ♦ పీఠేశునకు దత్తుఁ
డయ్యువీరంభట్లు ♦ టంచుఁ బేరు

గీ. వడసితల్లికి విశ్వరూ ♦ పమునుజూపి
హరిహరపురంబునకుఁజేర ♦ నటకుధేను
హత్యఘటియించి రాసుతుఁ ♦ డరిగితెల్ప
ముంగుపింజారి వైజన్మ ♦ మొందుదు వనె 91

సీ. అతఁడుముక్తినొసంగు ♦ మనుచు వేడుకొనఁబిం
జారివైపుట్టినన్ ♦ జేరలేని
అపవర్గమిదుదుఁబొ ♦ మ్మనుచుఁ దెల్పియు బన
గానపల్లెకుఁజని ♦ గరిమరెడ్డి
యచ్చమయింట వీ ♦ రప్పయనవాలఁ
గాచికాలజ్ఞాన ♦ గ్రంధమొందు
విరచించియామెకుఁ ♦ బరిపూర్ణబోధ నొ
నర్చి తత్సుతునకం ♦ దత్త్వముడిపి

ఆ. అందునుండిమఱియుఁ గందిమల్లయపల్లె
కరుగుదెంచి కూర్మి ♦ నటవసించి
ధీరులెన్నఁబోతు ♦ లూరి వీరబ్రహ్మ
మనెడుపేరుతోడ ♦ నలరుచుండె 92

సీ. రాజిల్ల శ్రీమద్వి ♦ రాట్పోతులూరి వీ
రబ్రహ్మదేశికేం ♦ ద్రుఁడొకక-
సుదినంబునందున ♦ బెదకొమర్లకుఁజేరి
శివకోటియాచార్యు ♦ భవనమునకు
నేగితాఁగొనిచన్న ♦ రాగిసంకటి చల్ది
నగిచితంబగురీతిఁ బంచభక్ష్య

పరమాన్నమొనరించి ♦ సరగఁదద్గృహమేధి
నందనమైన గో ♦ విందమయను

గీ. కాంతబెండ్లాడి యిటుఁజేరి ♦ సంతుపడసి
లీలలెసలారు తీరు ప్రో ♦ త్రేరుతోడ
నిష్ఠఁదెప్పించుకొనె నేడు ♦ నిజమతమున
శిష్యపరివేష్టితుండయి ♦ చెలఁగుచుండె 93

శా. కారుణ్యాకరుఁడాశ్రితావనుఁడుని ♦ ష్కాముండు సర్వజ్ఞుఁడున్
సాకారుఁడు నిర్వికారుఁడు మహా ♦ శాంతస్వభావుండు వి
స్తారోదారుఁడు సద్విచారుఁడు తప ♦ స్సంపన్నుఁడైనట్టి శ్రీ
వీరబ్రహ్మమహాత్మునెన్నఁదరమే ♦ విశ్వంబునందేరికేన్

సీ. తలజటాజూటంబు ♦ సితశిరోగ్రమువాఁడు
గంధాక్షతయుతాలి ♦ కంబువాఁడు
మందస్మితముఖార ♦ విందంబుగలవాఁడు
రవణిల్లునిడుపుగ ♦ డ్డంబువాఁడు
రుదురాక్షసరులచేఁ బొదలువక్షమువాఁడు
దండకమండలుల్ ♦ దనరువాఁడు
భూతివిరాజిత ♦ భూరిధామమువాఁడు
చారుకాషాయవ ♦ స్త్రములవాఁడు

గీ. మకరకుండలమంజీర ♦ మకుటకంక
ణాదిభూషలుగలవాఁడు ♦ ప్రోదిఛత్రి
చామరాందోళికలచేనె ♦ సంగువాడు
వీరనారాయణుండను ♦ పేరువాడు 95

ఆ. వెలయనాఘనుండె ♦ వీరభోగవసంత
రాయలనఁగనిక ధ ♦ రాతలమున
దుష్టశిక్షణమును ♦ శిష్టరక్షణమును
సలుపుకొఱకుముందు ♦ జననమొందు 95

క. లయమగు నరిషడ్వర్గము
వ్యయమగు మఱివాసనాత్ర ♦ యంబును వెసనం
క్షయమగుఁదాపత్రయము ను
దయమగు విజ్ఞానమతని ♦ దర్శించినచోన్ 97

వ. అనిసవిస్తరంబుగా మతమార్గయుక్తంబుగా నాక్షేపించిచికాలాతీతంబగునని సదానంద యోగీంద్రుండరుదెంచినయంతమదన శరంబులెడసోకి వ్యధనొందెడు సుదతికిఁగదనంగకదన కథనంబులు చెవినాటిమదితప్పిపృథివిఁ బడిన మదవతీమణివిధంబున సిద్ధండు గురుభక్తి పారవశ్యంబున మూర్ఛఁ జెందికొంతవడికిం దెలివినొంది తనమనంబున 98

సీ. శ్రీనివాసాంశజుం ♦ డైనయామహనీయుఁ
జెన్నారఁగాంచని ♦ కన్నులేల
భూభారమునుమాన్పఁ ♦ బొడమినయాశుభ
ప్రదువలగొననట్టి ♦ పదము లేల
ఆశ్రితావనదీక్ష ♦ నవతరించినయామ
హార్షికిఁ మ్రొక్కని ♦ శీర్షమేల
చిరమహిమాసమం ♦ చితుఁడైన యాజగ
ద్గురుని పూజింపని ♦ కరములేల

సీ. ఆమహాత్ముని నామమం ♦ త్రమెవ్వరికి
నెసకమెసఁగఁగ మెసవని ♦ రసనయేల
ఆతఁబోధను సద్బోధ ♦ లాలకించి
విస్తృతానందమొందని ♦ వీనులేల 99
గీ. తొలిభవంబున గోహత్య ♦ సలిపియురల
నేడుపితృజారిజాతిజ ♦ న్మించినట్టి
రాయఁడను జూడనేనాయె ♦ మోయటంచు
మానినుడువులచే నను ♦ మానమొదవె 100
ఆ. ఐనఁగాకయున్న ♦ నామహాత్ముని జేరి
మొక్కి సేవఁజేసి ♦ మోక్షపథము
గాంచవలయునట్లు ♦ గానిచో నాకిఁక
జగమదేల మర్త్య ♦ జన్మమేల 101

సిద్ధయోగి శివబ్రహ్మేంద్రుని జేరఁబోవుట

చ. చెలువుగ వీరసద్గురుని ♦ జేరఁగ నేగెదనన్నఁదల్లిదం
డ్రులుమనసొప్పినన్నటకు ♦ రూఢిగఁబోవఁగనీయరందుచేఁ
దొలఁగకమున్నె నేవినిన ♦ తోవనెపోయెదనంచు నేరికిం
దెలుపగనొంటిగా బయలు ♦ దేరిమఠంబున కేగుచుండగన్
క. కోరికసిద్ధయి చనునెడ
దూరముగా నెవ్వరేని ♦ తోతెంచుచు ను
న్నారని తోచిన వెంటనె
దారిఁదొలఁగి కానరాక ♦ దాగుచు నేగున్ 103
వ. ఇట్లుపశ్చిమాభిముఖంబుగాఁ గోశద్వయంబరుగు దెంచి

యిట్టిమతంబొకటి శ్రీశైలంబున్నదని గారటన్ గలసదరణ్యం
బున్గాంచి ప్రవేశించి 104

సీ. సత్యలోకముఁబోలె ♦ శారదాహేమజ
    దరమల్లికాదులన్ ♦ గరిమదనరె
వైకుంఠమునుబోలె ♦ శ్రీకేశవోదార
    మన్మథాదులవిని ♦ ర్మతలఁగ్రాలెఁ
కైలాసమునుబోలె ♦ ఘనపార్వతీశివ
    వృషకుమారాదుల ♦ నెసఁగుచుండె
నమరావతినిబోలె ♦ యమరశచీశక్రి
    దివ్యరంభాదులఁ ♦ దేజరిల్లె

గీ. నలఘుమంజుల నారాయ ♦ ణాశ్రమమును
బోలెశాండిల్య నారద ♦ గాలవాది
భవ్యపరులను శుకభర ♦ ద్వాజతిత్తి
రులనుదగ నీవనమునెన్న ♦ నలవియగునె 105

సీ. కంఠీరవేభముల్ ♦ గలసినేస్తముఁజేయు
    వ్యాఘ్రధేనువులున ♦ ఖ్యమునమెలఁగు
మృగతరక్షువులుమై ♦ త్రిగవిహారించుచు
    శ్యేనశశంబులుఁ జెలమినలరు
ఛాగవృకంబులున్ ♦ జనువునవర్తించు
    నకులసర్పములుమ ♦ చ్చికఁదనర్చు
మూషకమార్జాల ♦ ములుహితంబునఁగ్రాలుఁ
    గాకఘూకములాప్త ♦ గతినెసంగు

గీ. నారయుటనిట్లు జంతువుల్ ♦ వైరరహిత
వృత్తి మెలఁగుట యీదివ్య ♦ విపినసీమ
మధ్యవెసలారు శ్రీకంది ♦ మల్లయపురి
మఠమునందుండువీరేశు ♦ మహిమగాదె 106

వ. ఇట్లువర్ణింపుచుఁ దద్రమణీయారణ్యమధ్యంబున 107

చ. అటఁ జనికాంచెసిద్ధుఁడుస ♦ మున్నతగోపురగణ్యమున్ మహో
త్కటశిఖరాయితాసమవి ♦ కాసహిరణ్యముఁ గుడ్యరూపక
స్ఫటికవరేణ్యమున్ బ్రథిత ♦ భక్తశరణ్యముఁ బ్రాంచదావృత
స్ఫుటసదరణ్యమున్ సహిత ♦ పుణ్యముదివ్యమతాగ్రగణ్యమున్

క. శ్రీకరగోపురమండప
ప్రాకారధ్వజవరాంత ♦ రాళద్వారా
నీకకవాటాయత నా
లోకన్యుఁ డైవీరు గురుని ♦ లోకింపజనెన్ 109

గీ. పగి శ్రీపోతులూరివీ ♦ రేశ్వరునకు
శిష్యజనములు పదపూజఁ జేయుచున్నఁ
గాంచి తలవంచి జోతల ♦ ర్పించి యతఁడు
దిన్నఁగా వీరగురునామ ♦ మెన్నికొనుచు 110

ఆ. మున్నువిన్నదాని ♦ కన్నమిన్నగుఁదోచు
చున్నగురునిచెన్నుఁ గన్నులారఁ
జూచిసంతసించి ♦ చోద్యమైముకుళిత
హస్తకములుఁడగుచు ♦ నచట నిలిచి 111

సీ. అలమహాత్మ్యనకుళి ♦ ష్యులువీచుచామరం
బులగాలితనమేని ♦ కెలమిఁగూర్ప
భగవదంశోద్భవుం ♦ డగుపీరగురుమూర్తి
తననేత్రములకు సం ♦ తసముసూన్ప
నటఁగల్గుమంగళ ♦ స్ఫుటతూర్యములు దన
వీనులకెంతయో ♦ వీందొనర్ప
నొగి వీరగురుసమా ♦ ఖ్యోచ్చారణము దన
రసనకు సంతోష ♦ రసమునొసగఁ

గీ. దస్థలిన్ గల్గుపరిమళ ♦ ద్రవ్యవితతి
తనమునాసకునామోద ♦ మొనయఁజేయ
సమతఁజ్ఞానేంద్రియములైదుఁ బ్రముదితంబు
లగుటసిద్ధుఁడు పారవ ♦ శ్యమును జెందె 112

వ. ఇట్లుపంచేంద్రియ పారవశ్యంబుననుండి కొంతవడికిగురుపూజాపరిసమాప్తంబైనయంతనే యాజగద్గురునకుఁ బ్రదక్షిణాంబుసేయుచు 113

సీ. శ్రీరమణీమణి ♦ జీవితేశ్వర సమ
గ్రాంశోత్తమావతా ♦ రాజ్ఞొహారు
విశ్వకర్మాన్వయ ♦ శశ్వత్సుధాసాగ
రాభోగకు ముదబు ♦ తాజ్ఞొహారు
అనవరతాగణి ♦ తాశ్రితాళ్యవన వి
ద్యావిశేష విశార ♦ దాజ్ఞొహారు
రాజితశ్రీమద్వి ♦ రాట్పోతులూరి వీ
రబ్రహ్మదేశికేం ♦ ద్రాజ్ఞొహారు

గీ. అనవధికసర్వలోకపూ • జ్యా జోహారు
స్థితగతాగత కాలవే • దీ జోహారు
రమ్యజగదేకయోగీశ్వ • రా జోహారు
మహితసద్గురుసార్వభౌ • మా జోహారు 114

వ. అనియిట్లు స్తుతియింపుచు సాష్టాంగదండప్రణామంబులాచ
రించి నిలిచినసిద్ధయుఁ గాంచి సుఖీభవ సుఖీభవ సుఖీభవ
యనియాశీర్వదించి శ్రీ వీరబ్రహ్మేంద్రుఁ డిట్లనియె 115

క. ఊరెయ్యది నీకెసఁగిన
పేరెయ్యది నీకులము • పేరెయ్యది నీ
తీరెయ్యది తెల్పనొక
మారెయ్యది వినఁగ నీకు • మాటలెవిందుఁగ 116

మ. అనిసన్ సిద్ధయమోదమొందివినుమో • యార్యా భవద్దర్శనం
బున నేధన్యుఁడనైతినాస్థితినిఁ గన్ • బాల్యోందఁగావిన్నవిం
తునదెట్లన్న మహాత్మ్మదీయులతెగన్ • మూదేకుజాతిన్ జనిం
చినవాఁడన్ ముదుమాలనామపురవా • సిన్ బేరునన్ సిద్దఁడన్

సిద్ధయ్య వీరబ్రహ్మేంద్రునకుఁదనకోర్కను దెల్పుట

చ. గురువరత్వత్సమీపమున • కున్ జనుదెంచుటయందుఁ గన్నసు
స్థిరగతులిచ్చునీసదుప • దేశమునొంది భవాబ్ధిదాటి నేఁ
బరమపదంబుఁ గాంచుటకు • భక్తిఁ దలిర్పఁగవచ్చితిన్ భవ
త్కరుణనుజూపినాకిపుడు • కారణ మీయఁగదయ్య
మ్రొక్కెదన్ 118

గీ. భక్తసులభుఁడవనుచు స • ద్వక్తవనుచు

శ్రీరమరసస్మాణివనుచర ♦ తీరంతువనుచు
సమ్మతిని నీవు చిత్తము ♦ నాదు భాగ్య
మెటులగలదో నీకియే భార ♦ మింక నుదేవ 119

వీరబ్రహ్మేంద్రులుపరమపథము సామాన్యము కాదనుట

క. అనిపలికిన సిద్ధునిగనుఁ
గొని చిఱునగవునను వీర ♦ గురువర్యుండి
ట్లనెనో రిసిద్ధ మది యో
జనఁజేయఁగ మోక్షపదవిన ♦ సామాన్యంబే 120

సీ. అంతరింద్రియదర్ప ♦ మడఁగించి గురుమంత్ర
మింపార నెపుడుజ ♦ పింపఁగలవ
కర్మేంద్రియములలొం ♦ గఁగఁజేసినిఖిలా స
నములనభ్యాసము ♦ సల్పఁగలవ
జ్ఞానేంద్రియములపో ♦ కడమట్టు పరచియుఁ
బంచముద్రలనభ్య ♦ సించఁగలవ
ప్రాణేంద్రియంబుల ♦ బంధించి యష్టాంగ
యోగంబులను నేర్వ ♦ నోపఁగలవ

గీ. పంచభూతసమంచత్ప్ర ♦ పంచకమును
మిథ్యయనియెంచి నిరపేక్ష ♦ మెరయఁగలవ
అర్భకుఁడవీవు కష్టసా ♦ ధ్యమగునట్టి
పరమపథమెవ్విధమునీకు ♦ దొరుకుసిద్ధ 121

క. అరయఁగసాధనములచే
నరిషడ్వర్గమునుదర్ప ♦ మడఁగింపకయే

కరణీనవాగ్మైనసగో
చరమగు మోక్షములభించు ♦ జడులకుసిద్ధా 122

గీ. అందరానట్టిఫలముల ♦ కొఁసజెంది
హస్తములుసాచి నిష్ఫలుఁ ♦ డైనవాని
యటులఁబరికింపదుర్లభ ♦ మైనయట్టి
పరమపధకాంక్షనీకుని ♦ ష్ఫలముకాదె 123

ఆ. మఱియునంతెకాళ ♦ మధుమాంసభక్షకు
లగుమహమ్మదీయు ♦ లందు జనన
మైనసీసుఁదద్దు ♦ రాభ్యాసములుగల్గ
కెట్లుతొలఁగుజ్ఞాన ♦ మేలగలుగు 124

క. కొద్దిదినీప్రాయము బలు
పెద్దదినీమదినిగలయ ♦ భిప్రాయము నీ
కద్దిరబాలకునకు నో
సిద్ధాకైవల్యమెట్లు ♦ చేకురుఁజెపుమా 125

క. బాల్యమున సహజమగు చా
పల్యముఁబోనాడి మఱియు ♦ భక్తికుదిరి సా
శీల్యమగుయోగమెనసి య
మూల్యంబగునట్టిమోక్ష ♦ మెఱగనుబెల్లా 126

క. భద్రముగశైశవంబున
నిద్రాహారములుమాని ♦ నిష్ఠాత్ముఁడవై
ముద్రాసన యోగంబులఁ
జిద్రూపమెఱుంగ నభ్య ♦ సింపఁగలవా 127

క. నాపుఁడుపీరగురున్ గని
దేవా తామిటులఁబలుకఁ ♦ దెఱవెయ్యది మీ
రేవిధిఁబలికినమిమువిడి
పోవనుగారణ మొసంగి ♦ పోవకయున్నన్ 128

శా. బాల్యంబందున నేయటంచు వినమే ♦ ప్రహ్లాదుఁడబ్జాక్షుని
స్తుల్యప్రేమనుగాంచి భూతలమునం ♦ దఁబెద్దకాలంబుఁ బ్రా
బల్యప్రాభవభోగభాగ్యములచే ♦ భాసిల్లి యామీఁదఁ గై
వల్యంబున్ గనుటల్ల నే నెఱుఁగనే ♦ త్వత్ప్రేమఁజూపించినన్

ఆ. బాల్యమువనకాదె ♦ పరగమార్కండేయుఁ
డభవుకరుణ వడసి ♦ యముని గడచి
అమృతుఁడాయెభక్తి ♦ యందునఁదలపోయఁ
చిన్నయేమిమఱియుఁ ♦ బెద్దయేమి 130

ఆ. ఇలమహాత్మ్మదీయ ♦ కులమునందున జని
యించినాఁడఁగాని ♦ యెన్నఁడేని
నీదుపాదమాన ♦ యేదురభ్యాసముల్
జేసియెఱుఁగముందుఁ ♦ జేయఁబోను 131

క. నీవే తండ్రివి గురుఁడవు
దైవమవని నమ్మికొనియు ♦ ద్వత్పదయుగరా
జీవములుగొలువ వచ్చితిఁ
బ్రోవఁగదేసద్విచార ♦ భువనాధారా 132

గీ. యోగమో యాసనమొ ముద్ర ♦ యోజపంబొ
తపమొ తెల్పుము సాధింతుఁ దత్క్షణంబె

తుదకి కేగోపురంబెక్కి ♦ దూకుమనిన
దూకుచాను గాని వెనుదీయ ♦ లోకపూజ్య 133

సీ. ఇచ్చి ననునీవె యుపదేశ ♦ మీయవలయుఁ
గాంచినఁ నేనె మోక్షముఁ ♦ గాంచవలయుఁ
గాక నీ వీఁక నుపదేశ ♦ మీయకున్నఁ
బ్రాణములు మేనఁ బూనని ♦ పాదమాన 134

పీరుసాహేబు కుమారుని వెదకుట

ఆ. ఇటులనిచటనుండ ♦ నటముడుమాలలో
సిద్ధఁడింటి కెంత ♦ సేపటికిని
జేరకున్నఁ గాంచి ♦ చిత్తంబునందున
జనకునకును భీతి ♦ జనకమగుట 135

ఆ. ఇంతసేపు బాలుఁ ♦ డింటికి రాఁడేల
ఎందుఁ బోయెనాతఁ ♦ డెచటనుండె
నేమిదోచదాయె ♦ నిఁక నెట్లు సేయుదు
వెతకవలయునంచు ♦ మతిఁదలంచి 136

క. ఆవేళనిల్లునిల్లున్
జావడులన్ బడులగదుల ♦ సత్రములనొగిన్
బావులఁ జెఱువులఁ గుంటలఁ
నేవియుఁ బోనీక వెదకె ♦ నెంతయుఁ జింతన్ 137

ఆ. వెదకి వెదకి మిగుల ♦ వేసారి పథికుల
నడిగి యడగి యెందుఁ ♦ గొడుకు జాడ
తెలియకార్తితోడఁ ♦ గులసతి కడకేగి

గ్రుడ్లనీరు గ్రుక్కఁ ♦ గొనుచుఁ దెల్ప 138

సిద్ధనిగానక యాదంబ విలపించుట

గీ. తెలిపినంతనె యాచేడె ♦ యులికిపడియు
నిట్టనిలువున గొబ్బున ♦ నేలవ్రాలి
కొడుకుఁ దలఁచుచుఁ దలమోది ♦ కొనుచు నెల్ల
రేఁగుదెంచఁగ నెలుఁగెత్తి ♦ యేడ్వసాగె 139

గీ. లేమలందరివలెఁ గాక ♦ లేక లేక
కలిగెనాకొక్కఁగాని యొ ♦ క్కకొడుకనుచుఁ
బ్రేమదళుకొత్తఁగానిను ♦ బెంచుచుంటి
నట్టినను వీడి చనన్యాయ ♦ మటర సిద్ధ 140

ఆ. ఎందుఁ బోయినాడ ♦ వెచ్చటనున్నాడ
వింటికేఁగుదెంచ ♦ వెందువలన
మహిని శేషముగను ♦ మనియుంటివో లేవొ
ఎవ్వరేని దెల్ప ♦ రేమిసేతు 141

సీ. నతులార మీరలె ♦ చ్చట నైనఁ గంటిరే
మాతనూజుని బోలు ♦ మాతనూజు
వృద్ధులారా యెందు ♦ నేన్ గంటిరె మహాత్మ
దీయజాతుఁడగు మ ♦ దీయజాతుఁ
గర్షకులారయె ♦ క్కడనైనఁ గంటిరే
మత్తనయుండైన ♦ మత్తనయుని
బాలకులారయే ♦ పట్ల నేన్ గననామె
నాకొమరునుమించు నాకొమరుని

ఆ. ప్రాజ్ఞులారపరీక్ష ♦ పరికించి తెల్పరే
కువలయాప్తుఁబోలు ♦ కువలయాప్త
నరయ లేదె పథిక ♦ వరులార భ్రాజిత
సారసహితుఁడైన ♦ సారసహితు 142

ఆదంబి గద్దెనడుగుట

గీ. అనుచు దుఃఖింపుచుండఁగా ♦ నళివయొకతె
పురమునందున నటనటఁ ♦ దిరుగునట్టి
ఎఱుకసానినిదోడ్కొని ♦ యేగుదెంచి
కడురయంబున నాదంబి ♦ కడకుఁజేరి 143

క. అమ్మా చింతించుట లా
భమ్మా యొక యెఱుకసాని ♦ వచ్చెనిదే సూ
సుమ్మా గద్దెనడిగి కనుఁ
గొమ్మా నీకొడుకుజాడఁ ♦ గొమ్మా లెమ్మా 144

గీ. అనిన నాదంబి దుఃఖంబు ♦ నాపికొనియు
పీడ్యమును ధూపదీపనై ♦ వేద్యదత్తి
ణాల నెఱుకసాని కొసఁగియుం ♦ పలరనున్న
దుండి నటు దెల్పు మెఱుకుల ♦ దుండి యనిన 145

ఆ. ఎఱుకసాని యాత్మ ♦ నిటు లెంచ నీయవ్వ
పుత్రికునకుఁబిచ్చి ♦ పుట్టెననుచు
వెదకనెందుఁగాను ♦ పించ లేదనుచు బు
ధానువర్తి యనుచు ♦ నేనువింటి 146

క. పౌరులు వర్ణించెడు సుకు

మూరతగలబాలుఁగంది ♦ మల్లయపురిలో
వీరబ్రహ్మాయుకడనే
నారసితిన్ నిన్నసీతఁ ♦ డతఁడోయేమో 147

ఆ. పిచ్చివాఁడుగాను ♦ పింపమినేనీటి
పట్టునందాపాలిసి ♦ నట్టుఁదోఁచు
సాధులోలుఁడకుట ♦ నాధన్యకడఁజేరె
నాయటంచుఁదోఁచు ♦ నాదుమదికి 148

క. కావుననాతఁడు పోలిసిన
జావకజీవించియున్న ♦ సరిపోవుసటుల్
భావద్వయముగఁడెల్పెద
నావిధమునఁగాకనాదు ♦ యశమెటుదకుఁగా 149

వ. ఆనితలపోయుచు నెఱుకసాని కొల్లాపురమ్మను ధూపదీప నైవేద్యదక్షిణ తాంబూలాదులతోఁబూజించి యాడంబీ చేత నొకచిట్టికోలఁగబట్టించి తనకేలఁగీలించి గద్దెకు ముమ్మారుప్రొక్కించిపోవఁజెప్పందొడంగెనదియెట్లన్నను

ద్విపద

శ్రీశైలప్రబలాంబ ♦ చిరజగదంబ
కాశీవిశాలాక్షి ♦ కంచికామాక్షి
శ్రీరంగనగరీశ ♦ శ్రీవెంకటేశ
ద్వారతీధామ ♦ భద్రాద్రిరామ
హంపీవిరూపాక్ష ♦ యాశ్రితరక్ష
యింపారదృవవాకుఁ ♦ లీయరేనాకు

ఆపంబిరోయిఁక ♦ నాలింపఁగదవె
సోదెనన్నఁడుగుట ♦ సుతునకై కాదె
అరయఁగా మునలోక ♦ మందున లేదు
పరలోకగమనుఁడై ♦ బ్రహ్మమ్ముఁ గలిసె
నెంతయేడ్చినమరా ♦ డేటికీచింత
సంతు లేదని లోవి ♦ సర్జించుకొనుము
పరిశసనెదవా ♦ యిటకుఁ బ్రొద్దిశన
కాగమ్మపడమర ♦ గ్రామంబునందు
గురుతరంబుగ నునీ ♦ కొడుకొకఁడు సరసు
దరికరుదెంచియం ♦ దలివారిలోన
నడుగుఁబట్టియుఁదీవ ♦ మానియుబ్బుచును
బుడతఁడుండెను కేప్పు ♦ పొద్దునఁదేలు 151

క. అనియెఱుకత దెల్పినయం
తనసుతుఁడు గతించినట్లుఁ ♦ దలఁచి వెసన్ ధా
త్రినివ్రాలిపొరలి పొరలియు
ఘనముగ నాదఁబియేడ్వఁ ♦ గా సాగునెడన్ 152

క. ఇదిమంచి సమయమనుచును
మది నెంచి మహమ్మదీయ ♦ మానినితనకు
గదియించిన కానుకల నెఱు
కుడిసంచిన్నించి జారు ♦ కొనె నందడిలోన్ 153

వ. అంతనాదంబీకుమారున్ దలంచుచు నివ్విధంబున విలపింపన్
దొడంగెనదెట్లన్నను. 154

గీ. వార్థకము సంఘటించెడు ♦ వరకు సంతుఁ
గాంచ నేరక దుఃఖాబ్ధిఁ ♦ గ్రాగి క్రాగి
ఎన్నియో నోములను నోచి ♦ నిన్నుఁ గంటిఁ
గాని యిటు లొంటకలనైనఁ ♦ గానసిద్ధ 155

ఆ. నీకుచక్కఁదనము ♦ నీ ముద్దుమాటలు
నీపవిత్రతంబు ♦ నీదు భక్తి
నీదు ప్రేమ నింక ♦ నే నెట్లు మరచి యీ
ధాత్రిపైని మెలఁగు ♦ దానసిద్ధ 156

ఆ. ముదిమి మమ్ము సాకి ♦ తుదిమమ్ముఁ జేసి సాం
బ్రాణి వేయు నిఁకథ ♦ రన్ బరంబు
సంపు గతులు గల్గు ♦ పని యొంచితివి గాని
ఇట్లు సేతువనుచు ♦ నెంచ మెప్పుడు 157

ఆ. తోడి బాలకాళి ♦ తోనాడికొని వచ్చి
ఆకలగుచునున్నఁ ♦ దన్నమున్న
పెట్టుమనుచునన్నఁ ♦ బిలుచువా రెవరింక
కుంభినీప్రసిద్ధ ♦ కొడుకసిద్ధ 158

ఆ. పెండ్లిఁ జేసి యవలఁ ♦ బేర్మియుసియును నీవుఁ
గాఁపురంబు సేయఁ ♦ గల్గినట్టి
పిల్లవాండ్రనెత్తి ♦ పెంచి ముద్దాడెద
ననెడి కోర్కెలన్ని ♦ యవనిఁ గలిసె 159

ఆ కుక్షియందె నేర్చు ♦ కొంటివో యెమునీ

వెల్లవిద్యలొకట ♦ యేడనేర్చి
రహింసహింసయేప ♦ రమధర్మమని బోధ
సేతువిప్పుడెంతుం ♦ బోతిపయ్య 160

ఆ. జ్ఞానివగుట తెలియఁ ♦ గాలేక యున్నత్ర
మంకురింపుచుండె ♦ వనితలంచి
వెజ్జులకునుజూప ♦ వేదాంతమును మాకు
బోధసేతువెందుఁ బోతివయ్య 161

ఆదంబీకి కుమారుండున్న వర్తమానము తెలియుట

వ. అనివిలపింపుచుండఁగా ముదుమాలనివాసుండొకండు కం
దిమల్లయపురంబున నుండివిచ్చేసియాదంబీతో నిట్లనియె 162

క. అమ్మానీకొమరుఁడు ని
కమ్ముగ వీరగురుపదయు ♦ గమ్మనుమదిలో
నమ్మిభజియింపుచును ♦ షే
మమ్ముగనున్నాడు కంది ♦ మల్లయపురిలోన్ 163

క. అలపురమున కే నొకపని
గలిగియునిన్ననట కేగి ♦ గడచినరాత్రిఁ
దిలకించితి నీకొమరుని
విలపింపకుమమ్మసోదె ♦ వినివగచుదురే 164

ఆ. అనిననాలకించి ♦ యాదంబియును బీప
సాహెబెంతొసంత ♦ సమునుజెంది
పుణ్యపురుషమాకుఁ ♦ పుత్రునిశుభవార్తఁ
దెలుపుకతనబ్రతికి ♦ తిమిగదయ్య 165

ఆ. ఈవెతెలుపకున్న ♦ నేమీామహాదుఃఖ
జలధిమునిగి ప్రాణ ♦ ములనువీడ
వలసివచ్చుమమ్ము ♦ బ్రతికించితివి నీను
మేలుమరుతు మెక్క ♦ పాలవాల 166

క. నిక్కముగఁజూచితివ యొక
సక్కముులాడెదవ వగపు ♦ శమియించుటకై
టక్కులుబలికితివా మఱి
వక్కాణించుమొకసారి ♦ వరసుతువార్తన్ 167

గీ. అనవుఁడావార్తఁ దెల్పిన ♦ మనుజుడిట్టు
లనియెనోధన్యులారమీా ♦ తనయు నేను
గాంచిప్రియములరార భా ♦ షించివచ్చి
నాడనామాట సత్యము ♦ నమ్ముఁగదరె 168

క అనినవిని పీరుసాహెబు
మనమున సంతోషవార్ధి ♦ మగ్నుండగుచున్
దనయుని దోడ్కొనివచ్చెద
ననిచనియెన్ గంది మల్ల ♦ యపురంబునకున్ 169

ఉ అంతనెలంతతెల్లరరు ♦ దండికిరాతవధూటి పల్కులన్
సుంతయుఁగల్లలేదు సర ♦ సుండగు బ్రహ్మముఁజేరిసిద్ధఁడ
త్యంతముఁదీర్ఘమానిచెలు ♦ వారఁగనుబ్బుచునుండెరేపవ్వ
త్రాంతముఁదేలునన్నదియ ♦ ధార్వమెకాతలపోసిచూడఁగన్

క ఎఱుకత పల్కుల యర్థం
బెఱుఁగ పొరబాటుఁజెంది ♦ యెల్లరుఁదమలో

మఱియొకగతిఁ బెంచిరి బలు
గుఱిగాఁ జెప్పెనని మెచ్చి । కొనిరా వెలఁదుల్ 171

ఆ. ఆడవారియూహ । లంతలో గుర్తించి
బహువిధార్థములను । బలికి చనిన
ననుభవార్త మొందుఁ । గొని కొత్తురిలఁ గొంద
ఱెఱుకుసాని తంత్ర । మెఱుఁగ రేల 172

ఆశ్వాసాంతములు

క. హరిహరివహమాతా మహ
హరిహరికులసార్వభౌమ । హరిచరణజనీ
హరిహరిశరదర శితకర
హరిహరి సఖనేత్రసదృశ । హరిణాభయశా 173

క. అరవిందశరాకారా
పరమపవిత్ర ప్రచార । పర్వతధీరా
దురితాంధకారసూరా
శరనిధిగంభీర శ్రితని । చయమందారా 174

ఉత్సా. అరుణతులిత వరవికాస । యాశ్రితజనపోషణా
సరసిజాస్త్రనిభవిలాస । సరసగుణ విభూషణా
నిరుపమాన మందహాస । నిత్యసత్యభాషణా
పరమధూళిపురనివాస । బంధురపరితోషణా 175

గద్య

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాద లబ్ధచతుర్విధ
కవితావిచిత్ర విశ్వకర్మకుల పవిత్రభద్ర
దత్తగోత్ర పోకూరి వంశాబ్ధిరాకా
వః త్రిరాగ లక్ష్మాంబా
సుబ్బయ్యాచార్య పుత్రకనిష్ఠ
మాబదుద పాత్ర బుధజ
నానుమతి కాళీపతి
ప్రణీతంబైనశ్రీ
సిద్ధయోగచరి
త్రమునప్ర
థమాశ్వా
సము
సం
పూర్ణము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరమణీజనక శర
న్నారద మందారగిరిశ ♦ నారదశరడిం
డీరసమధవళకీర్తి
వీరబ్రహ్మాభిధేయ ♦ విబుధవిధేయా 1

ఆ. అవధరింపఁగదెమ ♦ హాత్ముఁడనఁ దపో
ధనుఁడనంగఁబుణ్యు ♦ తముఁడనంగఁ
బరగుసిద్ధయోగి ♦ వరుచరిత్రమునందు
నెసఁగునవలివృత్త ♦ మెట్టులనిన 2

పీరుసాహేబు కుమారుఁ గాంచుట

వ. అంతఁ బీరుసాహేబు కందిమల్లయపురంబునకే తెంచి శ్రీమద్విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రుని దర్శించి నమస్కరించి యటఁగల సిద్ధయఁ దిలకించి కంటనీరుఁ బెట్టుచు నిట్లనియె 3

క. తనయానిన్నెపుడైనఁ
బనిఁజేయుమటంచుఁగోప ♦ పడినాన చిటు
కుకునదెబ్బఁగొట్టి నాడన
ననువీడియు నిటకుఁజేర ♦ న్యాయమెచెపుమా 4

క. నినువిడినయొక్కనిముసము
ఘనయుగమై తోఁచుచుండెఁ ♦ గావుననీ
తల్లిని జేరనేగుదుము లే
తనయానిరవధిక మంజు ♦ తరవిదితనయా 5

ఆ. నీవు లేనికతన ♦ నీతల్లి నిన్నటి
నుండి నేటివరకు ♦ తిండిమాని
పొగలుచుండె గావ ♦ బోవుదమిలు సేరఁ
దీవ్రముగను బయలు ♦ దేరుమయ్య 6

వ. అనిపఁగన్న తండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె 7

క. జనకా ముదుమూలకు మర
లను జేరఁగవలయునను త ♦ లంపునరాలే
దనయము వీరగురునిపద
వనజములను గొలచుచుండ ♦ వచ్చితినిటకున్ 8

సీ. దుస్తరసంసార ♦ తోయధిదాటింపఁ
గొమరుమించిన నావ ♦ గురునిసేవ
రమణీయమోక్షసాం ♦ మ్రాజ్యంబునకుఁ జేర్ప
నిరుపంబగుత్రోవ ♦ గురునిసేవ
అజ్ఞానవనదగా ♦ ఢాంధకార మడంపఁ
గరమామెఱపుతీవ ♦ గురునిసేవ
క్షుద్రతాపత్రయ ♦ క్షుద్బాధవారింప
సుచిరంబగుజావ ♦ గురునిసేవ

గీ. పరమభక్తదుర్గనకుఁ జేవ ♦ గురునిసేవ
ఉరుతపోవిష్టలకు తేవ ♦ గురునిసేవ
దురితరుజకౌషధపు సేవ ♦ గురునిసేవ
అట్టిగురుసేవ వీడిరా ♦ నెట్టులొప్పు 9

తండ్రి

గీ. మనకులంబునఁ బెక్కురు ♦ మాన్యులైన
గురువులున్నారు గదవారి ♦ చరణసేవ
సలిపి మోక్షంబుఁగాంచఁగాఁ ♦ దలఁపరాదె
ఇతరగురుపదముల నాశ్ర ♦ యింపనేల 10

కుమారుఁడు

సీ. సరసీరుహ మరంద ♦ సారంబుఁగోరెడు
తేఁటియుమ్మెత్తపూ ♦ దేనెఁగోరునె
వాంఛమానస సరో ♦ వరమున విహరించు
కలహంసమడుగుల ♦ మెలఁగఁజనునె
విధుకిరణములకై ♦ వేఁచెడు చకోర
మాశించఁబోనె నీ ♦ హారవిభను
ఎలమావికావిమో ♦ పులమెక్కు పికరాజ
మీఁతలేతచిగుళ్లు ♦ మేతఁగోరునె
గీ. భూరి శ్రీమద్విరాట్పో ♦ తులూరివీర
దేశికేంద్ర పదాంభోజ ♦ తీర్థపాన
సంతతాభీష్టసంయుత ♦ స్వాంతమెటుల
నితరగురుపదములనాశ్రి ♦ యింపనేర్చు 11

తండ్రి

క. సిద్ధముగ వత్సవనుచును
బెద్దఁగ నాశించివచ్చి ♦ పిలిచితి రావిం
కెద్దిగతి బాలురకు నిటు

గద్దరితనమొందునేని ♦ కద్దాసిద్ధా 12

క. స్వామీవీరగురూత్తమ
వేడ్రమనునీవైననాదు ♦ ప్రియతనయుని మా
ధామమునకనుపఁ గదవే
నీమేలును మఱవసుమ్మీ ♦ నేనెన్నటికిన్ 13

ఆ. లేకలేక కలిగె ♦ నాకీతనూజుఁడో
కఁడుండువీనిబాసి ♦ యుండలేము
కానఁదామునెప్పి ♦ మైనఁబంపించి పు
ణ్యంబుఁగట్టుకొనఁగ ♦ దయ్యజియ్య 14

ఆ. అనిన వీరగురున ♦ కాత్మలో జాలియై
సిద్ధనీకుబాబు ♦ సెప్పినట్టి
నుడులఁజెవినిబెట్టి ♦ యుడుమాలకేగుము
తండ్రియాజ్ఞమీఱ ♦ ధర్మమగునె 15

ఆ. జనకునాజ్ఞమీఱఁ ♦ జనదనియేకదా
రాముఁడటవికేగె ♦ రాజ్యము విడి
పెండ్లిమానుకొనియె ♦ భీష్ముండు పితృవాక్య
పాలనమునకన్నఁ ♦ బాడిగలదె 16

క. అనవిని వీరబ్రహ్మం
దునితో సిద్ధఁడిటులనియె ♦ దురితవిదూరా
మనమరలఁదామె యిటునుడి
వినఁగాదనువారలెవరు ♦ విశ్వమునందున్ 17

గీ. ముక్తిఁజేకూర్చు జగదీశు భక్తితోడఁ

జెలఁగుప్రహ్లాదుఁడాత్మెచ్చఁ ♦ జెరువఁబూను
జనకునానతిమీఱిమో ♦ క్షమునుగొనఁడె
తామెఱుఁగవి చరితలీ ♦ ధరణిఁగలవె 18

వ. అనినవిని ప్రియనందనునకు జనకుండిట్లనియె 19

క. మాటలు నేర్చిన వానికి
సూటిగ సరిపోవు కథలు ♦ క్షోణిని లేవే
ఏటికి పలుమాటలు ము
మ్మాటికి వచ్చెదవ రావ ♦ మనికి కిసిద్ధా 20

సిద్ధయ్య

గీ. కరుణతోడను పీరన ♦ ద్గురుఁడు నాకుఁ
గారణంబిచ్చి మోక్షమా ♦ ర్గమునుజూపి
స్వాంతమలరఁగ సెలవు నా ♦ సంగువరకు
నేను ముమ్మాటికిని రాను ♦ రాను రాను 21

క. అనినవిని పీరుసాహెబు
తనయుని పైవిసికిపీని ♦ తల్లిని వెసఁదో
డ్తొనివచ్చెద నాబిడ బిలి
చినరాడా యనుచు స్వపురిఁ ♦ జేరఁగ నేగెన్ 22

క. అటులన్ జని భార్యన్ గని
కుటిలాలక నేడు పీర ♦ గురువర్యుని చెం
గటనుండి రొంత వేడినఁ
గొటికకు రానని యె ముద్దు ♦ కుమరుఁడు వింటే 23

క. వృద్ధసతివగుట ఘోషా

పద్ధతినీ కేలముద్దు ♦ పట్టకినీవే
బుద్ధులాగరపిమదాజ్ఞ
బుద్ధిని జేయుమటంచు నను ♦ బయనము( జేసెన్ 24
ఆ [illegible] సిద్ధుండిట నత్యంతానందంబున 25

సీ· లాగునూనినలాగు ♦ బాగుగాదసిమార్చి
కాషాయవస్త్రముల్ ♦ గట్టినిదాల్చెఁ
జెల్ల నేరదటంచు ♦ నల్లచొక్కాకీ మార్చిఁ
కమనీయముగుకావి ♦గానుదాల్చెఁ
దీరుగాదనుచుఁబ ♦ కీరుపూసలదండ
మార్చిరుద్రాక్షల ♦ మాలఁదాల్చెఁ
దీపింపదనిరూము ♦ టోపీనిమార్చి లే
కావివల్లియమస్త ♦ కమునఁదాల్చె

గీ. నొప్పదిఁకఁదిలకంబులే ♦ కుండుటనుచు
నలికమునభూతిగంధాక్షు ♦ తలనుదాల్చె
వీరసద్గురు చెంగటఁ ♦ జేరినంత
మాత్రనే సిద్ధఁడెంతలో ♦ మారెనహహ 26

క. అట్టిమెడఁబీరుసాహెబు
పట్టిందాడుకొని పోవ ♦ భార్యవెంటన్
బెట్టుకొని కందిమల్లయ
పట్టణామున కేగుదెంచె ♦ బలు వేగమునన్ 27

క· వచ్చివినమ్రత మఠమున్
జొచ్చితనూభవునిదవ్వులఁ ♦ జూచి నిజాత్మన్

హెచ్చినకోపంబున సతి
నచ్చుగ నందనుని వేష ♦ మరసి తెయనుచున్ 28

క. కులదీపకుఁడగు సనుఁగానఁ
గులనాశకుఁడాయె వీని ♦ గుణములుఁ జెడియెన్
దిలకమును బెట్టి రుద్రా
క్షలసరుఁ ధరించెఁ దాల్చెఁ ♦ గావివలువలన్ 29

క. సుతుఁడితఁడుగానఁ రిపుఁడగు
మతమున్ జెడె వీనినింక ♦ మర్దింపక యే
గతివానకు వశ్యమగునన
సతియిట్లని పల్కెఁ బీరు ♦ సాహెబుతోడన్ 30

సీ. నాథకినిసినఫలమేమి ♦ నందనుండు
బాల్యదశనుంటఁ దెలియని ♦ పాటుగాని
వేఱొకటిగాదు వానిని ♦ జేరినేను
దిన్నఁగాఁ బుజ్జగించి తో ♦ డ్తెత్తుసిలుతు 31

వ. అనిపలుకుచు నాదంబీ వీరబ్రహ్మేంద్రుని సామీప్యంబున
కేతెంచి వందనంబులాచరించి యందున్గల నందనున్డా
యన్ జనికౌఁగిలించుకొని పెద్దపెట్టున నేడ్చుచు 32

ఆచ్చంబీ కుమారుని యింటికిరమ్మని బతిమాలుట

ఆ. తనయనీవు లేని ♦ మన నికేతన మంధ
కారబంధురంబు ♦ గాఁదనచ్చెఁ
గాన నెటులనుండఁ ♦ గలమా గృహంబున
రాగదయ్యమంది ♦ రమునకీవు 33

ఆ॥ చిన్ననాటినుండి ♦ ప్రేమతోనిన్నెత్తి
పెంచినామెకాని ♦ యించుకైన
దోసకున్న(జేని ♦ చేసియెటుంగమి
ట్లలిగి వచ్చుటెందు ♦ కయ్య సిద్ధ 34

ఆ. మరుపు(జెందినావె ♦ మధుమాంసములుదప్ప
యేపదార్థమేని ♦ యీవ్రతినక
యెన్న(జేనిమేము ♦ తిన్నార మేయెందు
కలిగివచ్చినాడ ♦ వయ్య సిద్ధ 35

ఆ. న్యాయముగ మహాత్మ ♦ దీయమతంబునఁ
బుట్టియిటులనుదుట ♦ బొట్టు(బెట్టి
హృదయఫలకమందు ♦ రుదరాకసరువిడఁ
దగుపటయ్య పరులు ♦ నగరటయ్య 36

క. స్వమతవ్యతిరేకా చా
రమునీకెవరైన (జెర్పి ♦ రా తావకచి
త్తమునందు( బొడమెనాయు
క్తమెబొట్టున్ దుడుచుకొనుము ♦ తనయాసునయా 40

క. జోగులు సన్యాసులు బై
రాగులు ధరియించుకావి ♦ రంగువలువలన్
బాగుగనేతాల్ప మనుపటి
లాగునఁగుళ్లాయినంగి ♦ లాగున్ గొనుమా 38

ఆ. పెండ్లినీకుఁజేయ ♦ బిల్లనువెదుకుచు
న్నామువానిసీను ♦ నటతఁగనినఁ

గులమువారునిన్ను ♦ వెలివేయుదురె కాని
పిల్లనీయఁగలరె ♦ ప్రియతనూజ 39

వ. అనినవిని కన్నతల్లికిఁ బ్రియనందనుండిట్లనియె 40

గురునిఁబిడి సిద్ధయ్య యింటికి రాననుట

గీ. ఒక్కకులమునకేకాదు ♦ నిక్కముగను
సకలదృశ్య ప్రపంచంబు ♦ సకును నేడు
వెలియగుటెంచు కొనినన ♦ న్నిలనుగల్గు
కులమువారేమి సేయఁగాఁ ♦ గలరుతల్లి 41

ఆ. ముక్తికాంతనెనయ ♦ రక్తిగల్గిననాకు
రిక్తకాంతనెనయ ♦ యుక్తమగునె
పంచభక్ష్యములను ♦ భక్షింపవిందున
కేగువాఁడుగంజిఁ ♦ ద్రాగిచునె 42

గీ. వీరగురుపాదసేవ ప్రా ♦ప్తించినట్టి
నన్నుబరులెవ్వరేమియు ♦ సర్పఁగలరు
వారణమునెక్కి యున్నట్టి ♦ వానికిలను
శునకములభీతి గల్గునె ♦ సుంతయేని 43

గీ. వీరగురునకు నేనీశ ♦ రీరమర్ప
ణంబుఁజేసితినెడుచి ♦ హ్నంబుఁదోప
నిటలమున బొట్టుఁబెట్టితి ♦ నెటులదానిఁ
దీయుదునెతల్లి సుగుణవ ♦ తీమతల్లి 44

ఆ. ఒసరగురునివేష ♦ మొకతీరు శిష్యుని
వేషమరయవేరు ♦ విధమునుంట

చనదటంచు వేమ ♦ మును మార్చుకొంటివి
గుణములన్నిమార్చు ♦ కొనదజనని 45

ఉ. లోకమునన్ గ్రహంబనెడు ♦ లోతగుచీకటినూతిలోపలన్
జాత్రికటమైనమోహభవ ♦ పాశచయంబున గాఢబద్ధులై
పైకరుదెంచ నేరక య ♦ వజ్ఞతగాసిలుచుండి నీల్గువా
రేకరణిన్ గ్రహింతురు ర ♦ హింతురు కాంతురు మోక్ష
మార్గమున్ 46

ఉ. అస్థిరదారపుత్రికన ♦ కాసుల పైనురుకాంక్ష నెయ్యెడన్
స్వస్థత లేక త్రిమ్మరుచు ♦ జన్మనిరర్థకమా తెలుంగుచున్
భూస్థలిసారెకున్ బాలిసి ♦ పుట్టుచు గిట్టుచునుండు వారికిం
కేస్థితి మోక్షమార్గముల ♦ భించు నిజంబుగ నెంచి చూచినన్

క. వనుగని పెంచిన ఫలమొగఁ
గనులారఁ గనొకపసారి ♦ కనుఁగొని మీరల్
సనఁదగును గాని పురమున
కును గావించ నాశపడలు ♦ కొవనగునమ్మా 48

క. అట్టియెడఁ బీగసాహెబు
పట్టిన్ రావాయటంచు ♦ బహుకోపమునన్
దిట్టుచు బెత్తముతోడన్
గొట్టుచు వెలుపలికి నెట్టు కొనివచ్చె నెడన్ 49

చ. జనకుఁడు వృద్ధుఁడౌటను ని ♦ జంబుగనే నెదిరింపనాగతే
డనుచును బాడిగాదనుచు ♦ నల్లరిసద్గురిమొర్రిలబాగుతే
దనుచు మదిన్ దలంచి శిష్య ♦ నంతగఁ గొట్టుచు నెట్టుచున్నఁగా

దనివెనుదీయకావలికి ♦ నయ్యెడసిద్ధుఁడు వచ్చెనచ్చుగన్ 50

క. వచ్చిధ్వజమూకడనిల్చినఁ
జెచ్చెరజనకుండు సేరి ♦ సిద్ధనిమారలన్
హెచ్చుగనెట్టినఁగదలమి
వచ్చుగనందనునకిట్టు ♦ లనెఁగోపమునన్ 51

శా. దుష్టానీవుపరోపాధిలోవిషముప్రా ♦ దుర్ఖ్యాతమైనట్లుని
ద్దుష్టాత్మైన మహాత్ముఁదీయమహిమం ♦ దుఁబుట్టియీలామత
భక్తిత్వంబు వహింపఁబూనితివిసీ ♦ బాధింతుసాధింతు నీ
కష్టంబేటికి రారపోవుదమయా ♦ క్షత్వంబుఁబోనాడియున్

వ. అనిన కన్నతండ్రికి నందనుండిట్లనియె

క. జనకానను దిట్టినఁగో
ట్టినభయపెట్టినను రాము ♦ డెంకికివీఁగే
శుని పాదపద్మ సన్నిధి
మనియెదనాపై దురాశ ♦ మానియుఁజనుమా 53

సిద్ధయ్యను తండ్రి కట్టివేయుట

చ. అనవినిపీరుసాహెబట ♦ నయ్యెదురంతును జూడనేగుదెం
చినజనపాళికిట్లనియెఁ ♦ జెచ్చరనీతఁడు పారిపోవుఁగా
ఘనదయఁబూని పట్టుకొని ♦ పుణ్యముగట్టుకొనుండుకట్టివే
తునటుపయిన్ బురంబునకుఁ ♦ దోడ్కొనిపోవు నుపంబు
జూచెదన్ 55

సీ. వృద్ధుఁడను నేను కట్టివాఁ ♦ డితఁడుగాన
సాధ్యపడకుండుమీరలీ ♦ సాయమొందుఁ

జేయుఁడనుచు సలాములుఁ ♦ జేయనంగుఁ
గొందరికి జాలిమైపట్టు ♦ కొనిరివాని 56

ఉ. పట్టినయంతనే తనయు ♦ పాఁశియుగంబునుబట్టి తండ్రిబల్
కొట్టుచు మేలికంబున ♦ కున్గదియించి నిజాంశుకంబుతోఁ
గట్టిగఁగట్టివేసియటఁ ♦ గల్గినవారలకిట్లుఁబల్కెనో
దిట్టరులారవీనిఁగొని ♦ తెండెవరేనియుఁగూలినిచ్చెదన్ 57

గీ. ఒక్కకొడుకీతనిని బాసి ♦ యుండలేము
కానఖట్వాకపైవీనిఁ ♦ గట్టుకొనియు
మోసుకొనివచ్చి మాయింటి ♦ ముందుదింతు
రేనికోరినకూలిమీ ♦ కిచ్చువాఁడ 58

ఉ. నాగొనబొప్పనందలిజ ♦ నంబుననల్వురు పీరుసాహెబున్
వేగము చేరి యిట్లనిరి ♦ వేడ్కనుమేమిదు మన్నకూలినీ
వీగలవా భవత్తనయు ♦ నింటికిఁజేర్తుమటన్న నాతఁడా
లాగెమొసంగువాఁడఁబ్రియు ♦ లారవెసన్ దయసేయరే
యసన్ 59

ఆ. మంచిదట్టులైన ♦ మందిరంబులకేగి
కుఱ్ఱవానిమోసు ♦ కొనియునేగఁ
దగినసాధనముల ♦ నొగిఁదెత్తుమని చని
రంతఁబీరుసాహె ♦ బాత్మజుఁగని 60

క. బొట్టున్ దఁడువఁగఁబోవున్
బెట్టుగరుదురాకసరులఁ ♦ బెరుకఁగఁబోవున్
గొట్టఁగఁ బోవున్ గెంపుం

బుట్టంబులఁ జింపివేయఁ ♦ బోవునయారే 61

ఆ. తనయునుదురు కంద ♦ ననిబొట్టుఁ జెరుపనీ
యదుగళంబుబిగియ ♦ ననిశివాక్షు
మాలఁ బెరుకనీదు ♦ మానహాని యటంచు
వలువ చించనీదు ♦ చెలువవిభుని 62

వ. ఇట్లునివారింపుచువల్లభుఁ గాంచియాదంబియిట్లనియె 63

ఆ. కన్నకడుపుగానఁ ♦ గన్నులయెదుటను
గొడుకునిట్లునీవు ♦ గొట్టఁబోవ
జూడఁజాలనింక ♦ సుతుఁజేరికొట్టిన
నేనెముందుపోలియు ♦ దాననాథ 64

ఆ. ఏనుబుజ్జగించి ♦ వినిపియాజ్ఞలో
నిలుపుదానఁగొట్ట ♦ వలదటంచు
నార్తిదోపనాథు ♦ నాదంబికాఁగిటఁ
బట్టికూరుచుండఁ ♦ బెట్టెనపుడు 65

గీ. అంతలోఁగూలివాండ్రింట్ల ♦ కరుగుదెంచి
ఖట్వకనుదుప్పటమును బ ♦ గ్గములగడెల
నూతకోలలఁగొనివచ్చు ♦ చుండవపుల
గాంచిభీతిల్లిసిద్దఁడి ♦ ల్లొంచె మదిని 66

ఉ. ఆరయఁదీర్ఘపాశధరు ♦ లైయురు భీకరదండపాణులై
వారలెకూలివాండ్రిటకు ♦ వచ్చుచునుండిరినానిమిత్తమై
దూరమునుండిచూడయమ ♦ దూతలచాడ్పునఁగానుపించుచు
న్నారలువారిచేతఁబడి ♦ నన్ననువీడరునిశ్చయంబుగన్ 67

గీ వీరసద్గురుఁడాశ్రిత ♦ ధారుఁడేని
అమ్మహాత్ముని పదముల ♦, నాశ్రయించి
నట్టిభక్తవరుండనే ♦ నైతి నేని
ననుబిగించిన కట్లుతు ♦ త్తునియలగుత 68

వ. శ్రీమద్వీరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికి జేయటంచు బంధనంబులు తుత్తునియలగునట్లుగా హుంకరిం చి దూకిగంతులువైచుచు వీరగురుని వెనుకకుఁజేరిముకుళి తకరకమలుండై నిలిచిన

ఉ॰ అత్యాడపీరుసాహెబుర ♦ యంబున లేచియుఁగూలివాండ్రతో
నయ్యొయొపోయెఁబోయెనిదె ♦ యర్భకుఁబట్టుడుకొట్టుఁడెంతయుఁజా
జయ్యనరండు రండనుచుఁ ♦ జాలగఁగేకలుబెట్టఁగఁజవాఁడె
య్యెడకేగెనంచుఁబరు ♦ గెత్తుచువచ్చిరివారలుద్ధతిన్

గీ॰ వచ్చిసిద్ధఁడుగలమాట ♦ వమునుడాసి
ద్వారమునుదాటఁబోవఁగా ♦ వీరగురుఁడు
సూచివీరలవాకిలిఁ ♦ జొచ్చనీయ
వలదనుచునాజ్ఞఁజేసెద ♦ ద్వారికులకు 71

గీ. అంతదవ్వారికులుగురు ♦ నాజ్ఞలేద
టంచువారలనెల్లర ♦ నడ్డగింప
సిద్ధఁడంతోభయభ్రాంత ♦ చిత్తుఁడగుచు
వీరగురువర్యునిట్లని ♦ వినుతిఁజేసె 72

చ. చరసిజలోచనాంశభవ ♦ సాధుజనావనయద్వితీయశ్రీ
కరకరుణాపయోధియవి ♦ కారనిరామయచద్విలాస భా

సుగునిగమాంతవేద్యగుణ ♦ శోభితయా శ్రితలోలవీరస
ద్గురుపరమేశ్వరాదురిత ♦ దూరభవచ్ఛరణంబువేడెదన్ 73

గీ. చాటునకువచ్చినాఁడనా ♦ జనకుబారి
నుండితప్పించి నన్నునీ ♦ దండఁజేర్చు
కొనుమటులఁగాక నాకుది ♦ క్కుగలరెవరు
కోవిదశరణ్య శ్రీవీర ♦ గురువరేణ్య 74

వ. అనివినుతింపుచుండఁగావీరేశ్వరుండు నామనంబేలకోయీత
నినాకర్షింపుచున్న దీతండెవ్వండైయుండనోపునని దివ్యదృ
ష్టిన్ బారఁజూచి యోహోయీతండు తొలిజన్మంబునన్
క్షత్రియుండై గోహత్యాపాతకంబున నేడుపింజారియై జని
యించి నాటిమదాజ్ఞానుసారంబుగా నిపుడునన్నాశ్రయించి
నవాఁడుగదాయని తెలిసికొనిపీనిని పీడరాదటంచు 75

క. తనవుదినను కొను సమయం
బునదీనతఁబీరుసాహె ♦ బుకరాబ్జయుగం
బునుమోడ్చియిట్లుగా మన
విని జేసుకొనందొడం గె ♦ వీరేశునితోన్ 76

క. వీరబ్రహ్మేంద్రాస
త్కారుణ్యాకరమహాత్మ ♦ కడవేగమునన్
జేరుకొనినట్టి నాదగు
మారుని బంపింపఁగదన ♦ మస్కృతిఁజేతున్ 77

క. దేవాపలునుడు లేటికి
మావానిని బంపుమనుచు ♦ మనవిసిజేయం

నావెలయుదు సిద్ధఁడందు ♦ నాదుకుమారున్ 86

కడప నవాబుకడ వీరేశునిపై నేరమునుస్థాపించుట

గీ. కందిమల్లయపురి విశ్వ ♦ కర్మకులజుఁ
డైనవీరేశ్వరుండు నా ♦ సూనుదరికిఁ
దీసిదుర్బోధలెన్నియోఁ ♦ జేసివేష
భాషలన్ మార్చిసుతమత ♦ భ్రష్టుఁ జేసె 88

క. సూనునిదోడ్కొని చనుటకు
నేనచటికి నేగుదెంచ ♦ నెంతయుఁగినుకన్
దానర్భకు చెంతకునను
బోనీకాటంకపరిచె ♦ భూపలలామా 89

శా. కట్టించెన్ మొలనందు నాసుతునకున్ ♦ గాషాయ వస్త్రంబులన్
బెట్టించెన్ దగనస్మదాత్మజునకున్ ♦ బెన్బొట్టునెమ్మోమునన్
జుట్టించెన్ రుదురాకపేరులు మెడన్ ♦ సంసారమత్యాంతికిన్
నెట్టించెన్ దనయార్థమేగిననను ♦ వీరేశ్వరుండోనృపా 90

వ. అని మొఱపెట్టుకొనఁగా నబాబునకు వీరేశ్వరునిపైనాగ్రహంబుదయించి యగ్నిహోత్రంబున నాజ్యంబిడిన చందంబున మండిపడుచుఁ దలపంకింపుచుఁబండ్లుపటపటంగొరుకుచుఁ గోపోద్దీపితమానసుండై పీరుసాహేబునకిట్లనియె 91

శా. ఔరా యెంతటిమాటవింటి భవదీ ♦ యాత్మోద్భవున్ హైందవా
చారున్ జేసెనె విశ్వకర్మకులసం ♦ జాతుండు కాసీమదీ
యోరుపక్షనుజూపి తగ్గురుని శి ♦ ష్యున్ బట్టి తెప్పించియా

వీరేశున్ దగునట్లుజేసి చిఱుతన్ వేవేగనీకంపెదన్ 92

ఆ. మనమతంబులో స ♦ మస్తమతస్థులఁ
జేర్చికులముvృద్ధిఁ ♦ జేతుఁగాని
అన్యమతములో మ ♦ హమ్మదీయులఁజేర
నీయసుమ్ముచింత ♦ యేలలెమ్ము 93

వీరేశుని సిద్ధనిపట్టుకరండని భటులకు నబాబుత్తరువుచేయుట

వ. అనిపీరుసాహేబు నోదార్చుచు భటులన్ జీరి తత్క్షణంబకంది మల్లయపురంబున కేతెంచి వీరేశ్వరుఁ సిద్దనిఁబట్టితేండని కఠినమగునుత్తరుపుఁ వ్రాసియిచ్చినంత నాభటోత్తములు తడయక కందిమల్లయపురంబున కరుదెంచి తద్గ్రామాధిపతిఁగాంచియుత్తరువును జూ పిం చి వారలను బట్టియిచ్చుటకు రమ్మనికోరఁగా నారాయిది యెంతసాహసమువీరే శ్వరుండన సామాన్యమానవుంజేయని మఱియునాగ్రామాధిపతిభటులతో నిట్లనియె 9

సీ. పాపాఘ్నిమతములో ♦ పలదత్తుతల్లికి
భాసిలవిశ్వేరూ ♦ పమునుజూపె
బనగానపల్లెయం ♦ దునను బ్రిహాస్మనందు
నకును సా.పారసం ♦ ధత్వముడిపెఁ
బెదకొమెర్లపురంబు ♦ నఁదమిదెసంకటి
ముద్దనుబరమాన్న ♦ ముగనెనర్చెఁ
గందిమల్లయపురి ♦ గ్రామదేవతఁజేరి
పిలిచియునివ్వఁదె ♦ ప్పించుకొనియె

సీ. భూరిశ్రీమద్వీరాట్పోతు ♦ లూరివీర
గురుఁడతఁడు సుఖిసామాన్య ♦ నగుఁడెతలఁప
నట్టిజగదేక మహానీయు ♦ నరసియెటులఁ
బట్టుకొనిపోవనేర్తురే ♦ పట్లమీరు 95

మ. అకటారేమీకిది చేటుకాలము సుడీ ♦ యామాన్యునిన్ బట్టుకొం
దురితానల్గిశపించెనేని ధరయం ♦ దున్ భస్మమైపోలరే
ధరణీనాథునిచే జగద్గురునిచే ♦ తన్ గీడు లేనట్లు బా
ధురకీర్తిన్ సమపాయమొందు వివరిం ♦ తున్ మీరలాలింపరే

సీ. వీరేశ్వరునిదరిఁ ♦ జేరినమస్కృతుల్
సలిపియోసద్గురు ♦ సార్వభౌమ
తమచెంతఁగలుగుసి ♦ ద్ధనిదోడుకొనిపోవఁ
బాదుషాహుకుమీయ ♦ వచ్చినాము
కావునవానిని ♦ గైకొనిపోండని
యాజ్ఞనిచ్చెదరొలే ♦ దనుచుహుకుము
పైవ్రాసియిత్తురో ♦ బాగుగాయోజించి
సెలవీయుఁడనినుతిఁ జేతురేని

గీ. కల్లలెఱుఁగనిమాన్యుండు ♦ గానగురుఁడు
సిద్ధనిన్ గొనిపొండని ♦ సెలవొసంగు
నపుడువానిని దోడ్కొని ♦ యరుగవచ్చు
నంచునిందున మనముమే ♦ లొందఁగలము 97

క. వీరబ్రహ్మంబెటో సం
చారము జనెననుచుఁ బాదు ♦ షాతో మీరల్

వేరుగను జెప్పి సిద్ధని
నారానమ్మణిమ్రోలనిలుప ♦ నగుభటులారా 98

వ. అని తెలిపిన నదియేమంచి సదుపాయంబని యాగామిమాధి
పునివెంటఁగొని శ్రీవీరబ్రహ్మేంద్రుని సాన్నిధ్యంబునకే
తెంచి నమస్కరించి భటోత్తములిట్లనిరి 99

శా. దేహావీరగురూత్తమాంకడపధా ♦ తీరినాథునుత్తర్వుచే
మీఁవాసస్థలినుండు సిద్ధని వెసన్ ♦ మేమియ్యెడన్ బట్టికొం
పోవఁ వచ్చితిమాతనిన్ బనిపెదో ♦ పొల్పొందనుత్తర్వుపై
నావేశ్మంబున లేడుసిద్ధఁడని రా ♦ ణా వార్తతుమో తెల్పుమా

క. ఈవిధులరెంట నెదితగు
నావిధినోసరించిపంపు ♦ మరిగెడమటు తా
కావింపకున్న బోమా
జీవనములు దక్కవధిపు ♦ చేసుహితాత్మా 101

క. సిద్ధనికై జనకుఁడు నృపు
నొద్దన్ మొఱపెట్టుకొనఁగ ♦ నుర్వీశుఁడు మ
మ్మిద్దరిపి బంపెవానిని
నిద్దముగాఁబట్టితేండ ♦ నియమహంకుమిడియున్ 102

క. అనవినవీరేశ్వరుఁడి
ట్లనెనో భటులార సిద్ధఁ ♦ డస్మద్గృహమం
దున లేడని కల్లలెటులఁ
గొనకొని లిఖియింతువెంటఁ ♦ గొనిపోండతనిన్ 103

క. అని తెల్పుచు సిద్ధని గనుఁ

గొని శ్రీమాశిష్యవరకడప ♦ కున్ వీరల వెం
టను బోయిమరల నిటకున్
ఘనతర జయముగనురమ్ము ♦ క్ష్మాపతివొగడన్ 104

వ. అనిన సిద్ధండెంత యోసంతసించి మద్గురువర్యుండు నేఁడుకదా శిష్యవరా యని నన్ను సంబోధించినది మఱియు నంతియే కాక జయంబునందిరిగిరమ్మని సెలవొసంగెనిఁక నాభాగ్యంబు నెన్న శక్యమే యని వీరేశ్వరునకిట్లనియె 105

ఉ. వీరగురూత్త్వదాజ్ఞ నెర ♦ వేర్చుటకన్నను వేరుపుణ్యమీ
ధారుణియందునన్ గలదె ♦ తావకపాద సరోజయుగ్మమున్
గూరిమితోడఁ జూచుమిదె ♦ కోర్కెదలిర్పనమస్కరించి నే
వీరలవెంట నేగికడు ♦ వేగమువచ్చెద మిమ్ముఁజేరఁగన్ 106

సీ. బనగానపల్లియ ♦ పరిసరాటవిలోనఁ
గట్టమూనియునాలఁ ♦ గాచెనెద్ది
ప్రాజ్ఞులెన్నఁగనుగా ♦ లజ్ఞానమనుగ్రంథ
రాజంబునింపుగా ♦ వ్రాసెనెద్ది
గుణవతీతిలకమౌ ♦ గోవిందమాంబకు
గళమునం మనఁబుస్తెఁ ♦ గట్టెనెద్ది
నేటుగాఁబ్రోలేరు ♦ నిప్పుదెచ్చియొసంగ
గొనబొప్పఁగానంది ♦ కొనియెనెద్ది

గీ. అట్టినీప్రాణి మన్మస్త ♦ కాగ్రమందు
నునిచిదీవించి కారణ ♦ మొసఁగుదునని
మొసకమెసఁగఁగనభయంబు ♦ నీయఁగదవె

దివ్యగుణసాంద్ర శ్రీవీర ♦ దేశికేంద్ర 107

క. అనిపదములందు సాష్టాం
గనమస్కృతులగ్గురునకుఁ ♦ గావించు నెడన్
గనివీరేశుఁడునగి సి
ద్ధనికేల్గొని లేవఁదీసి ♦ తగనిట్లనియెన్ 108

గీ. ఎన్నిచిక్కులు ఘటియించు ♦ చున్నఁగాని
మదినిగారణమనుమాట ♦ మఱువఁబుగద
జగతిమాయాత్మక కారణ ♦ జన్ముఁడవగు
శిశువ నేనుపదేశమె ♦ ట్లీకయుందు 109

క. కడపపురమునకుఁజని యి
క్కడకీ వరుదెంచినపుడు ♦ గారణమును నే
నిడిపొందధ్రువముగ నిపుడీ
వడుగకయే మహిమనిడితి ♦ నందుము వత్సా 110

గీ. శిష్యవరనీవు పాదుషాఁ ♦ జేరినపుడు
వేడ్కనీవన్నునుడినెర ♦ వేర్చఁగాక
జయమునీకగుఁగాక సం ♦ దియము లేక
మహిమనిచ్చితిఁగొనిపొమ్ము ♦ మరలరమ్ము 111

గీ. అంచునెనరున సిద్ధని ♦ చంచుదివ్య
హస్తమస్తకసంయోగ ♦ మాచరించి
వీరదేశికవరుఁడుదీ ♦ వించినంత
సిద్ధఁడిట్లనియె వీరదే ♦ శికునితోడ 112

ఆ. ఆర్యనీవొసంగి ♦ నట్టిమాహాత్మ్యంబు

నిపుడు నేఁబరిగ్రహించినాఁడఁ
గానిమఱిచెయునాము । మానసంబుననొక
సంశయముఁజనిచె । నరవినుము 113

శా. జేవాసీపెడిశెట్టి దివ్యమహిమా । ధిక్యంబుగర్వంబికన్
నాఖిజ్ఞానమనోజ్ఞమార్గమునకే । నాడైననాటకింబుక్
గావింపంగలదందు చే గడపకున్ । గల్యాణమేపారఁగా
నేవేడ్కన్ జనివచ్చిసర్పై మహిమన్ । నీవేవహింపందగున్

క. తగ నేఁబరిపూర్ణజ్ఞా
నిగఁ బాసిలినపుడుమహిమ । నెనరుననిడఁగా
నగునన గురువరుఁడల్లే
యగుఁగాకయటంచు సిద్ధయకు సెలవిచ్చెన్ 114

సిద్ధయ్యను భటులుపట్టుకొని నవాబుకడకు గొంపోవుట

క. ఇచ్చినసెలవున్ మహిమను
నచ్చుఁగ గైకొనియుసిద్ధ । యాభిధుఁడు వెసన్
హెచ్చగుముదమున ఖ్యాతిన్
దెచ్చెదగురునకని బయలు । దేరెనయారే 116

వ అంతటనాభటోత్తములెంతయో సంతసించి సిద్ధయన్ వెంట
గొని కడపపురంబునకేతెంచి నవాబున్ గాంచి సలాములొ
నరించి వీరేశ్వరుండాపురంబున లేనందున సిద్ధనిమాత్రింబట్టి
తెచ్చితిమని యాన్నృపాలుని మోల న్ నిలువంబెట్టఁగా
నాదంబీ పీరుసాహెబులన్ రప్పించి సిద్ధనివేషంబున్ దిలకిం
చి కోపోద్దీపితమానసుండైనబాబు సిద్ధనితోయిట్లనియె 117

శా. ఓక్రీమూర్ఖమహామ్మదీయమతముం ♦ దోప్పారజన్మించియా
వీరబ్రహ్మముఁజేరి హైందవమత ♦ స్వీకారమున్ జేసియా
తీరైనాఁడవె నేఁడ కేనిటులనై ♦ తిన్ తండ్రితో నేగెదన్
గారుణ్యంబునఁబ్రోవవేయనినమ ♦ స్కారంబుఁగావింపుమా

క. అటువలెనాకున్ మొక్కినఁ
దటుకున మన్నించి మన్త్ర ♦ తంబునవినువి
స్ఫుటముగను జేర్చుకొని ప్రా
కటకమాఁగనే నీమతండ్రి ♦ కడకంపింతున్ 119

క. మొండితనంబున నీవిటు
లుండినమున్భటుతోడ ♦ నుత్కటముగనిన్
జెండింతుగ్ లొంగకుండిన
ఖండింతుగ్ నీదుమేనుఁ ♦ గడికండలుగాన్ 120

క. ప్రస్తుత వేషము మార్చియు
నిస్తులిత మహామ్మదీయ ♦ నీతంబగుమేల్
దుస్తులుదాల్పనిచోబలు
కస్తిగ్ గలిగింతు శిక్షఁ ♦ గావించివెసగ్ 121

ఆ. కులమునారులేర ♦ గురువులేడా తండ్రి
లేడ పెద్దలచట ♦ లేరమఱియు
హితులులేరయిటుల ♦ నెవరితోఁజెప్పక
అన్యుఁజేరయుక్త ♦ మగునెసిద్ధ 122

వ. అనినఁబాదుషాతో సిద్ధుఁడిట్లనియె 123

సీ. నిఖిలమతాధీశ ♦ నిగ్ గనఁజనువేళ

స్వమతస్థులకుఁ జెప్పి ♦ చనఁగవలెనె
తగ జగజ్జనకుని ♦ దర్శింపఁజను వేళ
నస్మచ్ఛ్రితకుఁ జెప్పి ♦ యరుగవలెనె
అఖిలలోకేశ్వరు ♦ నర్చింపఁజను వేళఁ
బెద్దలతోఁ జెప్పి ♦ వెడలవలెనె
భువనైకమిత్రుని ♦ బూజింపఁజను వేళ
హితమాతృలకుఁ జెప్పి ♦ యేగవలెనె
గీ. స్థిరగురూత్తము చెంతకుఁ ♦ జేరు వేళ
కల్లగురువులతోఁ జెప్పి ♦ కదలవలెనె
దేవుఁడగు వీరగురు జేరఁ ♦ బోవునపుడు
నెవరితోఁ జెప్పఁగాఁబని ♦ యేల నాకు 124
గీ. మేదినీనాథ వినఁగదే ♦ నాగుమనవిఁ
దారతమ్యంబెఱుంగక ♦ ధరణివిభుఁడ
ననుచు మొ్రుక్కుమటంచు న ♦ న్ననుటె కాని
నానమస్కృతి భరియింప ♦ నగు నెవీకు 125
గీ. కువలయేశ్వర వీరస ♦ ద్గురుఁడు దప్ప
యొరులు నావందనంబుల ♦ నోపఁగలరె
చేతులెత్తి సమస్కృతిఁ ♦ జేతు నేని
వ్రియ్యలై కూలరే యెంత ♦ వారలైన 126
క. దండిగమద్గురు నటువలె
నుండగనే వేషమిటుల ♦ నూనితినను దా
చెండించిన దండించిన

ఖండించినవీడనాడు ♦ ఘనవేషంబున్ 127

గీ. వీరసద్గురుపాదార ♦ విందములను
నమ్మిసేవించుచున్నట్టి ♦ నాకు డెంద
మెవ్వరెటుభీతి గొల్పిన ♦ నించుకేని
తిరుగనేర్చునె కడపభూ ♦ వరలలామ 128

క. ఉలివిటులఁబలుకు సిద్దని
పలుకులు కడపపురి మనుజ ♦ పాలుని చెవికిన్
ములుకులయినాటి భటవ
ర్గులఁబిలచి తదవనిపతియ ♦ హోగ్రస్ఫూర్తిన్ 129

గీ. భటశిఖామణులార యీ ♦ పాలసుండు
దండనంబునఁగాక స ♦ ద్భాషణముల
వినఁడు వీరేమాతమునే ♦ విడుతునన్న
దాకమర్దింపుఁడీతని ♦ దర్పమడఁగ 130

వ. అనిమ్లేచ్ఛప్రభుండుత్తరువుసేయఁగావిని 131

క. జననీజనకుల వెసని
ద్దని కడకరుదెంచి కంటఁ ♦ దడివెట్టుచునే
డనఘాత్మామామొఱలను
వినరాదండనము వోలఁగు ♦ వేడుకగలుగున్ 132

క. తనయా వీరేశునిమత
మునువీడెదఁబ్రోవుమనుచు ♦ భూవరునకు మ్రొ
క్కిన మన్నించును నీవ
ట్లనకున్నన్ గొట్టెదరుభ ♦ టాగ్రణులీర్ష్యన్ 133

క. కడుపాపమేముగాంచిన
కాంతుఁడను వినుభటులుబట్టి ♦ కొట్టుచునున్నన్
మిత్తుఁడను నెటుజూడఁగవలె
విడరావీరేశుమతము ♦ విజ్ఞాననిధీ 134

వ. అనిచేతులన్ బట్టుకొని బతిమాలుచున్న జననీజనకు
లతోసిద్ధుండిట్లనియె 135

క. కొట్టినవారికి కొట్లుఁ
డిట్టివారలకు మరలఁ ♦ డిట్లరయంగా
నెట్టివగలుగఁవె యిఁకనే
బట్టనవీరగురుపాద ♦ భక్తిన్ విడువన్ 136

గీ. ఇటులబతిమాలినను ఫల ♦ మేమిగలదు
వీరసద్గురు మతమునే ♦ వీడఁజాల
నెన్నిమారులమీకిట్లు ♦ విన్నవించు
కొందునిఁకముందు నిటుఁజెప్పఁ ♦ గూడదొందు 137

వ. అనివిదలించుకొని తొలఁగి నిలువంబడియుండఁగా 138

సిద్ధయ్యను భటులు దండించుట

ఆ. అంతభటులుజేని ♦ యనుమతిన్ సిద్ధని
దరికిఁజేరివీర ♦ గురునిమతము
నొల్లననుమటంచు ♦ ఘెల్లనఁగొరడాలు
రెట్టకొలఁదివిసరి ♦ కొట్టిరపుడు 139

వ. ఇట్లుకొట్టినదెబ్బలు తమకేతాకిచురుకున్నమసభరింపన్ జాలక
ఆ. నొచ్చెనొచ్చెమేమె ♦ చచ్చితిమని కొర

డాలుక్రిందవైచి ♦ డీలుపడియుఁ
గంపమొంది భూమి ♦ కాంతునితో నిట్టు
లనుచుఁ దెల్పి రెల్ల ♦ రరుదుఁ జెంద 141

క. అబ్బో వీనిని గొట్టిన
దెబ్బలు వెసమమ్మె తాకె ♦ దేవర పసుమే
మిబ్బాలు తెలవుఁ బోమిఁక
దబ్బర గావివి యెమాకు ♦ దద్దులు కట్టెన్ 142

వ. అని భటులంగీలను వీడి దద్దులనుజూపింపఁగా నాతురుష్క-
ప్రభుండత్యాశ్చర్యంబునొంది యిదియొక యింద్రజాలంబుగా
దోచుచున్నయది గాని నిక్కంబుగాఁ జాలదీ భటులాబాలు
నివద్దనే మోలంచముఁ గైకొని యోషధీప్రక్రియలచే నీదద్దు
లన్ నిర్మించుకొని చూపుచున్నారలే కాని వేరొండుగా నేరదై
వను నేఁగొట్టి చూచెదనని తలంచి మరల నించుక యోజించి
వారలనినదే వాస్తవంబయ్యెనేని నేఁగొట్టిన దెబ్బలు నన్నే
తాకినచో పరిహాసభాజనుండనుగా వలసివచ్చును గాన
మఱియొక విధంబున సిద్ధని మాహాత్మ్యంబుఁ బరీక్షించి
చూచెదనని యాసిద్ధనితో నిట్లనియె 143

క. సిద్ధా నిక్కంబుగ నీ
యొద్దక్ ఖలు లెంత లంచ ♦ మొందిరొ చెప్పుమా
అద్దిర మార్గంబున నీ
విద్దెలు బన్నుకొని యిటకు ♦ విచ్చేసితివే 144

ఉ. వీరగురుండు దక్క మఱి ♦ వేరొక దేవుఁడె కాని సేనము

సాకారముఁజేయఁగూలుననిఁ ♦ గట్టిగనంటివి నిక్కమైననా
పేరటనొక్కబండనిలఁ ♦ బెట్టితదానికి మొక్కవక్కలా
తీరునఁజేయఁగాఁగలవె ♦ తెల్పుమునీమహిమంబుఁజూచెదన్

చ. అటువలెనేడు తావకము ♦ సాత్వముఁజూపక వీరదేశికుం
డటుకునవీడకున్న నిను ♦ దప్పకఖడ్గమునన్ వధించిమిం
కుక్కుటముగఁగాకఘూకముల ♦ కుందగువిందొనరించి మారిని
ష్కుక్కుటిలతమస్తకంబునకుఁ ♦ గూర్చిజగద్ధితకీర్తిఁగాంచెదన్

వ. అనివసిద్ధయ నృపవర్యునితో నిట్లనియె 147

గీ. క్షితితలాధీశననుబరి ♦ క్షింపదలఁతు
వేనిశిలనొండు దెప్పింపు ♦ మేను మొక్క
వక్కలుగఁజేసిమద్గురు ♦ వర్యమహిమఁ
దేటతెల్లంబుగానీకుఁ ♦ దెలియఁజేతు 148

గీ. అనవుడవనిపుడిటులభ ♦ టాలితోడఁ
బౌరులునుమీరలెల్లకి ♦ పట్లనొక్క
కఠినపాషాణమునుదగు ♦ కమ్మిబండ్ల
పైనిగొనితెండనుచుఁజెప్పి ♦ పంపెనంత 149

క. రజనంబుఱగలుగు నపా
రజనంబులు భటులునినుప ♦ రథమూలపైనన్
గజములకొలతలఁకేటికి
గజమునువలెఁదెచ్చిరొక్క ♦ కఠినోపలమున్ 150

వ. ఇట్లుఁదెచ్చి యాకఠినశిల నొకవిశాలస్థలంబుననునిచి ధరణీ
విభునకెఱింగింపఁగా నతండాసిద్ధునిదోడ్కొనిరండని భటుల

శాజ్ఞాపించి తాను లెక్కకుమిక్కుటంబగు పిక్కరుజనంబు
లును గ్రిక్కిరిసి గుంటికి సమీపించి చూచుచుండ దరహా
సితవదనారవిందుండై సిద్ధండే తెంచునెడ నటన్ గల జనం
బులెల్లరిట్లనుకొనిరదెట్లన్నను 151

గీ. ఉర్వియందున సృష్ట్యాది ♦ నుండి నేటి
కింతమూర్ఖకుని విని ♦ యెఱుఁగరెవరు
వీరగురువీడె జనకుని ♦ వెంటఁ జనక
పాదుపాతోడ నితనికీ ♦ పంటెమేల 152

క. తలరఁగనెంత్తైనను జో
తల చేశిల పగులఁగలదె ♦ తలపోయఁగ భూ
తలమున శిలగాదితని
తలపగులుట నిజముకేని ♦ తలవరిచేతన్ 153

వ. అనిపల్లుజలనుకొనుచుండఁగా సిద్ధుండే తెంచి గుంటికి సమీ
పించి నిలిచియిట్లనియె 154

సీ. అన్నదిష్టగురుండు మ ♦ హాత్ముఁడేని

మన్నమనస్కృతి సోకిన ♦ మాం... ని
కఠినశిల నేడు వేయు వ్ర ♦ క్కలగుఁగాక 155

క. అని శ్రీవీరబ్రహ్మం
దుసకృ్ణ జేయుచుఁ బాణి ♦ తోయజయుగ్మం
బును మోడ్చి గుంటకోక వం
దనము సిద్ధండొనర్పఁ ♦ తత్క్షణమందున్ 156

సిద్ధయ్య గుంటికి మ్రొక్కి వ్రక్కలు చేయుట

ఆ. గజమునతిశయించు ♦ కఠినపాషాణంబు
సిద్ధుఁడొకజాహారుఁ ♦ జేసినపుడె
పిడుగువడినరీతి ♦ ఫెళఫెళార్భటులతో
నిలసహస్రశకల ♦ ములుగవిరిసె 157

వ. అంతనబాబెంతయో వింతనొంది భయభ్రాంతచిత్తుండై
కరంబులమోడ్చి 158

ఉ. ఓమహనీయనీమహిమ ♦ లుల్లమునందెలియంగలేక యే
మేమియొతూలనాడి విధి ♦ యుంచితి శిక్షను నీకుగాపురా
నీమదిలోననావలని ♦ నేరములెన్నక తాళిమించి న
న్నోమఁగదయ్య పాలసున ♦ యోగ్యుఁబ్రభుత్వమదాంధు
నీచుఁనిన్ 159

గీ. ఇంతమాన్యుఁడవనుచునే ♦ నెఱుఁగలేక
విపులకఠిన పరీక్షగా ♦ వించినీకు
జడుఁడనై యపరాధంబు ♦ సలిపినాఁడఁ
గావమన్నింపుమయ్యమ ♦ హానుభావ 160

క. అనిభూపాలుఁడుసాష్టాం
గనమస్కృతిఁజేసిపాద ♦ కమలంబులఁబ
ట్టినపట్టు వదలకున్నం
తనుసిద్ధయ లేవదీసి ♦ తగనిట్లనియెన్ 161

క. తామొనరించిన నేరం
బేమిగలదు వనుబరీక్ష ♦ నిటుఁజేయనిచో

హామకిగురు మహాత్మ్యం
బేమాడ్కి౯ దెలియఁదమకు ♦ నెల్లరికిన్బ్రహా 162

క. ఈశంకనీ మనంబున
లేశంబిడుకొనఁగవలదు ♦ లేమతదితూ
వేశమునఁ నిటువలె౯ ధర
ణీశా చేసితివిదోష ♦ మెడనీవలనన్ 163

గీ. అనుచుదీవించి పాదుషా ♦ నాదరించి
భయమునుడుగఁగ మదినిసం ♦ శయముఁదీర్చి
నంతజననీ జనకులుని ♦ జాత్మజుఁడగు
సిద్ధయనుగాఁగిఁట౯ బ్రేమఁ ♦ జేర్చికొనియు 164

ఆ. మాకనకపుముద్ద ♦ మాతండ్రి మానోము
ఫలమమానితాంత ♦ భాగ్యరాశి
మావరాలకుప్ప ♦ నీవింతమాన్యుండ
వనుచునెఱుఁగమైతి ♦ మాజ్ఞులమయి 165

క. వీరగురుని జేరిననెల
మారకపూర్వంబె యింతి ♦ మాన్యుఁడవైచె
న్నారితివిఁక నెంతఘనుఁడ
వైరాణించెదవొయుందు ♦ మటకొన్నిసమల్ 166

క. తిట్టితిమి నిన్నుదెబ్బలు
గొట్టితిమి ధ్వజంబునకును గూరిచియుంట౯
గట్టితిమి తిప్పలెన్నియొ
పెట్టితిమితుమింపుమయ్య ♦ పేర్మినిదనయా 167

అన్నివేషంబొ వెడు జననీ
జనకుల విడిపించుకొనియు ♦ శాంతోక్తులని
ట్లనిభాషింపదొడంగెను
జనములకచ్చెఋప్రపంచ ♦ సముజనియుంపన్ 168

గీ. తామశంకింపకుండు తలిదండ్రులార
దేహసంబంధమగుపుత్రి ♦ మోహమునను
సమవిడంగలేక చేసిన ♦ సమలుగాన
నింతమాత్రినెమీదోష ♦ మేమిగలదు 169

వ. అనిమెూదార్చు సమయంబున నావృద్ధదంపతులన్ గాంచి
సకాబిట్లనియె 170

శా. మారీమాన్యనిగన్న వారలగుటన్ ♦ మీకన్న భాగ్యోదయుల్
లేకీలోకమునందు నెందునయినన్ ♦ లేఖాశరస్ఫూతులా
తా రెంతోసు చరిత్రులుత్తమయశుల్ ♦ధన్యుల్ ఘుటుల్ గావునన్
రావేమద్గృహముకు బవిత్రమునొన ♦ర్పన్ బుత్రియుక్తంబుగన్

శీఘ్రశాస్త్రోక్త సతీసుత యుక్తంబుగా నవాబుగృంబుననుజ దోడ్కొని
పోయి సత్కరించి పంపుట

క. అనితనకేకటంబున త్రి
వినిముప్పురంగూరుచుండ ♦ బెట్టుకొనిరయుం
బునవిజ సౌధమునకుం దో
డ్కొనిపోయెన్ మనుజనాయ ♦ కుండుమోదమునన్ 172

సీ. అపుడువారలకు న ♦ భ్యంజనస్నానముల్
సేయఁగానొనరించి ♦ సిద్ధమాన్య
నర్ఘ్యపాద్యాదుల ♦ నతిభక్తిఁ బూజించి
ముగురకిష్టపదార్థ ♦ ములుభుజింప
నలుపుచుమూడునా ♦ ళ్లలవీరగురుకథల్
వారలచేమన ♦ సారవినుచు
నాల్గవనాడునా ♦ నావాద్యములతోడ
సిద్ధయున్ మెరవణిఁ ♦ జేయవెంచి
గీ. పోకలాకులు రూకలుఁ ♦ బుట్టములను
బసిడిపళ్లెరమునవారి ♦ కొసఁగిదేవ
అదిమొపల్లకి మెరవణి ♦ కధివసింపు
మనఁగసిద్ధయ బ్రభునకి ♦ ట్లనుచుఁబలికె 173
గీ. భూరమణయప్పుడేయింత ♦ గౌరవమున
కర్హుఁడనుగాదు గురునాజ్ఞ ♦ యనలెలేదు
గానసన్నుత్సవముఁజేయఁ ♦ బూనరాదు
సెలవిడిననేను మద్గురున్ ♦ జేరఁబోదు 174
క. పదచారినగుచు మద్గురు
సదనంబునకేగుదెంచి ♦ సదమలభక్తిన్
ముదమూరసేవఁజేసెద
పదవికి మించఁగలగౌర ♦ వంబిలఁగలదే 175
సీ. అనినృపాలునకుఁదె ♦ ల్పినసమ్మతించి తా
వీరేశునకు సమ ♦ ర్పింపభటుల

వశమునగారవో ♦ పాథానంబులనిచ్చి
సిద్ధయఁబయనంబుఁ ♦ జేసితగిన
పరిజనంబులనిడి ♦ పదచారియైసాగ
సంస్తుచునోమహి ♦ తాత్మయెపుడొ
వరకందిమల్లయ ♦ పురికినేవచ్చెద
శ్రీవీరగురునిత ♦ ర్పింపఁజేయ

గీ. వలయునని వేడుకొని జోహా ♦ రులనొనర్చి
దీవనలుపొంది సెలవునొం ♦ దినిలువఁగను
గదిలిసిద్ధయ పరిజనుల్ ♦ కన్నవారు
వెంటరాఁగందిమల్లయ ♦ వీటికేగె 176

గీ. ఏగివీరేశుఁగనిమ్రొక్కి ♦ యెసఁగఁగడప
పురినిజరిగిన విషయముల్ ♦ పూసగ్రుచ్చి
నటులవివరింప సిద్ధయ ♦ నాత్మమెచ్చి
గురుఁడుదీవించి ముదమునఁ ♦ బరగుచుండె 177

క. కడపనబాబంపించిన
యుడగరలఁదెచ్చి భృత్యు ♦ లొసఁగిన వీరే
శుఁడుగాని వచ్చినవారికిఁ
గడుమర్యాదవిడవారుఁ గైకొసచనినఁ 178

వ. అట్టియెడ నాతూదంబీ పీరుసాహెబులా వీరగురునిసాన్ని
ధ్యంబునకేతెంచి పులకితకరకమలులైనిలిచి 179

క. శ్రీవీరబ్రహ్మేంద్రా
నీవేమాగురుఁడవీవె ♦ నేతవునీవే

దేవుఁడవుగాన దయతోఁ
గావవె మా నేరములను ♦ క్షమియించితగన్ 180

అదంబీ పీరుసాహేబులు పీరేశునకు తమమహాత్మనప్పగించి యేగుట

క. పాపనికైనినుదూరిన
పాపనిచయ విషయకోరు ♦ భారంబులఁదా
పాపనిచో సుగుణకలా
పాపనివడి నెవరుమన్నఁ ♦ బాలింతురికన్ 181

గీ. ఇతఁడు దలపోయనింకమా ♦ సుతుఁడుగాడు
మీకొడుకుసుఁడిపీనిని ♦ సాకికొనియు
నైహికాముష్మిక సుఖంబు ♦ లందఁజేయు
మయ్య శ్రీపీరనారాయ ♦ ణయ్యజియ్య 182

గీ. అంచితంబుగఁగడుపారఁ ♦ గాంచినాము
కాంచిమా చేతులారంగఁ ♦ బెంచినాము
పెంచిమనసారఁదమకొప్ప ♦ గించినాము
సిద్దయను సద్దయనుమాన్యుఁ ♦ జేయుమయ్య 183

ఉ. పాటిలనీమహాత్వమును ♦ భావములందు నెఱుఁగ లేకయీ
నోటికివచ్చినట్లుగని ♦ న్గెగదూరితిమించు కేని మా
మాటలనాత్మలోననణు ♦ మాత్రముఁజేర్పక నేడహోజగ
న్నాటకసూత్రధారికరు ♦ ణన్ క్షమియింపుముమాదు
తప్పులన్ 184

వ. అనిచరణంబులన్ వ్రాలి చెరియొకపదంబునుబట్టి వదల
కున్నన్‌గని సదయాంతరఁగుండగు పీరేశ్వరుండు లేవన్

దీసియాదంబీపీరుసాహెబులతో నిట్లనియె 185

ఉ. ఓసయుశాలులార పాలు ♦ పొందఁగ మీ తనయుండు నాకడన్
బూనికఁ జేరి మీకుఁ గాని ♦ పోవ వశంబును గాక యుంటినే
నైననుబంపలేదనుచు ♦ నాత్రిముఁ నన్నను దూరి నారలే
కానిమతేమి చేతిరి ♦ కావున నేరము లేదు మీ యెడన్ 186

గీ. లోకమందరితో పాటు ♦ లోనమీకు
దేహసంబంధమగు పుత్ర ♦ మోహముంటఁ
దనయునపుడప్పుడరసి పోఁ ♦ దగును గాని
నన్ను దూరిన శంకఁబూ ♦ నవల దెపుడు 187

క. నాపుత్రుండని యే యిఁక ♦
మీపుత్రున్ జూచుకొందు ♦ మిథ్యావాంఛల్
బాపుమనిల నా యంతమ
హాపురుషున్ జేతుసంది ♦ యము లేదుసుఁడీ 188

వ. అని యోదార్చఁగా నావృద్ధ దంపతులు మనశ్శాంతిన్ బొంది శ్రీజగద్గురుతీర్థప్రసాదంబులనందికొనుచు షడ్రసోపేతభోజనంబులన్ దృప్తినొందుచు నలునాళ్లుండి శ్రీవారికి నమస్కరించి సెలవున్ గైకొని సిద్ధని చెక్కిలి ముద్దిడుకొని వృద్ధిన్ బొందుచు మమ్ముద్ధరింపుమి దేవ మేమేగి వత్తుమనుని డివికడు ముదంబున ముసుమాంకే తెంచిసుఖంబున నుండినవారలైరి

ఆశ్వాసాంతములు

క. గోధర గోధర గోధర
గోధర గోధర సరోజ ♦ గోధరసమ్మవి

ద్యాధారాళౌదార్య మ
హాధైర్యైశ్వర్యవైశ • వాకారఖనీ 190

క. రామాకామా జగదభి
రామాశౌర్యజితపరశు • రామాకరుణా
రామాకీర్తి విజితబల
రామాశత్రుజనగణవి • రామసుధామా 191

కమలవిలసిత. సమధికసమరస • సదమలనీతి
ప్రమథగణపనిభ • పరమవిభూతీ
శమనతనయసమ • సముచితసాతీ
విమలతనువిజిత • విధువరసూతీ 192

గద్య

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధ చతుర్విధకవితా
విచిత్రవిశ్వకర్మకులపవిత్ర భద్రదత్తగోత్రపోమా
రివంశాబ్ధికైరవ మిత్రరామలక్ష్మాంబాసు
బ్బయాచార్య పుత్రకవిసింహ బిరుద
పాత్ర బుధజనానుమతి కాశీపతి
ప్రణీతంబైన శ్రీసిద్ధరామే
శ్వరచరిత్రము నందుద్వి
తీయాశ్వాసము
సంపూర్ణ
ము

## తృతీయాశ్వాసము

క. శ్రీవిశ్వకర్మకుల పా
రావారాభోగసితక • రావిబుధవరా
భావజ సంకాశవిలా
సావీరబ్రహ్మనామ • సద్గుణధామా 1

ఆ. అవధరింపఁగదేవ • హాత్మ్యుఁడన దపో
ధనుఁడనంగఁబుణ్య • తముఁడనంగఁ
బరగుసిద్ధయోగి • వరుచరిత్రమునందు
వినఁగునవలిగాథ • యెట్టులనిన 2

సీ. గురుఁడుజపంబున • కునుబూనునెడ మృగా
జినమాలికాదులు • సిద్ధపరచు
వీరేశ్వరుండెటఁ • గూరుచుండిన మనో
హరమగురీతిగా • సుకటిపిచు
నాచార్యుఁడెప్పుడుశ • య్యను బవ్వళించిన
సమితసౌఖ్యముగఁబా • దములనొత్తు
దేశికుంగెటకరు • దెంచుచుండిన సిత
చ్ఛత్రంబుఁబట్టియు • సరసనేగు

గీ. నప్పుడిపుడననేల య • హర్నిశములు
నేయదనునందు నేసేవఁ • జేయవలెనొ
అట్టిసమయోచితపరిచ • ర్యలనొనర్చు
నహహాసిద్ధయభక్తినే • మనఁగవచ్చు 3

క. ఇట్టులసేవింపుచును

# తృతీయాశ్వాసము

స్పష్టిసుమతిరైన సిద్ద ♦ యాఖ్యునిపైనఁ
కెట్టించినప్రేమను దన
పట్టిగ వీరగురువరుఁడు ♦ భావించితగఁ

సీ. తనయపాద్రైకేఁమ ♦ జ్జనమొనర్పఁగనేగి
రమ్మనిసెలవిచ్చి ♦ రాణిననుపుఁ
బ్రియసుతావేళయా ♦ రయమునమీాయమ్మ
నడిగెబోసేసిర ♦ మ్మనుచుఁబంపు
నందనానీహస్త ♦ నాళీకములు నొచ్చు
సురటినిల్పుమటంచు ♦ సారదినాపుఁ
పుత్రికానేఁడర్థ ♦ రాత్రిగావచ్చె నిం
చుకశయనించుమం ♦ చుసెలవిచ్చు

గీ. శిష్యులెవ్వరైనఁజేరినఁ ♦ జేరకున్నఁ
బట్టివినుమని కూర్చుండఁ ♦ బెట్టుకొనియు
మంజులముగఁగాలజ్ఞాన ♦ మర్మములను
సిద్ధయకు బ్రహ్మమొగిబోధఁ ♦ జేయుచుండు

గీ. వీరగురువర్యుఁడెప్పుడేని ♦ కూరుచుండు
మనినసిద్దాభిధుఁడుదూర ♦ మునకునేగి
కూరుచుండఁగఁబోవఁబ ♦ ల్మారుఁజీరి
దండఁదనపీఠినొరసికూ ♦ ర్చుండఁజేయు

గీ. తండ్రిగావీరగురుఁనిసి ♦ ద్దఁడను మరియుఁ
గాదుకుగానలసిద్దని ♦ గురువరుఁడును
తథ్యముగనెంచుకొని యాజ్ఞే ♦ దంబుగాను

భ్రాంతిచేతసుక్రాత్తపవ్రివ ♦ ర్తింతు రెపుడు 7

వ. ఇట్లు భేదంబుగా వర్తింపుచున్నా కొన్నొకదివసంబున వీరేశ్వరుం
గాంచి సిద్ధుం డిట్లనియె 8

సిద్ధుఁడు వీరేశ్వరునుపదేశ మిమ్మనుట

ఉ. దేవమహానుభావ విను ♦ తెంచెద నా మొరలాలకించి నన్
గావఁగదయ్య యెట్లనినఁ ♦ గారణమీవిఁక నైననాకిఁకన్
గావలయున్ సుమాయటులఁ ♦ గాక మదీప్సితమెట్లు దీరు నీ
సేవకుఁడన్ విధేయుఁడను ♦ శిష్యుఁడ నాశ్రితుఁడన్
ముముక్షుఁడన్ 9

క. దేశమునకన్న గురునుప
దేశముఁగొనసరునకధికమె ♦ తిరుమసినాయు
ద్దేశముగావున భవతా
దేశము నెఱిఁగింపు మెటులొ ♦ తేటపడంగన్ 10

వ. అనిన బ్రియశిష్యునకు గురువరేణ్యుం డిట్లనియె 11

క. సిద్ధా కడపకుఁజనినా
యొద్దకుఁడా వచ్చినంత ♦ నుపదేశము నే
నద్దయనొసఁగెదనంటివి
ముద్దుగ నేనిపుడేన్ గటాక్ష ♦ మును నీకిడనే 12

సీ. తొలుతటిజన్మమం ♦ దున నీక్షుతాటుక మా
రుఁడవయి వేటాడ ♦ నడవి కేగి
అటనొకకుక్కొరొఁడుకును ♦ వ్యాఘ్రంబుపట్టుటఁ
గని పులిన్ బాలియించి ♦ గవినిబ్రోవ

నెంచి బాణముఁ బ్రయో ♦ గించిన గురితప్పి
శరముగోవునె తాకి ♦ సమయఁజేయ
నతిచింతనాక్రాంత ♦ కరుడెంచి యొఱిఁగించి
మోక్షమార్గమునుజూ ♦ పుమని వేఁడ

గీ. నేను గోహత్యపాతకం ♦ బెనసె నీకు
ముందుపింజారిగా జన్మ ♦ మొంది వచ్చి
అడుగుమపవర్గమిదుదుఁబో ♦ మ్మంటిఁ గాన
నేకరణి నీకు నుపదేశ ♦ మీకనుందు 13

క. కానొందుము ముక్తుండవు
గానని పుడు కారణంబు ♦ గావలెననుటే
కానియడుగక యొసంగని
నేనుండఁగఁగాదు వగలదె ♦ నీకుం దైనన్ 14

క. అనవిని సిద్ధుఁడు పీరగు
రుని గని ముకుళితకరాంబు ♦ రుహుఁడై తగని
ట్లనుచు వినయంబు దోఁపఁగ
మనవిని జేసుకొనఁ దొడఁగె ♦ మధురోక్తులతోన్ 15

క. వీరేశ్వరావతారా
సారాచారసువిచార ♦ జగదాధారా
పారావారగభీరా
కారుణ్యాపార నిర్వి ♦ కారాధీరా 16

చ. కినుకఁగొననందలేవనుచుఁ ♦ గాదుకటాక్షము నెవ్వఁడేనియా
వని మదినెంచి కాదడుగు ♦ టాఁకొనినప్పుడతిండి బెట్టినన్

దనివోనసారజీవికుఁడు ♦ దృప్తినిజెందిన మాడ్కి నేను గో
రినపుడె కారణంబిడినఁ ♦ బ్రీతివహింపనె దేశికోత్తమా 17

సీ. దగఁగొన్నవానికి ♦ దాహంబుదీరునే
జలముఁగ్రోలక వార్ధి ♦ సరసనున్న
రోగికివ్యాధిని ♦ ర్మూలించునే తగు
మందుమెక్కక వైద్యు ♦ మనికినున్నఁ
గర్షకునకుఁబంట ♦ గల్గునేవిత్తక
రసవంతమైనభూ ♦ వసతియున్న
గోపకునకుఁ బాడి ♦ కూడునేపిండక
పాలనిచ్చెడుధేను ♦ జాలమున్న

గీ. ముముక్షువునకు ముఖ్యముగఁదలపోయుము ♦ 
దుర్లభంబైన మోక్షంబు ♦ దొరుకఁబోనె
సముచితంబగుసదుపదే ♦ శంబుఁగొనక
ఎంతటిమహానుభావుని ♦ చెంతనున్న 18

సిద్ధనికుపదేశంబిచ్చుట

మ. అనినన్ దేశికవర్యుఁడిట్లనియెశి ♦ ష్యాగ్రేసరా యెప్పుడో
యనిభావించితివేమొ కాదటులఁ ♦ బ్రోద్యల్లీలనీనాఁడె రా
త్రినినీకేనుపదేశమిచ్చెదను సం ♦ దేహంబికన్ మాని న
మ్మనమందున్ ముదమందుమయ్యతగయు ♦ ష్మద్వాంఛ
లీడేరెడున్ 19

మ. అనసిద్ధుండుమనంబునందుఁబరమా ♦ హ్లాదంబునన్ బొంగుచున్
దనకున్ భక్తిదలిర్పఁగాఁ గడపనేల్ ♦ ధాత్రీశలాధీశుఁడి

చ్చినసతాం-రధనంబుతోనప్రదఃకా ♦ శ్వేయాంబరోత్తంసభో
జనసామగ్రిల సర్వవాద్యములఁబూ ♦ జావస్తులన్
గూర్చియున్ 20

గీ. పరిసరగ్రామములనుండి ♦ భక్తజనులఁ
బిల్వనంపించి వారికిఁ ♦ బిండివంట
కములఁజేయించిగురుఁడుఁద ♦ త్కాంతతాను
స్నానములుజేయఁగాంతి ♦ వైనయంత 21

సీ. మహనీయమణిజాల ♦ మరమెల్లెడలఁబట్ట
పగలుగాదీవిటీలు ♦ ప్రజ్వరిల్ల
ననుపమస్థితిఁబ్రాతి ♦ ధ్వనులీనబహువిధ
లలితమంగళతూర్య ♦ ములుసెలంగ
హితవుగాగురుసతీ ♦ పతులు సింహాసనా
సీనులైకడుఁబ్రకా ♦ శింపుచుండ
గురుదంపతులకుఁగొ ♦ మరువిరుగడఛత్రి
చామరంబులుబూని ♦ సరసనిల్వ

గీ. భక్తతతివీరగురునామ ♦ భజనసేయఁ
బూలుపలరయాజ్ఞికులుమంత్రి ♦ ములువచింప
నోలిసిద్ధాభిధుఁడుషోడ ♦ శోపచార
పూజగురుమిథునమునకిం ♦ పుగనొనర్చె 22.

గీ. ఇటులఁబూజించినంతటి పి ♦ రేశ్వరుండు
సిద్ధయనుముఖవస్త్రభా ♦ సితునిజేసి
కరముశిరమునసుంచి వ ♦ క్త్రింబుజెవిని

సీ. అతిభక్తిరసమున ♦ నభిషేకమొనరించి
విశ్వాసవసనదీ ♦ పితునొసర్చి
సాత్త్వికరాజస ♦ చందనాక్షతలూన్చి
శమదమామోదపు ♦ష్పములమర్చి
జఠరాగ్నిలోనరి ♦ షట్కధూపము వేసి
విజ్ఞానదీపముఁ ♦ వెలుఁగఁజేసి
విస్మృతానందనై♦ వేద్యంబునర్పించి
వినయతాంబూలంబు ♦ వేడ్కనిచ్చి
గీ. చిరతమోగుణ నిష్కద ♦ క్షీణనొపంగి
క్షితిన తేంద్రియుఁడైనమ ♦ సత్కృతులుసల్పి
శిష్యుఁడాచార్యునెనఁగన ♦ ర్చించునదియె
న్యాయమైనట్టిగురుపూజ ♦ యండ్రుబుధులు 30
ఆ. ఆశలేనియట్టి ♦ యాచార్యుఁడవలేని
శిష్యుడైనవారి ♦ చెల్వమెన్న
నలువకైనఁదరమె ♦ నాకాశలేదర
యేలనీకుసుగుణ ♦ జాలసిద్ధ 31
వ. అనితకుంగల భక్తజనంబులకుఁ దీర్థప్రసాదంబుల నొసంగవారలత్యానందంబున స్వీకరించి యాచార్యసార్వభౌముని యాశారహిత వాత్సల్యాదిగుణంబులకచ్చెరువందుచసాక్షాద్వీరనారాయణుండాదినారాయణుండేయగుఁగాని వేరొకండుగానేరఁడని యిట్లువర్ణింపందొడంగిరది యెట్లన్నను 32
సీ. తగమందనుడులపొ ♦ తముఁ వెలయించుట

దివ్యస్థలకచలముఁ ♦ దేల్చుటయును
వినతయూవిశ్వంభ ♦ రనుజక్కఁజేయుట
పలలాశనాన్వయా ♦ ర్భకుమనుచుట
పుణ్యజనేంద్రుచే ♦ భూదానమందుట
ద్విజులకు ద్విషుఁడుగాఁ ♦ దేజరిలుట
విశ్వకర్మాన్వయా ♦ విఖ్యాతుఁడగుటయు
నాలగాపరియన ♦ నలరుటయును

గీ. బుధులుగణియింపన సమప్ర ♦ బుద్ధుఁడగుట
పుణ్యమిలనిల్పఁబుట్టఁబో ♦ వుటయుఁజూఁడ
రూఢిగదశావతారస్వ ♦ రూపుఁడైన
ఆదివిష్ణుఁడెయాదినా ♦ రాయణుండు 33

గీ. అనిశవినిభక్తజనులయం ♦ దునసుగొంద
రిట్లువచియించి రరయఁపీ ♦ రేశ్వరుండు
తథ్యముగవిష్ణుఁడౌనుసి ♦ ద్ధంపమాత్ర
మవనిసామాన్యబాలకుఁ ♦ డగునెతలఁప 34

సీ. కూ్రరమాంసాశన ♦ కులమునఁ బుట్టుట
సమాజసమంచద్వి ♦ చారుఁడగుట
బ్రహ్మగురుఁ మహా ♦ భక్తిసేవించుట
ధృతిబాల్యదశఁపిత్రు ♦ మతమువిడుట
తండ్రిచేభటులచే ♦ దండనంబొందుట
మహిమఁదద్బాధావి ♦ దహితుఁడగుట
అలజగద్గురుసత్క ♦ టాక్షార్హుఁడగుటయు

విదితనానామూర్త్యి ♦ వినుతుఁడగుట

గీ. మొదలగుపరివర్తనంబులు ♦ వెదకిచూడ
నిరుపరకుభేదమొకయించు ♦ కేని లేమి
చిరతరానందమూర్తియగా ♦ సిద్ధయాఖ్యఁ
జారకలియుగప్రహ్లాదుఁ ♦ డనఁగఁదగెఁ 35

వ. శ్రీవీరబ్రహ్మేంద్రస్వాములవారికి జే శ్రీ వీరనారాయణునకు జే శ్రీసిద్ధసుధీమణికిజే శ్రీ కలియుగప్రహ్లాదునకు జే యని పలుభక్తజనంబుల జయజయధ్వానంబులాలించి శ్రీ వీరబ్రహ్మేంద్రుని కుమారులగు గోవిందాచార్య పోతులూరాచార్యులు సిద్ధనిగౌరవంబునకు సహింపఁజాలక యీతండిటనుండినచో మనలనసుకొను వారలుండరు గావునవీనిని మఠంబుననుండి వెడలఁగొట్టవలయుననియాలోచించు కొని యుండఁగా నాటిభోజనాది కార్యక్రమంబులు నెరవేరిన పిమ్మట, యెవరెవరినిలయంబులకు వారలేగెంచిన తదనంతరంబున నొకానొకదివసంబున నొంటిపాటున నుండినసిద్ధనిఁ జూచిగురునందను లిట్లనిరి 36

సిద్ధనిఖ్యాతి కోర్వలేక గురునందనులు వెళ్లఁబొమ్మనుట

క. సిద్ధాయిఁకనీవిటమా
యొద్దన్ నీవుండరాదు ♦ యుష్మత్పురికిన్
సిద్ధముగానే తెంచియు
ముద్దుగఁదలిదండ్రులకును ♦ మోదంబిడుమా 37

గీ. ఎందుకనమానికేతన ♦ మందునన్ని

చోట్లఁదిరుగుచు నెల్లవ ♦ స్తువులఁదాకి
మైలపరచెదవనుచును ♦ మాకులస్థు
లందరాక్షేపణముఁజేయు ♦ చుందురెపుడు 38

ఆ. అగ్రజాతివార ♦ మగునట్టి మాయింట
వంటఁగానివాఁడ ♦ వుంటతగదు
కాన నేఁడొ రేపొ ♦ మానెళవునువీడి
తీరవలయుఁగొంపఁ ♦ జేరవలయు 39

వ. అనిపల్కు గురునందనులకు సిద్ధండిట్లనియె 40

ఆ. అయ్యలారమీకు ♦ నపకారమెన్నఁడు
సలిపియెఱుఁగనెగ్గుఁ ♦ బలికియెఱుఁగ
నెనరులేకయిట్టు ♦ లనన్యాయమే మన
గురునియాజ్ఞవలదె ♦ కొంపఁజేర

క. ఎటనుండుమనెదరో నే
నటనేయుండెదనుదేని ♦ నంటనుమతివి
స్ఫుటముగ మీయాశ్రితున
ప్పటికిఁ జవదాటమాటఁ ♦ బడనెవ్వరితోన్ 42

క. లోకాచారముత్రిగ
మీకులజుల తోడనెపుడు ♦ మీకొకమాటన్
రాకుండునటుల మెలఁగెదఁ
బ్రాకటముగఁబ్రాముునాదు ♦ భక్తిగనరే 43

వ. అనిముకుళిత కరకమలుండై మనవిఁజేయుచున్న సిద్ధనివాక్యం
బులు పెడచెవిఁబెట్టి యేగుచు నీతనికిన్ బొమ్మనిచెప్పనేల

యన్నపానాదులు విచారింపకున్న నాతండెవ్వఁగలండని గురునందనులు దమతల్లియగు గోవిందమాంబ కడకరుదెంచి నమస్కరించియిట్లనిరి 44

సిద్ధని కన్నపానాదులిడమని గురునందనులు తల్లికి చెప్పుట

క. అనుమానింపక జననీ
గానుమా మానందనములు ♦ కూరిమితోడన్
గనుమా మామొఱలించుక
వినుమా పాలింతుమీదు ♦ విన్నపమనుమా 45

శా. అమ్మా సిద్ధుఁడు వేడ్కమీఱ నమనగే ♦ హాబందునన్ జేరిని
త్యమ్మున్ జన్మతరింపఁగాఁగలుగువే ♦ దాంతంబు నంమన్ రహా
స్యమ్మున్ మాతపితచేగ్రహింపుచునుధ ♦ న్యత్వంబు నార్జింపుచున్
మమ్మున్ మించి చరింపుచుండెనిఁక నే ♦ మాడిన్ సహింపన్ వలెన్ 46

మ. మనునెవ్వారల లెక్కసేయక మహా ♦ మాన్యుండటంచున్ బుధో
త్తముఁడంచున్ ఘనుఁడంచుసిద్ధనిసభా ♦ స్థారుల్ మఱఁబందని
త్యముసంస్తోత్రముఁ జేయుచుండిరిఁకమా ♦ దైన్యస్థితిన్ గూర్చి త
ధ్యముగానేమని విన్నవింపవలెమా ♦ తానీవెరోజింపుమా

ఆ. వేడ్కమాగురుండు ♦ వేదాంతమునునూరి

పోయునతని కెనఁగ ♦ రేయుఁబవలు
నతఁడుమనగృహంబు ♦ నందికడనుండినఁ
బనికిరామువాని ♦ పట్లమేము 48

మ. జననీసిద్ధఁడుస్థాయిగామన నివా♦సస్థానమందుండినన్
దనరన్బూజ్యుఁడునై మఠంబునకున♦ధ్యక్షుండుగానోపుమీ
జిసకార్యంబులుజక్కఁ జేసుకొనుచే♦రీతిన్ బాసంగున్ దటా
లుపవానిన్ దనమందిరంబునకునా♦లోచించిపంపన్ దగున్

క. నెమ్మతిగాసిద్ధని గని
నమ్మంటగరానినీవు ♦ మాకడనుంటల్
సమ్మతిగాదిఁక నింటికిఁ
బొమ్మనగురునాజ్ఞ లేక ♦ పోనని పలికెన్ 50

క. తిట్టఁగఁబని లేదాతనిఁ
గొట్టఁగఁబనిలేదుమిగుల ♦ గొణఁగఁగఁబనిలే
దెట్టులఁజనునన నన్నముఁ
బెట్టకయుండినను దానె ♦ వెలుచననేగున్ 51

క. వానిని వీడుమటంచును
మానాయనతోడనందు ♦ మాకోపపడున్
గానివిడఁడతనినియును
మానముగలదట్టియుద్య ♦ మమునుమనకేలా 52

ఆ. కానవానికన్న ♦ పానంబులిడకున్నఁ
దానెపోవునింటి ♦ దారిఁబట్టి
మదిఁదలంపనిదియెఁ ♦ సదుపాయమని తెల్పు

జననియిట్టులనియెఁ ♦ దనయులకును

గోవిందమ్మ సిద్ధనిచెల్లెగొట్టుట న్యాయముకాదనుట

మ. సుతులారాయిటుఁ దెల్పఁగాఁదగునెమీ ♦ సోదర్య

లట్లున్ సమం

చితభావంబులసిద్ధనిన్ గనినచో ♦ శ్రేయంబగున్ మీకుమీ

పితరుండాతని నెల్లవేళలఁగడున్ ♦ బ్రేమించుచుండంగనే

వ్యతిరేకంబుగనిర్దయన్ గనుట భా♦వ్యంబా నెయోజింపఁగన్

క. పతిననుసరించి మెలఁగని

యతివకునిహమందుఁబరము ♦ నందునగతులే

స్థితిఁగలుగును బతిభక్తియె

సతికిఁబరమధర్మమగుని ♦ చతురణసేయన్ 55

క. అలసిద్ధని మీరనుజుని

వలె మిత్రునివలెనుభృత్యు ♦ వలెశిష్యవరున్

వలెభావింపక శత్రుని

వలెఁగాంచుట పుత్రులార ♦ భావ్యమెమీకున్ 56

గీ. బాల్యచాపల్యముననిట్లుఁ ♦ బలుకుచుంటె

కానిమీరిటులనన్యాయ ♦ వరానెతలఁప

నన్నమును బెట్టుమనివచ్చి ♦ నట్టివాని

కెటులఁబెట్టకమానియుం ♦ డుటపొసంగు 57

క. అనిపలికెడు జనయిత్రిన్

గనుఁగొని సుతులిట్లుఁబలకఁగాఁదొడఁగిరవారో

జననీపలుమరు ధర్మం

బనియెదమమ్మ ననుసరింప ♦ న్యాయముకాదే 58

గీ. బాల్యమునఁదండ్రియాజ్ఞయా ♦ వనమునందుఁ
బ్రాణనాథునియాజ్ఞ వా ♦ ర్థకమునందుఁ
దనయులయనుజ్ఞ మెలఁగుట ♦ ధర్మమగును
గానస్వాతంత్ర్యమతివకెం ♦ దేనిగలదె 59

గీ. కానవార్ధకమెగసిన ♦ దానవగుట
నందనులమగుమాయను ♦ జ్ఞను మెలంగఁ
దగునుగాని తొలంగఁగా ♦ ధర్మమగునె
ఇలనునీవెఱుఁగనిన్యాయ ♦ మెందుఁగలదు 60

ఆ. అనినసుతులతోడ ♦ జనయిత్రియిట్లని
తగవదించెమీఁదు ♦ తండ్రితోడఁ
దెలిపిసిద్ధనికిని ♦ సెలవునిప్పించి పం
చెదనటంచు విభుని ♦ జేరిమ్రొక్కె 61

ఆ. ప్రాణనాథముట్ట ♦ రానిసిద్ధఁడుమన
నిలయమందునెపుడు ♦ మెలఁగుచుంట
మనతఃసాభవులును ♦ మనబంధుచయమిట్ట
పడతలేదుమైల ♦ పరచుననుచు 62

గీ. ఆఁడియొగాళ వాణికి ♦ నన్నవస్త్ర
ములనొసంగుచుఁబోషింప ♦ వలసియుంట
భారమగుఁగాదె మనకున ♦ నారతంబుఁ
గానఁబంపింపుమతనిస్వ ♦ గ్రామమునకు 63

ఆ. అప్పుడపుడువచ్చి ♦ యాత్మవిచారంబు

దెలిసికొనుచువెళ్ల ♦ వలయుఁగాని
యెప్పుడుసిద్ధఁడిచట ♦ నేవసియించుట
కిష్టమేరికించు ♦ కేనిలేదు
వ. అనిపలుకు—సతీమణికి వీరబ్రహ్మేంద్రుడింట్లనియె 65

వీరేశుఁడు సిద్ధనిపోఁడనకుట

గీ. సిద్ధఁడంటఁగరానట్టి ♦ శిష్యుఁడనుచుఁ
బలికెదవోకించుకేనితా ♦ తెలియనట్లు
కులముతోనేమిపనివాని ♦ గుణమువెన్న
వలదెమహితాత్ములకునంటు ♦ గలదెసఖియ 66
సీ. బోయకులంబునన్ ♦ బుట్టినవాల్మీకి
యమలాత్ముఁడగుటబ్ర ♦ హ్మర్షిగాడె
వేశ్యకాంతకునుద్భ ♦ వించినట్టి వశిష్టుఁ
డమలాత్ముఁడగుటబ్ర ♦ హ్మర్షిగాడె
బెస్తచేడియకునా ♦ విర్భవించినవ్యాసుఁ
డమలాత్ముఁడగుటబ్ర హ్మర్షిగాడె
చండాలయువతికి ♦ జన్మించిన మతంగుఁ
డమలాత్ముఁడగుటబ్ర ♦ హ్మర్షిగాడె
గీ. అల్పకులులైనసుజ్ఞాను ♦ లగుదురేని
యవనినగ్రిత్వమునను బూ ♦ జ్యతనుగనరె
వారినస్పృశ్యులనఁగల ♦ వారుగలరె
సిద్ధఁడట్టిఁడుగాదెయో ♦ జింపఁగాంత 67
గీ. కొమరులలిగిన నలుగనీ ♦ కులమువారు

నిందఁజేసినఁ జేయనీ ♦ నీకు భార
మగనుదోచినఁదోచనీ ♦ సుగుణుఁడైన
సిద్ధనిన్ వెళ్లి పొమ్మని ♦ చెప్పనబల 68

క. అనిపల్కెడు పతిపల్కుల
కెనలగు ప్రత్యుత్తరంబు ♦ విడలేకమనం
బున నొక్కించుక లజ్జన్
గొనిచని గోవిందమాంబ ♦ కొమరులకనియెన్ 69

ఉ. నందనులార నేనుదమ ♦ నాయనదాపున కేగి సిద్ధనిన్
బొందుగఁదండ్రిచెంగటికిఁ ♦ బుచ్చుమటంచుఘటిల్లినట్టియి
బ్బందుల నెల్లఁదెల్పినను ♦ వానినిబొమ్మనచుఁబల్కెనే
మందునొకించుకేనివినఁ♦డాయెనునామొఱ లేమిసేయుదున్

ఆ. కఱవుమనినమిగులఁ ♦ గప్పకుకోపంబు
విడువుమనిన ఫణికి ♦ పృథులకోప
మనచందమాయెఁ ♦ దనతోడమీ తోడ
నేమిసేతువలయు ♦ నింకమీద 71

వ. అనిన గన్నతల్లికిఁగూమారులిట్లనిరి 72

ఉ. ఎందులకింతకష్టమఁవ ♦ హింగ చెడుతల్లిరో నీకుసిద్ధఁడే
నందనుఁడౌను మేమిఁకవ ♦ నంబులపాలయిపోదుమింతటన్
మందిరమందుమీరలెన ♦ మంజసరీతిని గౌరవంబులన్
బొందుఁడుమీకుమాకుఁదల ♦ పోయఋణంబులుదీరె
నేటితోన్ 73

క. అనితమకడఁగలసాత్త్వలు

జననికడన్ బారవైచి ♦ సాగిలపడి బో
రున నేడ్చుచుఁ గడపటి వం
దనములు గొనుమనుచు మ్రొక్కి ♦ తరలెడు వేళన్ 74

ఆ. తల్లి యడ్డగించి ♦ తనయులఁ గౌఁగిటన్
బట్టి యేడ్చుచు నిటుఁ ♦ బలుకఁ దొడఁగె
సూనులార మిమ్ముఁ ♦ జూడకుండిన నొక్క
నిముసమైన నేను ♦ నిలువఁగలనె 75

క. కానకరుగుదెంచి నమినుఁ
గానక గృహమందునుండఁ ♦ గలనా యింకమి
మ్మేనెటువలె వీడుదుని
మ్మేనెటువలెఁ బూనిమనుదు ♦ మీరుండనిచోన్ 76

క. ఈపట్ల నాకొకించుక
పాపము రానీ మదీయ ♦ భర్తను నాపైఁ
గోపము రానీ సిద్దని
కోపఁగరానట్టిచిక్కు ♦ లాఁడింతునిఁకన్ 77

క. జాలమున సిద్దనికి నే
నోలిన్ జిక్కులను బెట్టు ♦ చుండిన నతఁడే
లీలనిట నిలుచునోయది
తేలఁగలదు నాలుగైదు ♦ దివసంబులకే 78

గీ. మీరు చెప్పిన విధమె పొం ♦ జారివానిఁ
గష్టపెట్టెద హరిసాక్షి ♦ గానటంచు
నెట్టుకొనివచ్చి సుతులను ♦ వట్టిఁ జేర్చి

బుత్రివాత్సల్యమెంతకుఁ ♦ బూన్చెనహహ 79

వ. ఇట్లుఁజేర్చి గోవిందమాంబ తనమనంబున 80

సీ. అలసిద్ధనికిబోజ ♦ నాదులందుననుమి
కిఁలిచికుఁలనుగలి ♦ గింతునేని
నిలువఁజాలక తన ♦ నిలయంబునకుఁజనుఁ
జనకున్న గురునితోఁ ♦ దనదుదెసలు
విన్నవించును విన్న ♦ విఁచినసిద్ధని
కెందులకిటుచికుఁ ♦ విడుటయనుచు
వనుగురుండడుగుసి ♦ ద్దని నిల్పుకొనుట నం
దనులల్గి పోవుచుం ♦ డిననువగచి

గీ. సుతులబతిమాలితోడితె ♦ చ్చితినిసుతుల
చన్న చోయింటనేనుండఁ జాలననియుఁ
దెలుపుదును విభుఁడపుడేని ♦ కలఁతనొంది
వేగసిద్ధనిఁబురికంపి ♦ వేయకున్నె 81

క. అటువలెసిద్ధని మత్పతి
గొటికకునంపింపకున్నఁ ♦ గొమరులనైనన్
జటులతరముగ సమ్మతిపరు
చుటకైననుబూనకున్నె ♦ చూచెదననుచున్ 82

వ. గోవిందమాంబసిద్ధనికన్నపానాదులు విచారింపకకష్టపెట్టు
టకుఁగృతనిశ్చయయైయున్నయంతమాతృపుత్రులుదురాలో
చనములు వినుచుండిన యందుండు దురితాత్ముయగు
నొకదూతిక 83

సీ. తనరగురుండు పా్ర ♦ తః కాలమున మఠం
బుననుండి యింటి కే ♦ వనికొ సిద్ధ
యను బంప నతఁడేగి ♦ జననిరో గురునాజ్ఞ
నాలింపుఁడని యొక్క ♦ మూలకొదిగి
కూర్చుండి యుండిన ♦ గొబ్బున దూతిక
పొరకఁ గైకొని వెలి ♦ కరుగుదెంచి
తూలనాఁడుచె కాక ♦ లే తెమ్మటంచును
కడువడివానిపైఁ ♦ గసవుఁ జిమ్మ
గీ. దులుపు కొనుచును సిద్ధఁ డీ ♦ వలను నిల్వఁ
జూచు దూతిక కసవు నూ ♦ డ్చుటలు మాని
వెళ్లవేమని గదుముచు ♦ వేగవచ్చి
యతనిపైఁ బడుగతిఁ గల ♦ యంపిఁ జల్లు 84

క. తన దూతిక చేష్టలు గనుఁ
గొని యూరక యుండుగాని ♦ గోవిందమ సి
ద్ధని కటులఁ జేయఁ దగదని
యన దెంతటి కఠినమొ నె ♦ న కుటిల యయ్యో 85

గీ. అపుడు గోవింద మాంబ నే ♦ రుపు దలిర్ప
గురుని యాజ్ఞను నెరవేర్పఁ ♦ గొడుకు నంపు
దేవి సుతునంపి నంత దూ ♦ తిక గ్రహించి
కోప మెసఁగఁగ సిద్ధని ♦ వైపుఁజేరి 86

క. వద్దనుకొను నీ మొగమున
పొద్దున నే చూడవలసె ♦ బో పొమ్మనుచున్

గద్దించి దుష్టదూతిక
సిద్ధయ్యను వెళ్లఁగొట్టుఁ ♦ జిరమురకలతోఁ 87

వ. అట్టియెడ సిద్ధండు గురుసన్నిధి కేతెంచి దూతిక చేష్టలు సహించి చూచుచుండిన గురుదేవి హృదయంబట్లే యుండనోపునని తలంచి మఱియు నే నేతెంచినప్పటి నుండి యును బుత్రవాత్సల్యమునఁ జూచుచుండిన గురుదేవి చిత్తవృత్తిని గుర్తింపక తీవ్రపడి యట్లనుకొనుటచే ద్రోహిననుడనని భావించిన సిద్ధని కానాటినుండి గోవింద మాంబ నూపుచుండిన కఠినవర్తనం బెట్టిదనిన 88

* సిద్ధనికి గోవిందమాంబ యన్న పానాదులు విచారింపకుండుట *

సీ. గురుని వెంబడివచ్చి ♦ కూటికిఁ గూర్చున్న
వెసనొకఁ - పనిఁజెప్పి ♦ వీధికనుపుఁ
బనిసిదానెరవేర్చి ♦ కొని వచ్చి కూర్చున్న
మళ్లి రాపొమ్మని ♦ వెళ్లనంపు
నందరుఁదిని చన్న ♦ యపు డన్నమడిగిన
నైపోయె లేదు పొ ♦ మ్మనుచుఁ బలుకుఁ
బెండలకడవచ్చి ♦ పెట్టు మన్న మటన్న
మును బెట్టవలెనె నీ ♦ కనుచు గదుము.

గీ. మరచునకు నింటికేని బలు ♦ మారుఁ ద్రిప్పి
త్రిప్పి పంపుచె కాని యొ ♦ కప్పుడైనఁ
దినుమటంచును గరుణతోఁ ♦ దిండిఁ బెట్ట
దాయె గోవిందమాంబ సి ♦ ద్ధయ కయారె 89

వ. మఱియుం బోతులూరాచార్యుండు సిద్దని యెడం జూపు
కర్కశ వర్తనం బెట్లన్నను 90

క. కొట్టి కసలేని వస్తువు
గట్టిగం దెమ్మనుచుం బనుపం ♦ గాం జేకున్నన్
దిట్టుచు సిద్దని చెవిమెల
బెట్టు నిసీపొమ్మటంచు ♦ ఫెళ్లునం గొట్టున్ 91

ఆ. ఇనుమ లెన్ని వార ♦ లీడుచున్న సిద్దండు
గురుని కెపుడుం దెల్పు ♦ కొనం డొకింత
తెలుపు కొనినచోన ♦ తీ సుతులను గురుం
డలుకతోం శపించు ♦ ననెడి భీతి 92

క. గోవిందమ భోజనమిడి
ప్రోవమికి గురుప్రసాద ♦ మున సంతృప్తిన్
సేవింపుచు నెప్పటివలె
జీవనమును జేయుచుండె ♦ సిద్దం డెలిమిన్ 93

ఆ. తిట్టు వారుం దిండిం ♦ బెట్టని వారును
గొట్టువారుం గలిగి ♦ గురునిసాద
సేవ వీడండాయె ♦ సిద్దని కరయంగా
నెంత యోర్పు గలదొ ♦ యెవరి కెఱుక 94

మ. విమలాత్ముండని యెంచ కెవ్వ రెటులన్ ♦ వేధింపుచున్నన్ గురూ
త్తమూతోం జెప్పడు పారిపోవండు మన ♦ స్తాపంబుం దా నొందండా

వ్యమునందుఁ శుభతేజముల్ విడఁడు బ్రి ♦ హ్మానంద
మున్ బాయఁడెం
త మహనీయుఁడో సిద్ధయాఖ్యుని మహ ♦ త్వం బెన్నగా
శక్యమే 95

వ. ఇట్లెన్ని విధంబుల వేధింపుచున్నను గించ నొందక సిద్ధం
డెంతయో సంతసంబున నెలలు గాలంబులుగడుపుచున్నఁ
గని గోవిందాచార్య పోతులూరాచార్యులు సహింపఁ
జాలక 96

— గురునందనులు సిద్ధని దండించుట. —

క. మొండి తినంబున నితఁడిట
నుండెను మన మెన్ని యిడుమ ♦ లొందించిన సి
ద్ధం డిటులఁ జనఁ డటంచును
దండించియు వెళ్లఁగొట్టఁ ♦ దలఁచిరి కడిమిన్ 97

ఆ. ఒక్కనాఁడు సిద్ధఁ ♦ డుదయంబున నె మఠం
బున కొకింత దూర ♦ మునఁ గలట్టి
బావిఁ గ్రుంకులాడి ♦ వచ్చుచో మఠ బహి
ర్ద్వారమునను వేచి ♦ వాని బిలిపి 98

గీ. సిద్ధఁడా యిఁక నీవు మా ♦ ద్ద నుండ
వలదు నీ యింటికేగి జీ ♦ వనము జేయు
చుండు మటువలె నీవు పో ♦ కుండ వేని
మదమడఁగ నిన్నుఁ జెండిపం ♦ పెదము సుమ్ము 99

గీ. మాకురంగట నీవున్న ♦ మాకు నీవు

బాబువలనను గడపన ♦ బాబువలన
మాట వచ్చును గాన మా ♦ మాటలొప్పి
పోయి నీయింట నుంట సొం ♦ పోయి సిద్ధ 100

క. కడపకు లోపల నిను మే
మడుగన్ బెట్టంగ నిత్తు ♦ మా భూవరుఁడా
కడపకుఁ బిలిపించియు మ
మ్మడుగన్ మావానిఁ జెరుప ♦ నగునా యనుచున్ 101

క. అన విని సిద్ధుఁడు గురు సం
దనులను గేల్మోడ్చి యివ్వి ♦ డంబుననని నో
యనఘాత్ములార మీ యా
జ్ఞను మెలఁగని నన్నుఁ బొమ్మ ♦ నన్ న్యాయంబే 102

క. మా తండ్రియుఁ గడపధరి
త్రీతల నాథుఁడు నమ్మ ♦ తించుట వలనన్
మీతావున కేన్ మరలన్
జేతో మోదంబుతోడఁ ♦ జేరితిఁ గాదే 103

క. వారివలన భయమిఁక మన
కేటికి లేదన్నలార ♦ యేనిదె గురునిన్
జేరెదఁ బోనిండనుచున్
ద్వారంబును దాటఁబోవు ♦ తరి సాగ్రహులై 104

క. ఎది మదల వచింపుము మే
మదిరా పింజారివాని ♦ కన్నలమా మా
సుదతుల నీకిఁక మీదట

వదినెలనుచు సరసమాడ ♦ వా నీచాత్మ 105

గీ. ఎచటి కేగెదు తిరుగు నీ ♦ కచట నెవరొ

తాత చుట్టంబులున్న చం ♦ దమున జనెద

వనుచు గురుసుతులెంతొ దు ♦ రాగ్రహమున

భీకరాకృతి సిద్ధని ♦ పైకి దూకి 106

క. మెడఁబట్టిరి సిద్ధని ధరఁ

బడనెట్టిరి క్రిందఁ బడినఁ ♦ బైఁ జేరి చెవుల్

వడఁ బెట్టిరి గుదెలఁ జెడా

బడఁ గొట్టిరి గాయమూలను ♦ బడసి తపింపన్ 107

ఆ. వ్రేటు వ్రేటునకును ♦ వీరేశ్వరాయను

దెబ్బదెబ్బ కబ్బా ♦ దేశికయను

గ్రుద్దు గ్రుద్దునకును ♦ గురువరాయను సిద్ధఁ

డేమిసేయుఁ గర్మ ♦ మెటులఁదక్కు 108

క. తన చేతులారఁ గామును

గని కాసక చేసినట్టి ♦ కర్మ మొకింతైన్

సను సప్ప దనుభవింపక

యసలాత్మునకైన వాని ♦ యబ్బకు నైనన్ 109

వ. అంత సిద్ధఁ డెంతయు దెబ్బలకు నిబ్బరింపన్ జాలక 110

మ. అపరాధం బెపు డీ భవంబునను జే ♦ యన్ నేరకున్నట్టి
నన్

విపరీతంబుగఁ గొట్టుచుండిరి దురా ♦ వేశంబునన్ నీసు
తుల్

కృపతో నేలఁగ నీకుఁ దక్క మఱి లే ♦ రెవ్వార లీపట్ల నా
విపదంభోనిధిఁ దేల్చి పోల్చుటకు రా ♦ వే తండ్రి వీరేశ్వరా 111

శా. ఈవే దేవుఁడ వీవె నాగురుఁడ వీ ♦ వే తండ్రి వౌనంచు నే
భావంబందున నమ్మి తావక పదా ♦ బ్జ ద్వంద్వముం గొల్చు న
న్నీ వేళలన్ జనుమంచు నీ తనయు లెం ♦ తే కొట్టుచున్నారిదే
రావే చూడఁగ బ్రోవవే సదయ వీ ♦ రభద్రా విశ్వేశ్వరా 112

వీరేశ్వరుండు సిద్ధని రక్షించుట.

వ. అని సిద్దండెలుఁగెత్తి కేకఁబెట్టఁగా మఠంబున జపంబుఁ జేసుకొనుచుండు వీరభద్రేంద్రుఁడని చెవిఁ బడి దిగ్గునఁ లేచి కోపోద్దీపిత మానసుండై చక్షుద్వయంబున నగ్ని కణంబు లుప్పతిలఁ బండ్లు పటపటం గొఱుకుచు మేఘ గంభీర ధ్వానంబుతో నోరి కఠినాత్ములారా నిర్దోషియగు సిద్దనిఁ గొట్టు చుంటిరా నే నిదే వచ్చుచున్నాఁడ నిలు నిలుండని యఱుగెత్తి వచ్చుచు 113

క. కొట్టుదునా యిలు వెళ్లఁగ
నెట్టుదునా తిరుగులేని ♦ నెఱి శాపంబుం
బెట్టుదునా చేకోలఁదిగఁ

గొట్టుమనా యేమిసేతుఁ ♦ గూర్రుల విమ్రాక్షా 114

వ. అని ప్రళయకాల రుద్రునివలెఁ బుత్రులన్ డాయవచ్చు నెడ గోవిందమాంబ యెఱింగి పరుగెత్తి కలియవచ్చి భిక్షుని గౌఁగిలించుకొని యుదరంబున శిరంబుఁ మోపి పుత్రభిక్ష పుత్రభిక్ష యటంచు మొఱఁబెట్టుకొనుచుండఁ గుమారులు భయభ్రాంత చిత్తులై రక్షింపుడు రక్షింపుడటంచు దండిశ్రి పదంబులఁ వ్రాలి ప్రార్థించుచుండ క్షమింపుడు క్షమింపు డటంచు సిద్ధుఁడు గురుని కరంబులన్ బట్టి వేడుకొనుచుండఁ దక్కుంగల శిష్య జనంబులు మన్నింపుడు మన్నింపుడని గురుని చుబుకంబునఁ గరంబులుఁజేర్చి స్తోత్రముఁ జేయుచుండఁగా మూలంబున భుజంగంబులును శాఖలన్ బ్లవంగంబులును పత్రంబుల విహంగంబులును బుష్పంబులన్ భృంగంబులును సమాశ్రయించుకొనియున్న కల్పకంబు చందంబున వీరేశ్వరుఁడు ప్రకాశింపుచుఁ గొంత శాంతబున్వహించి కుమారులతో నిట్లనియె 115

ఉ. పట్టుగ నస్మదీయ పద ♦ భక్తి నెసంగుచు మీ యనుజ్ఞలే
పట్టున మీఱకెన్నఁదగు ♦ ప్రాజ్ఞత శిష్యులలోన మేటియై
నట్టి సుధీ విధేయు నమ ♦ లాత్ముని సిద్ధని మీరుఁ గొట్టఁగా
నెట్టులఁ జేతులాడె నవ ♦ రేని యొనర్తురె యిట్టి కృత్యముస్ 116

సీ. అనఘుంబు మత్పదా ♦ ర్చన నెుునర్చుటకాని

యన్న్యులఁ బూజింప ♦ నట్టివాని
నతిభక్తి మనయాజ్ఞ ♦ లనుసరించుచుఁ బాని
యొకింత జవదాట ♦ కుండువానిఁ
దల్లిదండ్రులకన్న ♦ దండి చుట్టములంచు
మనలనే నెరనమ్మి ♦ కొనినవానిఁ
గాపాడ మనకన్నఁ ♦ బ్రాపెవ్వరిట లేక
యొంటిగా మనచెంత ♦ నున్నవాని
గీ. అఖిల సద్గుణములకుఁ దా ♦ వైన వాని
నెపుడు మనమేలె కోరుచు ♦ నెసఁగువాని
మిసిమి మించిన మెత్తని ♦ మేనివాని
సిద్దనిన్ గొట్ట మీకెట్లు ♦ చేతులాడె 117
వ. అని సిద్దని శరీరంబున్ బుణికి సుఖస్థితిఁ బ్రకాశింపుదువు
గాక యని యాశీర్వదించిన యంతనే యతండు యథా
విధి రాణించుటయు నంతఁ దనూభవుల కిట్లనియె
గీ. కూర్రులగు మీరలుండు నీ ♦ కొంపయందు
నిలువఁ జాలను మీరలే ♦ నిఖల సుఖము
లొందు చుండుఁడు సత్కీర్తిఁ ♦ జెందుచుండుఁ
డేను సిద్దఁడుఁగానల ♦ కేగఁగలము 119
వ. విడువుఁడని వెడలఁబోవు నెడ గోవిందాదేవి నన్నానను
జూడరాయని బిగ్గరఁగా నఘముఁ గరుచుకొని బోరుబోరున
నేడ్వసాగఁగా నించుక యోగ దృష్టిన్ బారఁజూచి పిరే
శ్వరుండు భార్యతో నిట్లనియె 120

క. సిద్ధని కన్నముఁ జెట్టక
గద్దింపుచు నిలువనీకఁ ♦ గడుఁదిప్పుచు నా
వద్దని తెగఁజెప్పెదవా
ముద్దియ నిన్నెట్లు శాంత ♦ మున మన్నింతున్ 121

క. అన విని తగు ప్రత్యుత్తర
మును జెప్పఁగలేక బాష్ప ♦ ములు గార్చుచు బో
రున నేడ్చెడు గురుదేవిన్
గని సిద్ధఁడు గురుని కిట్లు ♦ గా వచియించెన్ 122

సీ. యోగసాధనకు మ ♦ హోప యుక్తమటంచు
నుపవాసములను న ♦ న్నుంచు చుండు
నను సాకిపట్టి ప్రే ♦ మను వీడఁజాలక
తేపకుఁగన నన్నుఁ ♦ దిప్పుచుండుఁ
దమ సేవలకు తోటు ♦ సమకూడునని నన్నుఁ
గడువడిఁబొమ్మని ♦ గదుముచుండుఁ
జనువు నిచ్చి సనింట ♦ జాగుసేయు నటంచుఁ
గరుణ మాలిన్యతిఁ ♦ గసరుచుండుఁ

గీ. గాని నాయందు నిర్దయఁ ♦ బూనికాదు
ఇందు మాయమ్మ యైన గో ♦ విందమాంబ
యందుఁ దప్పొక యిసుమంత ♦ యైన లేదు
కాన నామెను క్షమియింపఁ ♦ గదె మహాత్మ 133

వ. అని సమయోచితోక్తులం వచియించు సిద్ధని శాంతంబున
కచ్చెరు వందుచు గోవిందమాంబయును దత్కుమారు

లును నైక కంఠ్యంబుగా వీరేశ్వరుగన కిట్లనిరి 124

గీ. తెలిసి తెలియక మేమిట్లు ♦ సలిపినార
మిపుడు మా నేరములు క్షమి ♦ యింపుమార్య
సిద్ధనికి నెగ్గుమేమికఁ ♦ జేయమెపుడు
తప్ప మీమాట నీదు పా ♦ దముల సాక్షి 125

వ. అని గొల్లున నేడ్చుచుఁ బదంబులనంటి పట్టినపట్టు వదల
కున్నఁ గని సతీసుతులకు లేవఁదీసి ప్రథమాపరాధంబ
గుటఁ క్షమియించితి నిఁక నెన్నటికిట్లు సేయకుఁడని యా
జ్ఞాపించిన పిమ్మట భయభక్తులతో నొప్పారుచుండిరంత
నొక దివసంబున వీరేశ్వరుఁ గని సిద్ధం డిట్లనియె 126

క. కనుఁగొన గణనాతీతము
గను జోద్యంబుగనుదోచుఁ ♦ గావుసఁ బేర్మిఁ
వినవలతుఁ బ్రపంచోత్ప
త్తిని దెల్పవె గురువరేణ్య ♦ దీనశరణ్యా 127

వీరేశ్వరుండు సిద్ధనికిఁ బ్రపంచోత్పత్తిని దెలుపుట.

క. అని వేడుకొనెడు సిద్ధని
వినయోక్తుల కాత్మమెచ్చి ♦ వీరేశ్వరుఁడి
ట్లని తెల్పఁ దొడంగెను నిజ
తనయులు శిష్యులును విని ము ♦ దంబును జెందన్ 128

సీ. ఏమియు లేనినాఁ ♦ డీశ్వరుండు వినోద
ముగను విశ్వమును జే ♦ యఁగఁ దలంచి
స్థిరచరంబులసంగఁ ♦ జెన్నొందఁ బంచభూ

తములనవగ్రహ ♦ ప్రముఖములను
దగ నచేతనముల ♦ నంగ శిలాదులను జ
డాత్మకములనగ ద్రు ♦ మాదికములఁ
ద్విగుణాత్మకములనన్ ♦ మృగపక్షి పశునర
మీనాది బహుజంతు ♦ మిథునములను
గీ. రమణఁ ద్రిగుణ వివేకాత్మ ♦ కమనమర్త్య
మిథునము సృజించి జీవిత ♦ మితి విధించి
అన్నిటిని నేటి స్థలముల ♦ యందె యునిచె
నేమనందును బరమేశు ♦ సృష్టి నహహ 129
సీ. ప్రాణులలో నర ♦ పశ్వాదులకు జరా
యుజములనన్ మీన ♦ భుజగ విహగ
సరటాదులకు నండ ♦ జములనన్ శుద్ధ శో
ణిత శుక్ల కలన సం ♦ తతులు గలుగఁ
బ్రాణి సంజనిత ఘ ♦ ర్మ రసాదులకు స్వేద
జములనన్ యూకాది ♦ కములు గలుగ
నవని కుద్భిజ్జము ♦ లనఁగ బీజాదుల
వలన సస్యద్రుమా ♦ దులు జనింప
గీ. వేడి వలనను నీటయా ♦ విరియు దాని
వలన మేఘంబు మేఘంబు ♦ వలన వృష్టి
వృష్టివలనను సస్యాభి ♦ వృద్ధియందు
వలనఁ బంటలు గలుగ నీ ♦ శ్వరుఁడు జేసె 130
సీ. రహినంతకాక జ ♦ రాయు జాండజములు

స్వకృత పుణ్యాపుణ్య ♦ ఫలము లనుభ
వింపఁగాఁ దిరిగి జ ♦ నింపఁగాఁ దినుట క
ర్మములైన నానోద్భ ♦ దములను మఱి
యొండొంటిని భుజింపు ♦ చుండి పెంపొందఁగాఁ
దమ బలహీనతన్ ♦ సమయు నటుల
నేర్పు దీపింపగా ♦ నియమించి యీశుండు
సృష్టిస్థితిక్షయ ♦ కృత్యములను
గీ. బూనఁగ వస్తు బలా బలం ♦ బుల వశంబు
సలిపి విరమించుకొని సర్వ ♦ సాక్షి యగుచు
నిరతరానందమునఁ బ్రకా ♦ శింపుచుండె
నీశ్వరుని లీల లెన్నఁగా ♦ నేరి తరము 131
క. తిలకింపఁగ సృష్టిస్థితి
విలయము లెప్పటికి జరుపు ♦ విధివస్తు బలా
బలముల వశమొనరిచి ని
శ్చలుఁడై పరమేశ్వరుండె ♦ సంగె నయారే 132
సీ. అలరఁ జరాచరం ♦ బులు వస్తు ప్రాబల్య
మున జనించుట సౌఖ్య ♦ మూగ మెలఁగు
చుండుట వర్ధిల్లు ♦ చుంట ఘటిల్లును
వస్తు దౌర్బల్యంబు ♦ వలన జనన
మంద కుండుట వ్యథ ♦ లొందుట నాశంబుఁ
జెందుట ఘటియిల్లు ♦ సిద్ధముగను
రజన జరాయు జాం ♦ డజము లాత్మీయ సు

కృత దుష్కృత ఫలంబు ♦ లెనయుటకును

గీ. దత్తుడు చితస్థలముల ను ♦ తృప్తి యగును
సృష్టి వృద్ధిక్షయములకు ♦ హేతువులయి
పొలుచు వస్తు బలాబలం ♦ బుల గణింప
జగతిపై నేర్పిరిశైనను ♦ సాధ్యమగునె 133

సీ. కొంతమందికి బహు ♦ సంతాన మొదవుట
వస్తు ప్రాబల్యంబు ♦ వలనఁ గాదె
దృతి వంధ్య నెవఁడుఁ బొం ♦ దిన సంతుగల్గమి
వస్తు దౌర్బల్యంబు ♦ వలనఁగాదె
ఆరోగ్యమొాత న ♦ మగులు గల్గుట
వస్తు ప్రాబల్యంబు ♦ వలనఁగాదె
అంగ విహీన రో ♦ గాన్వితుల్ గల్గుట
వస్తు దౌర్బల్యంబు ♦ వలనఁగాదె

గీ. జగతిఁ బూర్ణాయు రంచితుల్ ♦ జనన మగుట
తనరఁగా వస్తు ప్రాబల్య ♦ మునసకాదె
కాంచఁగా నల్ప జీవితుల్ ♦ గల్గుటనిప
వస్తు దౌర్బల్యమునఁగాదె ♦ నిస్తులాత్మ 134

వ. అనిన సిద్ధుండిట్లనియె 135

క. వలనొప్పఁగ వస్తుబలా
బలములు లోకమునకెట్లు ♦ ప్రాప్తించునో యా
చెలువును సవిస్తరముగాఁ
దెలుపఁగదే గురువరేణ్య ♦ దీనశరణ్యా 136

క. అన విని వీరేశ్వరుఁ డి
ట్లనెఁ బిండోత్పత్తి సమయ మందునఁ దలఁపన్
జనులకు బలాబలము లో
య్యనఁగల్గుఁ విను మొకింత యమలస్వాంతా 137

వ. అది యెట్లంటివేని ముఖ్యంబుగా నర పిండోత్పత్తి క్రమం బెఱింగించెద నాకర్ణింపుమని సిద్ధనికి వీరేశ్వరుండిట్లనియె

పిండోత్పత్తి విధానము.

క. పతి సతులు రతులఁ దేలఁగఁ
బతి శుక్లం బింపుమీఱ భామాగర్భ
స్థితి శోణిత యుతమై సు
స్థితిఁ బిండోత్పత్తి యగును శిష్యవరేణ్యా 139

సీ. పతి గర్భకవిత శో ణిత శుక్లములు పంచ
దివసంబులకు బుద్బు దవిధిఁదోచు
దశ దినంబులకు ర క్తమగుఁ బంచ దశాహ
ములకు మాంసస్థితిఁ బొలుచు మఱియు
నిరువది దినముల కరయఁ బిండం బగు
నిరువదైదవనాటి కెనఁగుమూర్తి
తొలినెల చివరకుఁ దలయు రెండవనెల
కంఘ్రులు మేధోస్థి హస్తములును

గీ. సరవి మూడవ నెలకు మ జ్జా శిరోజ
నఖములుఁ జతురమాసము నను వరంబు
లిఁకను బంచమ మాసంబు నను గళాక్షి

నాసికోదరవక్త్రక • ర్ణములు గలుగు 140

సీ. అరవ నెలన స • ప్తారవింద పాణి
ములు క్షుత్పిపాసలు • గలిగి మాతృ
జఠర సంస్థిత రసా • స్వాదనంబు జేయుచు
నేడవ నెలన నా • కించిత మెఱుకఁ
గనసి యష్టమ మాస • మున గుణత్రయమూని
నవమ మాసమున బం • ధములువీడి
పదియవనెల ధరో • పరిఁ బతనంబయి
ప్రసవ పతీస్తన్య • పానమునను

గీ. నెగడు శిశువుసుమీ మాఱు • నిలుచు వేళ
శోణితము మించ నలుపుగఁ • శుక్లమెచ్చుఁ
ఙైన నెఱుపుగ రెండు స • మానమైనఁ
జామనపు చాయమై కూన • జననమొందు 141

సీ. అతివకు ఋతువైన • యైదవ దివసంబు
మునుకొనియును చేసి • దినములందు
సూర్యనాడి దనర్చు • చో గర్భమైనను మేల్
కొమరుండు గలుగును • సమ దినములఁ
జంద్రనాడి యొసంగు • సమయంబునను గర్భ
మగునేని సత్పుత్రి • తగ జనించు
చేసి దినంబులఁ • బిసరుహ రిపునాడి
యలరు వేళను గర్భ • మాయెనేని

గీ. పాలఁతి చేష్టలు గల్గిన • పుత్రుఁడౌదవు

సరి దినంబుల రవివాడి ♦ బరగు నపుడు
గర్భ మగునేని పురుష వై ♦ ఖరి గలట్టి
పుత్త్రిక జనించుఁ గద నిద్ధ ♦ మొగను సిద్ధ 142

సీ. ఉపరతి వేళన గ ♦ ర్భోత్పత్తిజేసి ది
నంబుల నైన న ♦ న్న గళగల్గుఁ
దలఁపఁగా సమ దినం ♦ బులనైన వంధ్య ని
క్కముగ జనించు శు ♦ క్లమ్ము చెదిరి
గర్భంబు నిలిచినఁ ♦ గవలు జనింతు ర
త్యుష్ణ వీర్యమునఁ జూ ♦ లొదవెనేని
గర్భ విస్రావంబు ♦ గల్గుఁ బెన్వాఁగ వీ
ర్యము వలనను గర్భ ♦ మాయెనేని

గీ. బధిర మూకాంధులు జనింతు ♦ రధికమైన
శీత రేతస్సునను జనిం ♦ చిన శిశువులు
జాడ్య యుతులౌదురలయ ని ♦ స్సారవీర్య
జనితు లల్ప జీవితులౌదు ♦ రనఘ ధిషణ 143

ఆ. శుచి కరంబులైన ♦ శుక్ల శోణితముల
చేత జననమైన ♦ శిశువులెల్ల
దివ్య దేహసుబల ♦ దీర్ఘాయురారోగ్య
సహితు లగుచు భువి నె ♦ సంగఁ గలరు 144

క. మగువకు గర్భంబగు నెడఁ
త్రిగుణంబులలోన నేది ♦ దీపించునో య
న్నగఁ దద్గుణ సంయుక్తం

బగు శిశువు జనించు నిర్మ ♦ లాత్మా సిద్ధా 145

గీ. అంతియేకాక తనువుల ♦ కధికమైన
వాత శీతోష్ణములచేత ♦ వ్యాధు లొదవు
స్వబలతఁ దాంటి తెలఁగున ♦ బాగుపడుట
దుర్బలత నాశనంబు నొం ♦ దుట ఘటిల్లు 146

వ. మఱియు నినుము నయస్కాంతం బాకర్షించు తెఱంగునం దొలి జన్మంబున సుకృతంబు లొనర్చినట్టి యాత్మలఁ బావనంబులగు పిండంబు లాకర్షించి జననంబొంది సత్కర్మ ఫలంబులగు సౌఖ్యంబుల ననుభవింపం జేయుచుండును దుష్కృతంబు లొనరించినట్టి యాత్మలఁ జెడు పిండంబు లాకర్షించి యుద్భవంబై దుష్కర్మ ఫలంబులగు కష్టంబుల ననుభవింపం జేయుచుండు నీక సంతియేకాక యొక్క విత్తనంబునకుఁ బెక్కు విత్తనంబు లుద్భవించు చందంబున నూత్న జన్మంబు లెన్నియో వెలువడుచుండును గావున వివేకాత్మికంబులగు నరజన్మంబులు సద్గురు కటాక్షంబునన్ దారక సాంఖ్యా మనస్కంబులఁ గ్రహించి యిహంబు నందష్ట సిద్ధులఁ బడసి యంత్యంబునన్ బరమాత్మలో నైక్యంబై జన్మ రాహిత్యంబు నొందవచ్చుననిన గురువర్యునితో సిద్ధుండిట్లనియె 147

క. వీరేశ్వర గురువర్యా
తారక సాంఖ్యా మనస్క ♦ తత్వంబులు చె
న్నారఁగఁ దెల్పవేయనఁ దమి

దీరఁగ సిద్ధునికి గురుఁడు ♦ తెల్పెఁ దొాషంగ 148

క. వినుము క్రిమంబుగఁ దారక
ముసకును ఖేచరి యనంగ ♦ భూచరియనఁ గ
న్గొన మధ్యమయన షన్ముఖ
యన శాంభవి యనఁగ ముద్ర ♦ లైదు తనర్చున్ 149

ఆ. పంచముద్ర లభ్య ♦ సించిన దశవిధ
నాద భేదములు వి ♦ నంగ నగును
చిత్తశుద్ధి గలుగుఁ ♦ జిత్కళల్ గనఁగను
స్వానుభవము గలుగు ♦ జ్ఞానమందు 150

పంచ ముద్రలు

గీ. ఊర్ధ్వ ముఖుఁడయి కూర్చుండి ♦ యొనర నేత్ర
ములను దెరిచియు నైనను ♦ మూసియైనఁ
జూడ్కి భ్రూమధ్యమున నిల్పి ♦ చూచుచుండు
నదియె ఖేచరియనుముద్ర ♦ యగును శిష్య 151

క. చంచలస్థితి నెసఁగెడు ♦ చక్షువులను
గదలఁగనీక నాసికా ♦ గ్రమునఁ జూడ్కి
నింపుమీఱఁగ నిల్పి వీ ♦ క్షింపుచుండు
నదియె భూచరియనుముద్ర ♦ యగును శిష్య 152

ఆ. నేత్రయుగము సగము ♦ నేర్పుతో మూసినా
సాగ్రమందుఁ జూడ్కి ♦ సమర నిల్పి
పై నెసఁగు ఫాల ♦ భాగముఁ గాంచుట
మధ్యముద్రయగును ♦ మంజులాత్మ 153

ఆ. కర్ణనేత్రనాసి ♦ కములమూసి భ్రూ
మధ్యమునను జూడి ♦ మదిని నిల్పి
చెలువు మీఱను పరి ♦ చిత్కళల్ గనుట ష
ణ్ముఖి యటందురి సజ్జ ♦ నులు కుమార 154

క. వెలుపలను దృష్టినిడి లో
పల లక్ష్యమునిల్పి మిగుల ♦ స్వాంతవికారా
నిలముల బంధించిన యది
విలసిల్లును సుషుమ్న శాంభ ♦ వీ ముద్రయనన్ 155

మూలాధారాది కమల సప్తకము.

వ. మఱియు నీతనువున మూలాధారాది పద్మ సప్తకం బెసంగు దద్విధానం బెఱింగించెద నాకర్ణింపుమని సిద్ధనితో వీరేశ్వరుం డిట్లనియె 156

సీ. ఆధారము గుదంబు ♦ నందు స్వాధిష్టాన
మొలి మేహనమునం ♦ దొప్పుచుండు
మణిపూరకము పొక్కి ♦ లిని దనర్చు ననాహ
తము హృదయమున నెం ♦ తయును గ్రాలు
మొగి విశుద్ధము తాలు ♦ మూలంబున నెసంగు
నాజ్ఞాఖ్య మెసలారు ♦ నలికమందు
సారసించిన సహ ♦ స్రారంబు బ్రహ్మరం
ధ్ర స్థానమందునం ♦ దనరుచుండు

గీ. నరయ నాధారమును తమ్మి నాలుమూర్లఁ
బైసరోజత్రయమున నా ♦ ఱేసి రేలు

ను పరి పద్మత్రియమున నా ♦ కొ...వేము
సార్ల రేయింబవళ్లను ♦ జరుగు సజప 157

సీ. అలపు నాధారాబ్జ ♦ మరణ చతుర్దళో
ర్జిత వశషస వర్ణ ♦ యుతమునగుచుఁ
బాలుచు స్వాధిష్ఠాన ♦ ముదటెద్విళ షడ్ద
ళాంచద్బకారాద్య ♦ లాంత మగుచు
సమరును మణిపూర ♦ కము నీలరుచిదశ
దళముల డాద్య ఫాం ♦ తమ్ము వగుచుఁ
దగున నాహతము ద్వా ♦ దశ పత్రములఁ గన
కాభన్ దసరి కాద్య ♦ ఠాంతమగుచుఁ

గీ. జను విశుద్ధము జ్యోతి కాం ♦ తిని బదాఱు
దళములను షోడశస్వర ♦ కలితమగుచు
బరగు నాజ్ఞాఖ్యము మణి ♦ ప్రభన్ ద్విపర్ణ
ములను హాంక్షసద్వయాత్పర ♦ లలిత మగుచు 158

క. ఆరయ రాజులును సహ
స్రారంబు సహస్రపత్రి ♦ సహితంబై బా
లారుణకోటి ప్రభ నోం
కారాస్పదమగుచు నిర్వి ♦ కారా సిద్ధా 159

వ. అంతియేకాక 160

అష్టదళ పద్మము

గీ. ప్రితి తనువు నందు హృత్పీఠి ♦ భవ్య వికసి
తాష్ట దళపద్మమొక్కటి చె ♦ న్నారుచుండు

నందు హంస చరించు నా ♦ చందమెల్లఁ
దసర వివరింతు వినుము ని ♦ ద్దముగ సిద్ధ 161

సీ. ప్రాగ్దళంబున హంస ♦ వర్తింప సుగుణంబు
నాగ్నేయ దళమున ♦ కరుగ నిద్ర
యామ్య దళంబున ♦ కరుదెంచఁ గ్రోధంబు
రక్కసిదెస తేకు ♦ రేకఁ గుమతి
పశ్చిమ పత్రంబు ♦ పైకివచ్చినఁగ్రీడ
మరుదాశ దళమున ♦ కరుగ నడయు
మొగినుదీచీ దళ ♦ మునకు రారతికాంక్ష
యీశాన్య దళమున ♦ కేగనీవి

గీ. మధ్యమునఁగిన వైరాగ్య ♦ మతిశయిఁ గర్ణి
కస్థమగునెడ స్వప్నముల్ ♦ గలుగుచుండుఁ
గాన నెపు డష్టదళ పద్మ ♦ కలితహంస
సుగతి నెఱిఁగియు నడుపఁగా ♦ నగును సిద్ధ 162

వ. మఱియు యమనియ మాసనాద్యష్టాంగ యోగంబుల
తెఱంగెఱింగించెద నాకర్ణింపుమని వీరేశ్వరుం డిట్లనియె

క. సముచిత యోగాభ్యా
సమునన్ దుర్గుణములఁ డఁగు ♦ సకలేంద్రియ వ
ర్గము నుడుగు శరీరారో
గ్యము బ్రహ్మానందములరు ♦ జ్ఞానము దలరున్ 164

…॥ అష్టాంగ యోగములు ॥…

క. క్షమతోడ నహింసాస్తే

యములన్ సత్యా పరిగ్రహములఁ బరస్త్రీ
విముఖత నెరపుచుఁ బరఁ త
త్త్వము నరయుట యమమటంచుఁ ♦ బ్రాజ్ఞులు వత్సా 165

కం. స్నానము గురుమంత్రాను
ష్ఠానంబును రేపుమాపు ♦ సలుపుచు బ్రహ్మ
జ్ఞానానందమయుండై
జానొందుట నియమ మండ్రు ♦ సద్బుధులనఘా 166

కం. వీరస్వస్తిక పద్మ
యూరాద్యాసనములెన్ని ♦ యో కలవా యా
తీరులఁ గూర్చుండియుఁ జె
న్నార నపోజ్జ్యోతిఁ గనుట ♦ యాసనవిధియా 167

మ. పాలుపా గాలిని వామనాసికమునన్ ♦ బూరింపుచున్ దానిలో
పల సర్థంబును గుంభకంబువలనా ♦ పృన్ జేయుచున్ శేషము
న్వెలయన్ దక్షిణ నాసికంబు వలన ♦ నేచింపుచున్ దీక్షతో
సలుపొందన్ బరమాత్మ నారయుట ప్రా ♦ ణాయామ వా నందనా

గీ. పొదల మదమెక్కు తిండికి ♦ బదులొకింత
సాత్త్వికాహార నియతిచే ♦ స్పర్శనమును
బరగఁ బూరించి సాముకుం ♦ భకమొనర్చు

చుండు నదియె ప్రత్యాహార • యోగమనఘ 169

గీ. ఇంద్రియములఁ జలింపఁగా • నీక యేక
దీక్ష భ్రూమధ్యమందున • దృష్టి నిలిపి
ఒనరఁ బరమాత్మను నుతింపు • చుండునదియె
ధ్యాన యోగం బటందురు • ద్దలు కుమార 170

గీ. హంస నెందెందుఁ దిరుగ నీ • యంగ వలెనొ
ఎందు నెందున నిలువఁగా • నీయరాదొ
ఎఱిఁగి మఱి వాక తానటి • యుంపుచుంట
ధారణంబండ్రు బధులు ని • ద్దముగ సిద్ధ 171

క. లోక భ్రాంతిని వీడియుఁ
బ్రాకటమగు దీక్షతోఁ బ • రబ్రహ్మములో
నేకంబై తానుండుట
యేకాదె సమాధియోగ • మిద్ధ చరిత్రా 172

వ. అని మఱియు ఛాయాపురుష లక్షణంబు నెఱింగించెద నా
వాకర్ణింపుమని వీరేశ్వరుం డిట్లనియె 173

——:) ఛా యా పు రు ష ల క్ష ణ ము. (:——

సీ. నిర్మలస్థలిఁజేరి • నీరజబాంధవు
నేని సుధాకరు • నేని వెనుకఁ
జేసియు నిల్చి భా • సిలఁ దన నీడలో
దీక్షించు గళమున • దృక్కుఁ నిలిపి
తగగురు ప్రోక్తమం • త్రమును నూటా వొని
మిగిసార్లు జపియించి • మింటి పైపు

ఘటికాద్వయముఁజూడఁ ♦ గావలె నిటులాఱు
నెలలు నిత్యముఁజూడ ♦ నిజ శరీర
గీ. మగుపడును వత్సరద్వయ ♦ మటులె యభ్య
సించెనే నాత్మ నెవ్వని ♦ జేర్చుకొనియుఁ
గాంచునో యాతఁ డగుపడు ♦ గగనమందు
శిష్యజనముఖ్య చిరసౌఖ్య ♦ సిద్ధయాఖ్య 174

వ. గగనంబునఁ గాన్పించు ఛాయా పురుషుండు ధవళ వర్ణంబైనచో చూచు నాతం డత్యంత కల్యాణ యుక్తుండును హారిద్ర వర్ణంబైనచో వ్యాధిగ్రస్తుండును రక్త వర్ణంబైనచో భయ విహ్వలుండును మరకత వర్ణుండైనచో ధననాశకుండును నీలవర్ణుండైనచో షణ్మాసమాత్ర జీవితుండును గాఁగలండు మఱియును ఛాయా పురుషునకు దక్షిణ భుజంబు లేకుండినఁ జూచు నాతని ముఖ్య బంధువునకును వామ భుజంబు లేకుండిన నిజకళత్రంబునకును భ్రూయుగంబు లేకుండినఁ దనకే నవదివసంబులకును బాహూరువులలో నెవి లేకుండినను దివసాష్టకంబునకును నాసికంబు లేకుండిన దివసత్రయంబునకును శిరంబు లేకుండిన నొక దివసంబునకును క్షణికంబులో గాన్పింప కుండినఁ దత్క్షణమే తనకు మరణంబు సంభవించునని యెఱుఁగవలయు నిఁకస్వర వివేచనంబు నెఱింగించె నాకర్ణింపుమని శ్రీ వీరేశ్వరుండు సిద్ధని కిట్లనియె

## స్వర వివేచనము.

క. పవన దళకము నాసా
వివరంబులనుండి జీవి ♦ వెడలింపుచు నీ
యవనిఁగలయ నిలుపును వా
స్తవముగఁ బూరింపుచుంట ♦ సహజముకాదే 176

క. కుడివైపున సూర్యస్వర
మెడమవఁ జంద్ర స్వరంబు ♦ హితమల రారన్
నడుమను వహ్నిస్వరమనఁ
బడు ముక్కున వెడలునట్టి ♦ పవనంబునకున్ 177

వ. వహ్నిస్వరమనఁగాఁ గుడి యెడమల వాయువులు మూఁటి
పయిన్ గలిసి యేకముగా నాడుటయని యెఱుంగునది
మఱియు నంతియే కాక సంకరస్వరం బింకొకండు గలదది
యెట్లందువేని స్వరద్వయంబు కలిసియు విడివడుచు నాఁ
డుచుండునని యెఱుంగు మట్లగుటన్ జేసి తత్ఫలంబులన్
దెలిపెద నాకర్ణింపుమని సిద్ధని కిట్లనియె 178

సీ. సూర్య స్వరంబాడు ♦ చోఁ దలంచిన పని
పలువఁగా నెరవేఱు ♦ సత్వరముగ
సోమ స్వరంబాడు ♦ చోఁ దలంచినపని
సలుపఁగా నెరవేరు ♦ జాగుగాను
అగ్ని స్వరంబాడు ♦ నపుడు దలంచిన
పని చేయఁబూనిన ♦ భంగమగును
సంకర స్వరమాడు ♦ సమయంబునఁ దలంచు
పనిసేయ మధ్యలో ♦ పఁను నిలుచు

గీ. నిటు లెస్వస్వరగతులఁ దా ♦ నెఱిఁగి ప్రాశ్ని
కులకునెల్ల శుభాశుభ ♦ ఫలములనొగిఁ
జెప్పఁగావలె సజ్జ్ఞాని ♦ చెలువుమీఱ
శిష్టజనముఖ్య చిరసౌఖ్య ♦ సిద్ధయాఖ్య 179

క. అనవిని సిద్ధఁడు మనమున
ననుపమ మోదమును జెంది ♦ యార్యాయిఁక నా
సనముల తెఱఁగెఱిఁగింపవె
యనఁ దెల్పఁ దొడంగె సిద్ధ ♦ యకు గురుఁ డెసఁగన్ 180



క. ఒకతొడపై నొక పదమిడి
యొకతొడక్రింద నొక పదము ♦ నునిచి మెయిన్ వం
చక నిక్కించియుఁ గడు నో
పిక భ్రూమధ్యమును గనుట ♦ వీరాసనమౌ 181

గీ. పిక్కలకుఁ దొడలకు మధ్యఁ ♦ జక్కఁగాను
బదములన్ జేర్చి మేనువం ♦ పక నిగుడ్చి
నిష్ట భ్రూమధ్యమందున ♦ దృష్టి నిల్పి
అరయుటయె స్వస్తికాసన ♦ మందు్రబుధులు 182

శా. వామోరుస్థలి దక్షిణాంఘ్రి నిడి తే ♦ వన్ దక్షిణోరుస్థలిన్
వామాంఘ్రిన్ గడియించి వీపువయిదాఁ ♦ బాణిద్వయిన్ మెల్కొహే
లామంజుస్థితివేసి కాళ్ల బొటవ్రే ♦ ళ్లన్ బట్టి గడ్డంబు ఱ
స్సీమన్ జేర్చి త్రికూటమున్ గనుట రా ♦ జీవాసనం
బండ్రిలన్ 183

సీ. పాణి యుగంబును ♦ క్షోణిపై నానించి
కరమొప్పఁ బొక్కిలి ♦ కిరుగడలను
మోచేతులను బూని ♦ మోపి పింఛము లీలఁ
బాదద్వయంబును ♦ బైకి లేపి
సొంపలరార నా ♦ డింపుచు వదనార
విందముఁ బైకెత్తి ♦ వీక్షణమును
భ్రూమధ్యమందున ♦ నేమంబుగా నిల్పి
చిద్బిందువును నిరీ ♦ క్షింపుచుంట
ఆ. యోగకోవిదులు మ ♦ యూరాసనంబని
పలుకుచుందు రవని ♦ తలమునందు
నాసనములఁ దొలుత ♦ నభ్యసింపఁగవలె
శిష్య నిచయముఖ్య ♦ సిద్ధయాఖ్య 184
వ. ఇంక నిట్టి యాసనంబు లెన్నియో కలవు గావున వానినెల్ల వర్ణింప నలవిగాదవని సిద్ధం డలరి మహాత్మా యొకించుక భవిష్యత్కాల పరిస్థితు లెఱింగింపుమన వీరేశ్వరుండు దెల్పం దొడంగెను నది యెట్లన్నను 185

## కాలజ్ఞానము

సీ. కుల భేదములు లేక ♦ కలుతు రంతట జనుల్
విధవలు సధవలై ♦ వెలయఁగలరు
పదవులకొఱకున్నీ ♦ ర్గెడరెందరెందరో
బహునాయకత్వమై ♦ ర్పడును జగతి
నయభయంబులు మంద ♦ నరుఁజక్కవేరిలో

దేశదేశములనా ♦ స్తికము బ్రబలు
స్త్రీపురుషులనొక్క ♦ రీతిఁజరింతురు
వరుసఁదప్పిమెలంగు ♦ దురుమదించి

గీ. కరికికిరిమటికిరికిసి ♦ గఁజనించుఁ
తెలుపునలుపును దెలుపును ♦ నలుపుమీఱు
ద్వీపదికిఁజతుష్పది జనించి ♦ తేజరిల్లు
భావికాలపరిస్థితుల్ ♦ బలుకఁదరమె 186

సీ. ముజ్జగంబులవియ్యా ♦ ములుసేతురొండొగల్
కలిమిలేములునొక్క ♦ కరణిఁదోచు
నెక్కడెక్కడివార్త ♦ లొక్కచోవినఁబడు
నీచతలేపాటలు ♦ బాడియాడు
నిర్జీవపక్షులు ♦ నింగిపైవిహరించు
నెద్దులులేనిబం ♦ డ్లిలజరించు
లోపలవెలుపలఁ ♦ జూపునద్దములొప్పుఁ
బంచభూతములమ్మఁ ♦ బడునువిధిఁ

గీ. జంచలన్ బట్టివిశ్చలన్ ♦ సలుపఁగలరు
నేలచాలక గోలలు ♦ చాలజరుగు
నుర్విసవనవరోగంబు ♦ లుద్భవించు
భావికాలాంతరస్థితుల్ ♦ బలుకవశమె 187

క. దురములనిప్పుల వానలు
గురియునుదస్త్రముగాఁగఁ ♦ గుంభినిపైనె
త్తురుచేటులు బొరుగభీ

కరముగ జాతిమతభేద । కలహములాదవున్ 188

క. భువినన్నముదారుకక మా
కవులెందరోయాత్మహత్య । నశియింతురుపా
ర్థివసమలోఁగొందఱుపా
ర్థివసములై యేలుదురు మ । తిభ్రమణమునన్ 188

క. పలుతెఱఁగుల జనులడఁగుచు
నిలగలియుగమైనవేల । యెనుబదివర్షం
బులుదాటిన పిమ్మటభా
సిలువారికి మేలొకంత । చేకురువత్సా 189

వ. అనివీరేశ్వరుండు కాలజ్ఞానాదికంబులు రేయింబవళ్లు సిద్ధనికి బోధింపుచుండుట తెలిసింగి తక్కుంగల శిష్యజనంబు లసహనులై మనకన్న సిద్ధండెందున హెచ్చగువాఁడని యిట్లు బోధించునో గురునకిది పక్షపాతంబగును సుడీయని గుసగుసలాడుచుండుట గురువర్యుండు గ్రహించి 190

సిద్ధని సహింపలేని భక్తులు గర్వభంగమగుట

సీ. ఒకనాఁడువీరశే । ఖరుఁడునశిష్యుఁడై
సంచారమునకేగు । సమయమందు
దారిలోశిష్యులు । దగఁగొని గురునితో
సీరులేదెటుదప్పి । దీరుననినఁ
బథమధ్యమునఁజచ్చి । పడియున్నకుక్కడా
కల్నఁగలకుళ్లినీ । టినిగురుండు
చూపించిత్రాగుఁడం । చనుబలుకవారినీ

వలదని మొగములు ♦ మలుపఁగాంచి

గీ. సిద్ధుఁడానీవుపాసనంబుఁ ♦ జేయుమనినఁ
దక్షిణమెనుక్కడొక్కయం ♦ దలిజలంబు
దోసిటన్గొని కనులక ♦ ద్దుకొనునంత
క్షీరమగుటను గ్రోలెనా ♦ సిద్ధుఁడహహ  191

గీ. అపుడు వీరేశ్వరుండు శి ♦ ష్యాళిఁగాంచి
పాలుజేయనె మీరవి ♦ గ్రోలఁబూన
సిద్ధునికిఁగలభక్తి మీ ♦ కెద్ది చెపుడు
బావిగలదదె చనుఁడని ♦ బయలుదేరె  192

ఆ. అంతశిష్యులెల్ల ♦ రరుగుదెంచుచుగర్వ
భంగమగుటవలన బావికడకుఁ
జేరినీరుఁగ్రోలి ♦ సిద్ధయమనలోన
మేటిభక్తుఁడనుచు ♦ మెచ్చుకొనిరి  193

సీ. గోలకొండనబాబు ♦ పాలికేగిగురుండు
సారిది మాహాత్మ్యముల్ ♦ జూపువేళఁ
బుష్పగిరిద్విజ ♦ న్ములను జేరిగురుండు
శోభిల్లమహిమలుఁ ♦ జూపువేళఁ
గందనూలు నవాబు ♦ కడకునేగి గురుండు
సాంపారమహిమలుఁ ♦ జూపువేళఁ
గడపనేలునవాబు ♦ కడకునేగిగురుండు
దీపింపమహిమలుఁ జూపువేళఁ

గీ. ఖరగబనగానివల్లెన ♦ బాబునుమతి

సిద్ధవటన బాబును ♦ జేరిగురుఁడు
సుప్రసిద్ధప్రభావముల్ ♦ జూపువేళ
సిద్ధఁడును వెంటనుండిద ♦ ర్శింపుచుండె 194

వ. ఇట్లు సిద్ధండు పండ్రెండువత్సరములు విడువక గురుసేవలో నర్పుచు మంత్రమంత్రార్థము ద్రాసిన యోగాదులనభ్యసింపుచుఁ దారకసాంఖ్యామనస్కంబులలోఁ బరిపూర్ణజ్ఞానసంపన్నుండై మహాయోగీంద్రుఁడన విలసిల్లుచుండినవాఁడాయెను 195

## ఆశ్వాసాంతములు

క. నీరేజాంబక రూపా
నీరేజాంబకసమాన ♦ నిర్మలగుణా
నీరేజాంబకభూతీ
నీరేజాంబకసమాన ♦ నిరవధికకృపా 196

క. నిగమాంతోపన్యాసా
జగదాప్తోపమవికాస ♦ స్మరసువిలాసా
నగజేశార్చాభ్యాసా
సుగుణగణనివాసభూరి ♦ సుకరోల్లాసా 197

తోటక. అతిథిప్రకరోపకృ ♦ తావరణా
అతులాగమధర్మప ♦ థాచరణా
అతిసజ్జనవర్గస ♦ మాదరణా
అతనూపమరూపస ♦ దాభరణా 198



గద్య

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాద లబ్ధచతుర్విధ
కవితావిచిత్రవిశ్వకర్మకులపవిత్రభరద్వాజ
గోత్రపోకూరివంశాబ్ధికైరవమిత్రరా
మలక్ష్మయ్యంబాసుబ్బయాచార్యపు
త్రక విసింహాబిరుదపాత్రబుధ
జనానుమతికాశీపతిప్రణీ
తంబైనశ్రీసిద్ధయోగి
చరిత్రమునందుతృ
తీయాశ్వా
సముసం
పూర్ణ
ము



## చతుర్థాశ్వాసము

క. శ్రీబ్రహ్మ తేజ పూర్వక
కుబ్జిమణాభోగభోగ ♦ కోవిదవర్యా
అబ్జాసి గభీరా వి
దబ్జాస్య ప్రాచార్య యతీ ♦ రాజౌదార్యా 1

ఆ. అవధరింపు మౌనిరాజ ♦ హాత్మ్యదవన్ దపో
ధనుఁ డనంగ బుధ్యా ♦ త్ముఁడనంగఁ
బరగుసిద్ధ యోగి ♦ వరుచరిత్రమునందు
నెసఁగునవలిచరిత ♦ మెట్టులనిన 2

వ. శ్రీమద్వీరాట్పోతులూరివీరబ్రహ్మేంద్రుండు వర్షక్రమం
బుగా నందనులకుఁ వివాహంబులఁ గావించి యందగ్ర
తనూభవుండగు గోవిందయాచార్యునకు గురుపట్టాభిషేకం
బొనర్చి యొకనాటిసాయంతనంబున సతీసుత శిష్యపరి
వృత్తుండై నిజసతీమణిఁ గాంచి యిట్లనియె 3

— వీరేశ్వరుండు భార్యతో జీవసమాధినొందెద ననుట —

ఆ. ఇంతివినవె పేర్మి ♦ నెల్లుండి వైశాఖ
శుద్ధదశమియగును ♦ సొంపుమీఱ
నేఁదదహమునందు ♦ నిర్వికల్ప సమాధి
నెపయు వాఁడిలోక ♦ మునుద్యజించి 4

క. శోధించితి జగమెల్లన్
సాధించితి భక్తతతిని ♦ సముచితరీతిన్
బోధించితి జ్ఞానము స

మాధికిఁ జొత్తునిఁక నిరువ ♦ మంజగుదీక్షన్ 5

క. మగువా నేవచ్చినపని
ముగిసెను స్వాంతమున కెంతో ♦ మోదముగల్గెన్
జగమునకును నేనిఁక వే
రగుటకు నాకింతసంది ♦ యము లేదరయన్ 5

క. ముక్తిఁ గొనఁబర సుస్థిర
భక్తిలతను నాటసలరె ♦ వరమతినీకున్
వ్యక్తమెకద వగవకు సుమ
యుక్తస్థితినను సమాధి ♦ నొందింపఁగదే 7

వ. అని సిద్ధని వైపున్ జూచి

గీ. సిద్ధుఁడా నీవు గోవింద ♦ సెప్పినట్టి
పనుల నెల్లను నెరవేర్చి ♦ ననుసమాధిఁ
జేర్చునంతనె ముడుమాలఁ ♦ జేరుసుగుణ
వతిని బెండ్లాడి మంచి సం ♦ తతిని గనుమ 6

క. తదుపరి భవసాగరమును
విదితముగఁ దరింపఁజేయ ♦ వేదాంతము నిం
పొదఁవగ జనులకుఁ దెల్పుచుఁ
దుదజీవ సమాధిఁ బ్రీతి ♦ తోనొందు మొగిన్ 10

వ. అనిమఱియును సతీసుతులన్ జేరి పరిసరగ్రామవాసులగు భక్తజనంబులు దర్శించుకొన దశమివరకవకాశమిచ్చితిన్ గావుననాటి యపరాహ్ణంబునకు నన్నుసమాధిలోఁ స్థాపింపవలయునను మొదలగువిషయంబు లెవరికిఁదెల్పఁదగినవివా

రికిన్ దెలిపినేనిదే యోగదీక్షన్ బూనుచున్నాఁడ మీరలిఁక నన్
బలుకరింపరాదసుమాయని ముమ్మారునొక్కి వక్కాణిం
చి పద్మాసనాసీనుండై నిర్వికల్పసమాధియోగదీక్షఁ బూని
యుండు నెడ గోవిందాచార్యాదిగురునందనులొక్కచో జేరి
జనకుఁడీతఁ దనుబలుకరింపరాదని మనకే యనుజ్ఞనిడెగాని
సిద్ధనికట్లానతీయకుండె నిందులకేదియేని కారణంబుండక
పోదని యూహించి గురువర్యుఁ సమాధిలో స్థాపించువర
కు సిద్ధనినిటనుండనీయరాదిపుడే గురుకార్యనిర్వహణవ్యా
జంబుననెటకేని పంపింపవలయునని తలంచి తల్లిన్ బిలిచి
యిట్లనిరి 11

క. జననీమానాయన యిం
కనుమీరలు బలుకరింపఁ ♦ గారాదని తా
మనకనియెఁగాని సిద్ధని
కనఁడెదియో హేతువుండ ♦ నగునిందులకున్ 12

—గురునందనులు సిద్ధని పూలకనుపుమని తల్లిని నిర్బంధించుట—

గీ. కానమాతండ్రిని సమాధి ♦ లోన జేర్చు
వరకుసిద్ధని నిటనుంచ ♦ వలదు వేల్పు
మల్లెపూవుల బనగాన ♦ పల్లెకేగి
మనమఠంబునఁగలవు తె ♦ మ్మనఁగదమ్మ 13

క. ఆవేల్పు మల్లెపూవుల
చేవిలసిల గురునిపూజఁ ♦ జేయఁగవలయున్
కావున శీఘ్రముగాఁజని

తేవలెనని వానికాన ♦ తీయంగదవే 14

గీ. ఇటకు జనగానపల్లియ ♦ యెంచిచూడ
సప్తయోజన దూరస్థ ♦ జనపదంబు
గానసట కేగి విరులతా ♦ గైకొనియును
దశమినపరాహ్ణమునకురా ♦ వశముగాదు 15

గీ. మేముచనుమన నతఁడొప్పఁ ♦ డేమొకాని
అమ్మరో గురుశాసన ♦ మగుటవలన
నీయనుజ్ఞను మీఱవా ♦ నికినిగాదు
కానఁగుసుమంబులను నంపఁ ♦ గదవె వాని 16

క. ఇదియొయతని నెడఁజేసెడు
సదుపాయముగాన నీవు ♦ సంశయమును నీ
మదిలోనొకింత బూనక
పదపడిసుమములకువానిఁ ♦ బంపింపఁగదే 17

క. అనిపల్కెడు పుత్త్రికలన్
గనుఁగొని గోవిందమాంబ ♦ కడువగచుచు ని
ట్లనియెఁగొమరులారా సి
ద్ధని మోసముఁజేసి పనుపఁ ♦ దగునామనకున్ 18

ఉ. శ్రీకరుఁడైనమాగురుఁడు ♦ జీవసమాధి వహించువేళన
స్తోకసుధీసమేతుఁడయి ♦ శోభిలుసిద్ధని జెంతనుండఁగా
నీకసుమాళిఁదెచ్చుటకు ♦ నేగుమటంచు ననుజ్ఞసేయఁగా
నాకెటునోరువచ్చునిది ♦ న్యాయమెశిష్యునిమోసగింపఁగన్

క. పదిరెండువత్సరంబులు

కుదురుగమన పంచఁగాచు । కొనియుండి సుఖ
ప్రదసేవలు మనకొసరుచుఁ
గదయుట్టికు మోసగింపఁ । గానటులొప్పన్ 20

వ. అదియునుంగాక మాతండ్రి నాకాజ్ఞాపించినదేమన 21

క. ముక్తిన్ గొనఁబరమసిర
భక్తిలతను నాటనలరె । వరమతినీకున్
వ్యక్తమొకద నగవకుసుమ
యుక్తస్థితిననుసమాధి । నొందింపఁగదె 22

వ. అనఁగానిందరమేమన, ముక్తిన్ గొనన్=మోక్షమునొందుటకు, వరమతినీకున్=శ్రేష్ఠమైనవాదియమునందున నీకు, పరమ=ఉత్కృష్టమైన, స్థిరభక్తిలతను నాటన్—నిశ్చలమగు భక్తియనుతీగెను నాటఁగా, అలరెన్—ప్రకాశించెను, వ్యక్తమొకద—తెలియును గదా, నగవకుసుమ=చింతింపకుమునుమా, యుక్తస్థితిన్=తగురీతిగా, ననుసమాధినొందింపఁగదే వన్ను సమాధినిబొందునట్లుగాఁజేయఁగదే, యనిపల్కనందు లకబద్ధంబుగాడి శిష్యునిమోసగించి ముక్తికిబదులు నరకం బేలనొందవలయును నన్నిట్టియకృత్యంబునకుఁబ్రేరేపఁజే యకుఁడని వగపుతో గోవిందమాంబ యొకచోఁగూర్చున్న యెడ

క. కనియగ్రిసూనుఁడిట్లను
జననిరో దబ్బరలుబల్కఁ । జనదనికదనీ
వనుట గుకఁడనిననుడుఁగం

దునసస్మద్భావమరయఁ ♦ దోఁచెడువినుమా 23

వ. అదినెట్లంటివేని, వరమతి-ఓశ్రేష్ఠమైన హృదయముఁగలదా నా, ముక్తిన్ గానన్=మోక్షకాలమునఁ బూనుటకై (అనఁ గానేను జగమునువిడుచునపుడుఁబూనుటకైయనుట) బ-బనగానిపల్లెలో, ర-రహించునట్టి, మ=మఠంబు నందలి స్థిరన్-భూమియందున, భక్తిలతనునాటనలరెన్=భక్తితో తీగెనునాటఁగావికసించెను, నీకున్ వ్యక్తమెకద-నీకు ను గూడా తెలియునుకదా, వగవకు-చింతింపకుము, సుమ యుక్తస్థిన్-ఆపుష్పములతోఁగూడుకొనురీతిగా ననుసమాధినొందింపగదే-నన్నుసమాధిలోఁజేర్పంగదే, అనిగురుండు నీకానతిచ్చినట్లర్థము స్ఫురింపుచున్నయదిగావున నన్నుతదో షంబుగూడ నిన్నాపాదింపనేర దంతియేగాక గీ. సిద్ధఁడా నీవు గోవిందసెప్పినట్టినుడుల నెల్లనునెరవేర్చిఁఅనుటచేగు రుశాసనంబగుటవలనసిద్ధ ందు నీయనుజ్ఞనుమీఱఁజాలదు గావున సంశయింపక సిద్ధనిపంపివేయుమీఁకనంతియేగాక.

గీ. విబుధులాయమసూతిగో ♦ విందుమాటఁ
దోలఁగఁజాలక యమృతంబు ♦ వలుకవలసి
పలికిగురుశిష్యులకు నెడ ♦ బాపెనందు)
గానిపుడంతియేయుండు) ♦ గదమదంబ 24
అనగావిని గోవిందమ నిజ
తనయులతో నిట్టులనియె ధర్మజుఁడొకబాం
ధునకెకడా యమపురమును

గనవలసెను నేనుబొంకక ♦ గానం తెలదా 25

ఆ. కానబొంకఁజాలఁ ♦ గదునింద జగతిలో
నందజాలనరక ♦ మొందఁజాలఁ
గడిమిఁగిల్బిషమును ♦ వడిఁగట్టుకుఁదునాకు
బుత్రులార సుజన ♦ మిత్రులార 26

కం. ఇటులన నందనులల్లియు
డిటవుగనిట్లనిరి సుతులు ♦ దెల్పినగతిఁజే
యుటకొప్పని తల్లికురం
గటమందుట కొమగాలకును ♦ గడుఁదప్పుసుమీ 27

కం. ఇటనీకనులయెదుట మే
మెటులుండఁగవలయువనుల ♦ కేగెదమటుపి
మ్మటనీయిష్టము వచ్చిన
యటుల మెలఁగుచుండుమని ప్ర ♦ యాణం బైనన్ 28

గీ. అపుడుగోవిందమాంబమ ♦ హాత్రిఁదోప
నాత్మజుల కెదురరుదెంచి ♦ యడ్డగించి
ప్రియతనయులార మీరుఁజె ♦ ప్పినవిధంబె
విరుల కంపింతు సిద్ధని ♦ మరలుడిఁకను 29

కం. మిమునెడబాసియు నే నొక
నిమిషమయిన గృహమునందు ♦ నిలువం గలనా
సమయానుకూల్యముగ స
త్యము కల్లయొ పలుకుదున్నఁ ♦ దప్పని నాకున్ 30

ఆ. పతిసమాధిఁజొచ్చు ♦ పనిబూనినందుల

కార్తిఁగొంటిమీర ♦ లలిగివనులఁ
జొత్తుమనినగోరు ♦ చుట్టుపైరొకటి
పోటునాటినట్లె ♦ పోతలంప 31

వ. అనిసుతులన్ బతిమాలి తోడ్కొనివచ్చి యిల్లుజేర్చువరకర్ధ
రాత్రింబగుటయు నంతగురునకు సురటివిసరుచు ధూపంబు
వేయుచున్నసిద్దయనీవలికిన్ బిలిచిగోవిందమాంబయిట్లనియె

ఆ. శిష్యవర్యనీకుఁ ♦ జెప్పెడనొకపని
భారమనకచేసి ♦ తీరవలయు
నీకుదక్కనొరుల ♦ నెరవేర్పఁజాలరీ
పనియటంచుఁదోచు ♦ మనమునందు 33

★ గోవిందమ్మ సిద్దని పూలు దెమ్మనుట ★

క. మాయందుభక్తినీకు న
మేయంబుగనుండెఁగాన ♦ మీఱుపటంచున్
నాయాత్మనెంచి యీపనిఁ
జేయుమనుచుఁబలుకుచుంటి ♦ సిద్దసమాఖ్యా 34

చ. పనియెదియంటివేని గురు ♦ పార్థివుఁడా బనగానపల్లెయం
దనుఘుగనున్నవేళ స్వస ♦ దావరణంబున వేల్పుమల్లె తీ
గనొకటి నాటినాడట యి ♦ గిన్ బాదరమై యిపుడెన్నొ
పూలుపూ
యునటగురుండుదత్సుమము ♦ లూనఁగలేదట యెన్నఁడేనియున్

గీ. అలవిరులుదాల్పఁగాఁగోర్కె ♦ గలదటంచు
నప్పుడప్పుడునాతోడ ♦ ననుచునుండు

గురునికోర్కె సమాధికే • గొనపుడైన
దివ్యభక్తుఁడ వీవుండి • తీర్పవలదె 36

క. తీవరముగ నీవీయెడఁ
బోవలె బనగానపల్లెకిఁ • బాలుపుగ నిటకున్
బూవులను దశమినాటికిఁ
దేవలయును గురునికోర్కెఁ • దీర్పఁగవలయున్ 37

క. ముక్తిన్ గొనఁబరమస్థిర
భక్తి లతను నాటినలరె • బరమతినీకున్
వ్యక్తమెకద వగవకు సుమ
యుక్తస్థితి ననుసమాధి • నొందింపఁగదే 38

వ. అనిజగద్గురుండు నాకాజ్ఞాపించుట నీవును వినియేయుంటివి గదా యందలియర్థంబేమన, వరమతి=ఓశ్రేష్ఠమైనహృదయముకలదానా, ముక్తిన్ గొనన్=మోక్షకాలమునఁబూనుటకు (అనగా జగమువిడుచునపుడు బూనుటకనుట) బబనగానిపల్లెలో ర=రహించునట్టి మ=మఠమునందలి స్థిరశ్భూమియందున, భక్తిన్=భక్తితోడ, లతనునాటనలరె=తీగెనునాటఁగావికసించెను, నీకు=వ్యక్తమెకద—నీకును గూడ తెలియునుగదా, వగవకు=చింతింపకుము, సుమయుక్త స్థితిన్-అపుష్పములతోఁగూడుకొనురీతిని, ననుసమాధి నొందింపఁగదే-నన్నుసమాధిలోఁజేర్పఁగదవేయని యాజ్ఞాపించెన్ గావున నాకాకుసుమంబులు దెచ్చుటకుసాధ్యము కానందున నీవైననుగురునికోర్కెఁదీర్పక తప్పదని యాన

తిచ్చినంమున సిద్ధఁడొకింత తనలోఁ

ఆ. నిఖిలముఁ ద్యజించి ♦ నిర్వికల్పసమాధి
నెనయుగురుఁడు సుమము ♦ లేలగోరుఁ
గోరనేని పిలిచి ♦ గురుఁడు నాతోఁ బూలు
దెమ్మటంచు నేల ♦ దెలుపకుండు 39

క. అనిసంశయించి యెట్లై
ననుమద్గురుదేవిశాస ♦ నముఁ దప్పఁగ రా
దని నిశ్చయించుకొని క్రి
న్నన సిద్ధండామెతోఁ వి ♦ నమ్రితఁ బలికెన్ 40

క. అమ్మాయహర్నిశలునుర
యమ్మున బనగానపల్లె ♦ కరుదెంచి ప్రసూ
నమ్ములను దశిమినవరా
హ్ణామ్మునకును దెత్తునని ప్రి ♦ యాణంబైవన్ 41

చ. గురుసతిసిద్ధయన్ విరులు ♦ గొబ్బునఁ దెమ్మనిసాగనంపభా
సురముగఁ దెల్లవారెగురు♦ సూనులు సంతసమందిపూజకై
పరిమళవస్తుజాలమును ♦ వాద్యములన్ హితక్షత్రబాంధవో
త్కరమునుగూర్చుచుండు నెడఁ ♦ దామరసాప్తుఁడుగ్రుంకె
నాదటన్ 42

ఉ. సిద్ధఁడు రాకమున్నె త్వరఁ ♦ జేసిగురుప్రభునిన్ సమాధిలోఁ
దద్దయుఁ జేర్పఁగాఁ దలఁచి ♦ తద్గురుపుత్రులు గేయిఁ బూనికతో
నిద్దరమానియత్నములు ♦ నేర్పునఁ జేయఁగఁ దెల్లవారినా
ప్రొద్దున నేమహాత్మునకుఁ ♦ బూజలుఁ జేయఁదొడంగి రెంతయున్

— శ్రీ వీరబ్రహ్మేంద్రుని సమాధిన్ జేర్చుట —

సీ. పరిభువనముఁబన్నీట ♦ నభిషేకమొనరించి
కావివస్త్రంబులు ♦ గట్టఁబెట్టి
భూతిగంధాక్షతో ♦ పేతాలికుని జేసి
పుష్పహారములురం ♦ బునసమర్చి
ధూపదీపాదులు ♦ దీపింపనర్పించి
లలితపూజాద్రవ్య ♦ ములుగదించి
పాదుకాజపమాలి ♦ కాదండములనూన్చి
పదపూజలెల్లరిం ♦ పొదవఁజేసి
సుమరథంబుననుగూ ♦ ర్చుండఁగా నొనరించి
యాత్మజుల్ వాహకు ♦ లైచనంగ
భక్తజనంబుల ♦ భజనలు సెలరేగ
వివిధమంగళతూర్య ♦ రవములెసఁగ
నెలఁతుకలందంద ♦ నీరాజనములిడఁ
గుసుమాక్షతలు శిష్య ♦ కోటిసల్ల
జయజయస్వనముల ♦ సందడిమిను ముట్ట
స్వస్తివాచకపుర ♦ స్వరముగాఁగ

గీ. మెరవణింపుచు మఠమునన్ ♦ బరగునట్టి
విమలతరమౌ సమాధిలో ♦ వీరగురుని
దశమినాఁడపరాహ్ణంబు ♦ దగులుసరికిఁ
జేర్చిమూతబిగించిరి ♦ చెలువుమీఱ 44

క. తననెంతగఁగదలించిన

ధ్వను లెంతగఁ జేయుచున్నఁ ♦ దానించుకయు
ననుజలియుంపఁడు చూడఁడు
మొనసిగురుండెట్టియోగ ♦ మున్ దాల్చెనొకో 45

వ. ఇట్లిచ్చట వీరేశ్వరుండు నిర్వికల్పసమాధి యోగదీక్షన్ బరమాత్మానుసంధానుండై సమాధిలో స్థాపింపబడియుండఁగానిక నచ్చట

—సిద్ధయ్య పూలకై బనగానపల్లెకు నేగుట —

గీ. అలరులను దెచ్చుటకు సిద్ధఁ ♦ డచటనుండి
పయనమైనది మొదలుగాఁ ♦ బరుగులిడుచు
గష్టసాధ్యంబుగా బన ♦ గానపల్లె
కరిగెనానాడు రవిగ్రుంకు ♦ సరికయారె 47

ఆ. అరిగిమఠముఁ జేరి ♦ యందలివారల
వడిగిగురువధూటి ♦ నుడివినట్టి
మాటలెల్లఁ గల్ల ♦ లౌటచే మోసముఁ
జేసిపంపెననుచుఁ ♦ జింతతోడ 48

ఆ. ఆచటిపూలతోట ♦ నలరినమల్లికా
కుసుమములను గోసు ♦ కొనియుఁ దిరిగి
దారిఁబట్టుసరికి ♦ దైవికంబుగనాక
తట్టొకింతమబ్బు ♦ బట్టెమింట 49

వ. అంతన్ గొంతదూరం బేగునప్పటికి 50

సీ. భీకరంబుగఁ జిక్కు ♦ చీకట్లు వ్యాపింపఁ
గటిమొగుల్ నలుతట్లఁ ♦ గ్రమ్ముకొనియెఁ

బిడుగులుఁబడునను ♦ భీతిజనింపఁగా
మెఱుపుతోనుఱుములు ♦ నుఱుమసాగె
సగములుఁదలక్రిందు ♦ లగునట్లు పెనుగాడ్పు
లేవంకఁజూచిన ♦ వీవఁదొడఁగె
నింగిచిల్లులుపడి ♦ నీరుగారెననంగ
దారుణంబుగ వర్ష ♦ ధారలొలసె
గీ. గుంటమిట్టలుగాన్పింప ♦ కుండునటుల
నెల్లెడలఁదోయిములుబ్రివ ♦ హింపనామె
నట్టియెడసిద్ధఁడొకగుంటి ♦ నాపుఁజేసి
కొనియుఁదనమది నిట్లను ♦ కొనుచునిలిచె 51
సీ. నిజగురువర్యుండు ♦ నిర్వికల్పసమాధి
యోగంబుమునుముందె ♦ యూననేల
ఊనెఁబోగురుసతి ♦ సూనంబులకునన్ను
బనగానికల్లియు ♦ కనుపనేల
అనిపెఁబోనేవచ్చి ♦ చనునెడ నడుమదు
స్తరకుంభవర్షంబు గురియనేల
గురుసెఁబోమహిమనా ♦ కున్న నిట్లుండునే
వడసినమహిమనే ♦ విడువనేల
గీ. ఇన్నిటికిఁజూడనాదుర ♦ దృష్టమునకు
వేరుగానెవ్వరేమిఁగా ♦ వింపఁగలరు
ధర్మముగను బురాకృత ♦ కర్మఫలము
ననుభవింపకతప్పునే ♦ యజునకైన 52

గీ. దశమినరాహ్ణమునకెవ్వి ♦ ధపమున నేను
కందిమల్లయపల్లియ ♦ కరుదఁగలను
వీరగురుఁడు సమాధిలోఁ ♦ జేరునపుడు
జూచుకొను భాగ్యమునకు నే ♦ నోచనైతి 53

వ. అనిదుఃఖింపుచు

క. మింటిజలంబులు మఱితన
కంటిజలంబులును గలిసి ♦ కాసారముగా
నుంటన్ సిద్ధయ కుత్తుక
బంటిజలంబులను నిలువఁ ♦ బడె రేయెల్లన్ 55

వ. అంతన్ సూర్యోదయంబై వర్షంబాగుటయు భక్తాదులకు దర్శనంబిచ్చుటకు దశమివరకు నవకాశంబిడిన దయామయుం డగు గురువర్యుండు నేటికైనను స్నానదీక్షన్ వీడి నేనే తెంచు వరకు నవకాశంబిడకుండు నేయని యొక్కింతయాశన్ జెంది

ఆ. బురదయందుఁ గాలు ♦ పొందక నడుచుచు
మేరమీఱి పాఱు ♦ భూరినదుల
నీదుకొనుచు దాటి ♦ యెంతో ప్రయాసతో
వర్షభూమిఁ గడిచి ♦ వచ్చి మఱియు 57

సీ. తాలతక్కోలత ♦ మాలరసాల హిం
తాలమాలూరాది ♦ తరుచయంబు
శార్దూలభల్లూక ♦ సారంగవానర
వృకవరాహశశాది ♦ మృగచయంబు
కీరకపోతమ ♦ యూరశారికతార్క్ష్య

పారావతపికాది ♦ పక్షిచయము
సదమలఘననదీ ♦ నదఝురీకూపకా
సారాదివరజలా ♦ శయచయంబు
గీ. గలిగి వైశాల్యమగుచుదీ ♦ ర్ఘంబునగుచు
నిరుపమంబౌచుభూరి భీ ♦ కరమునగుచు
నలఘునిమ్నోన్నతములచే ♦ వెలయునట్టి
నల్లమలఁజొచ్చి సిద్ధయ ♦ నడుచుచుండె 58
సీ. తిండియునిదురలే ♦ కుండిమార్గాయాస
మునసుడిబడినసె ♦ మ్మోముతోడఁ
బరుగెత్తుటను బలు ♦ మరుజారుపడిదెబ్బ
తెడలేకపొడసూపు ♦ నొడలితోడ
మెండుగాఁబెనుముండ్ల ♦ మండలుదాకిజీ
ర్ణములైనకావివస్త్రములతోడఁ
గత్తులవలెవాడి ♦ గలఁతాలఁదవిలి ర
క్తముగారు పాదయు ♦ గ్మమ్ముతోడ
నంతకంతకు నాయాస ♦ మధికమౌట
విపులముగ వెలువడెడు నూ ♦ రుపులతోడ
సిద్ధఁడేకాదశిదినంబు ♦ ప్రొద్దుబోదుచు
వరకు శ్రీకందిమల్లయ ♦ పురికివచ్చె 59
క. వచ్చిగురుండు సమాధిఁ
జొచ్చినవిషయంబుదెలిసి ♦ శోకాతురతన్
నొచ్చినమదిగురు సతికడ

కచ్చుగఁ జనిసిద్ధఁడిట్టు ♦ లనివచియించెన్ 60

చ. జననిరొమద్గురూత్తముఁడు ♦ చాటున కేగెడు కాలమందునన్
గనుఁగొనుసట్టి భాగ్యమును ♦ గాంచఁగ నైతినిగాని నేసమా
ధినయినఁ జూచి పోఁదలఁచి ♦ తిన్ మదభీష్టము దీరునట్లు పా
వనమగుసత్కృపన్ మఠక ♦ వాటముఁ దీయుమ నీకు మ్రొక్కె
దన్ 61

క. అని మ్రొక్కుచుఁ బలు తెఱఁగుల
వినుతులు గావింపుచున్న ♦ విరహితకృపతోఁ
గనుఁగొని గోవిందమసి
ద్ధనితోఁ బట్లనుచుఁ బలికెఁ ♦ దనయులు మెచ్చన్ 62

— గోవిందమ సిద్ధనికి మఠద్వారము తెరువననుట —

ఉ. పన్నుగ మ్రొక్కినన్ మఠక ♦ వాటముఁ దీసి సమాధిఁ జూపి పె
న్మన్ననఁ జేసి పంపునని ♦ మానసమందనుకొంటివేమొ కో
నిన్నటిపోఁడ నే యిచట ♦ నీపనులన్నియుఁ దీరెఁగా సమా
సన్నిధియందునొక్కనిము ♦ సంబును నిల్వఁగ రాదు పొమ్మికన్

క. ఉంటివి పదిరెండేఁడులు
తింటివి మృష్టాన్నములను ♦ దిప్పుచు బలుపుఁ
గొంటివి చాల్చాలిఁక మీ
యింటికిఁ జనుమిచటనుండ ♦ నేటికి సిద్ధా 64

క. అనవినిసిద్ధఁడు గడుగ్రి
క్కున వెనుకకుఁ దిరిగి చనుచు ♦ గురుచెంగటికిన్
జని నే లేనపుడు సమా

ధిని జేరితి వెందువలనఁ ♦ దెల్పుమటందున్ 65

ఆ. దర్శనంబొసంగి ♦ తగుసమాధానంబుఁ
జెప్పవలయునట్లుఁ ♦ జెప్పకున్న
నాదుశిరముఁబగుల ♦ మోదియర్పణమును
జేతుగురునకనుచుఁ ♦ జేరెమఠము 66

గీ. చేరిసిద్ధుఁడు మఠముఖ ♦ ద్వారమందు
నిలిచి కేల్మోడ్చి ♦ కనుగవనీరు గార
వగచుచును బొతులూరి వీ ♦ రగురువర్య
చిత్తమగలఁగనిటునుతిఁ ♦ జేయఁదొడఁగె 67

... సిద్ధుఁడు దర్శనంబిమ్మని వీరగురునుతించుట ...

ఉ. దేవజగద్గురూత్తమను ♦ ధీజన సన్నుత సచ్చరిత్ర దీ
నావనయద్వితీయపర ♦ మాత్మ నిరామయ నిర్వికారనేఁ
బూవుల కేగి తెచ్చి త మ ♦ పూజలుసేయనిదే సమాధిలో
నీవిధిఁజేరనీకు మన ♦ సెట్టులనొప్పె వచింపవే కృపన్ 68

గీ. నిర్వికల్పసమాధిని ♦ నీవుచేర
నెంచినప్పుడు సిద్ధని ♦ కెవ్వరేమి
చికుఁగలిగింపఁగలరొ చూ ♦ చెదనటంచు
దివ్యదృష్టిని గనకుంట ♦ భావ్యమగునె 69

ఆ. యోగదృష్టినరసి ♦ యుండిన సన్నొరుల్
మోసగింతురనుచు ♦ మున్నెనీకుఁ
దెలియకున్నెయట్లు ♦ దెలిసిన నాకిట్టి
వంకటంబదేల ♦ సంఘటించు 70

క. పదిరెండేడులు దావక
పదయుగళము నాశ్రయించి ♦ పడియుండిననా
కొదవెడు చిక్కుల నరయక
మదినొవ్వఁగఁ జేసచనస ♦ మంజసమగునా 71

క. లవమాత్రమైన నీనుడి
జవదాటియెఱుఁగనెట్టి ♦ సమయమునందున్
భవదీయనామమంత్ర
స్తవమును విడియెఱుఁగనీకు ♦ దయవిడనగునా 72

క. తలుపున్ దెరుపుము నాతోఁ
బలుకుము నేఁజేయుపూజఁ ♦ బడయుమునీవే
సెలవిచ్చి దపోయొకపరి
తెలుపుముమద్గురువరేణ్య ♦ దీనశరణ్యా 73

క. నేసతతమునీ సేవలఁ
జేసితినేకానియెఱుకఁ ♦ జెడికలనైనన్
దోసముఁ జేసియెఱుంగను
మోసమునను జేయఁదగున ♦ మునికులతిలకా 74

సీ. కడపనబాబుచెం ♦ గటికినేఁజనునాడు
మహిమనాకిడినట్టి ♦ మంజుకరుణ
భవదాత్మజులుకడు ♦ బాధించునెడనన్ను
దరిఁజేర్చిపోషించిన ♦ దండికరుణ
కుక్కడొక్కనఁగల ♦ కుళ్లునీటినిబానఁ
బాలుజేసినయట్టి ♦ పరమకరుణ

ద్వాదశాబ్దములన్న ♦ వస్త్రంబులనొసంగి
షట్టుగా సాకిన ♦ యట్టికరుణ

గీ. కొమరులకువలె వేదాంత ♦ గోప్యములను
దేటగాఁ దెల్పుచుండిన ♦ దివ్యకరుణ
చివరకీవు సమాధిలోఁ ♦ జేరువేళ
నెటులఁ బోయెను నాపైని ♦ నీంద్రతిలక 75

గీ. దర్శనంబిచ్చితగు సమా ♦ ధానమీవు
జెప్పి పూజలుగొని నాకు ♦ సెలవునొసఁగ
వేని మత్ప్రాణములను నే ♦ నిపుడె విడుతుఁ
దథ్యమీమాట నీనుపా ♦ దములసాక్షి 76

— సిద్ధనికి వీరేశ్వరుండు దర్శనంబిచ్చుట —

వ. అని వినుతింపుచుండుట గురుసతీసుతుఁడున్ దెలిసి సిద్ధని వెడలఁగొట్టవలయునను తలంపుతో మఠంబునకు విచ్చేసి గురుధ్యానతత్పరుండై మైమరచియున్న సిద్ధనిన్ గాంచి యెవరి కెట్లు దూషింపుచుండునో యొకింత యాలింతమని నిశ్శబ్దంబుగా సిద్ధని వెనుక నిలిచియుండఁగా సిద్ధఁడు గురుసందర్శనంబుగాకుండుటచే విసికియుఁ కనే బ్రతికి ప్రయోజంబులేదిదే నా శిరంబున్ గవాటంబునకున్ మోదుకొని ప్రాణంబులు నీకర్పింపుచున్నాడ నీ తీఁపుమని వెనుకకు మూఁడడుగులిడి శ్రీమద్వీరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాముల వారికి జే యని వీరావేశంబునఁ బెద్దపెట్టునఁ గేకఁ బెట్టి తలుపునకు శిరంబున్ గుఱిఁజేసి మహోద్రేకన్ విజృంభించి

దూకుసరికి తాళంబూడిపడికవాటంబు తెరువఁబడి సమాధి పై మూతతొలఁగిపడి దేదీప్య మానుండై వెలుంగుచున్న వీరేశ్వరుండు సిద్దానిర్వికల్ప సమాధియోగంబుననుండిన నన్నింతకలతనొందించిన భవద్గురుభక్తికిని యుష్మదాకర్షణ శక్తికిని నేనెంతయుసంతసించితినీక నీయభీష్టంబు దీరఁగ దానన్నుబూజింపుమనవుడు సిద్దండమందానంద కందళిత హృదయారవిందుండై తానుగైకొనివచ్చిన కుసుమంబుల తో నర్చింపుచు 78

దండకము

— శ్రీమద్విరాట్పోతులూర్య స్వయాం —

భోధిసోమానదైశ్వర్య భీమాగతాకోశకామా సుధీసార్వ భౌమాత్రిలోకాభిరామావికాసాతుదామాపరబ్రహ్మనామ పరంధామ వేదాంతసారా సమంచద్విచారాయనాచారదూరసదా నిర్వికారామహోదారధీరా మునీంద్రావతారాసముద్యత్ప్రచారాచిదాకార విజ్ఞాననేత్రా కవిస్తోత్రపాత్రాలసద్విశ్వగాత్రా బుధానీకమిత్రాకనద్వాక్పవిత్రా జగత్సృష్టిసూత్రాశ్రితార ణ్యచైత్రాసుచారిత్రగాంభీరకారుణ్య చిత్తుండవై యత్ప్రమేయుండవై స్వప్రకాశుండవై యద్వితీయుండవై యున్ననీలీలన్ బ్రహ్మకైనన్ గణింపంగ శక్యంబుగాకున్నదిన్నెంచనే గటాక్షం బెంతవాఁడన్ బునవ్ నాదునేరంబునైరించి రక్షింపవే వీరనారాయణాభిఖ్యమద్దేశికేంద్ర నమస్తే నమస్తే నమస్తేనమః 79

గీ. అనుచుఁబూజింపసిద్దని • కాత్మగురుఁడు

హస్తమస్తక సంయోగ • మాచరించి
భ్రూయుగళమధ్యమున బూది • బొట్టుఁబెట్టి
రసనమాహాత్మ్యబీజాక్ష • రమును వ్రాసి 80

మ. అనిశంబున్ విజయోస్తునీకనుచు నిం•పారంగ దీవించి చ
య్యానఁదీర్ఘంబుఁ బ్రసాదమున్ మహిమను•ద్యద్దివ్యదృష్టి విభూ
తిని వేత్రంబును బాదుకాద్వయమును•ద్వేలాక్షమాలన్ ముదం
బున శిష్యాగ్రణికిచ్చి సద్గురుఁడు డెక్కన్ • బొమ్మనస్సంతృప్తిమై

గీ. అంతసిద్ధుఁడు జపమాలి • కాదులుగొని
మ్రొక్కి కౌఁగిలించంగనె సమాధి • మూతబడియె
వెలుపటికివచ్చుసరికిఁద • ల్పులును బిగిసెఁ
దాళమెప్పటిరీతిగాఁ • దవులుకొనియె 82

వ. అట్టియెడఁగట్టెదుట భయభ్రాంతచిత్తులై వీక్షింపుచున్న గురుసతీసుతులన్ గాంచి నేనిదే ముదుమాల కేగుదెంచుచున్నాఁడ దయయుంచుఁడని నమస్కరించి యరుదెంచుచుండఁగా సిద్ధుఁడు మహిమాంచితుఁడై చనుటెఱుంగక గురునందనులిట్లాలోచింపుచుండి రదెట్లన్నను 83

క. ఎన్నఁగ జనకుని మహిమయె
చెన్నగనిపుడిట్లు జేసె • సిద్ధనికడనే
మున్నది మహిమయె యుండిన
నిన్నెయిట కేలరాడు • నేర్పుదలిర్పన్ 84

గీ. అరయమహిమంబుసిద్ధని ♦ యందు లేదు
గానఁజనువాని కడ్డము ♦ గాను జెనటి
తలవరులఁబంపి పాదుకా ♦ దులనుదోఁచు
కొనియుదెచ్చునటులఁజేయఁ ♦ గనగుమనకు 85

చ. అనుచుఁదలారిజోదులదు ♦ రాత్ములనిగ్రహణంపవారలో
య్యనఁజని సిద్ధునిన్గదియు ♦ నప్పటికాగురుఁడగ్రిసూతిగో
బ్బున వెనువెంట నేగియొక ♦ పూఁపొదడాగియుఁ జూచుచుం
డఁగాఁ
జెనటి తలారిజోదులల ♦ సిద్ధునికిట్లనికాగ్రహంబునన్

మ. దురితాత్మా పదిరెండువత్సరములెం♦దున్బోకవీ రేయుమం
దిరమందున్వసియుంచి తత్కరుణఁబో♦దిన్గన్నసీకిట్లుత
స్కరురీతిన్ గురుసొత్తులన్గొనిచనం♦గాఁజెల్లునే నేడు వే
గిరమా సొత్తులు బెట్టుమిందని వెసన్♦గేల్బట్టుకొన్నంతలోఁ

క. ఇరువైపుల రెండుపులుల్
కరమరుదుగ వేచిమిగుల ♦ గాండ్రించుచు భీ
కరముగఁ బైఁబడి వచ్చుట
పరికించి తలారులెంతొ ♦ భయవిహ్వలులై 88

క. అబ్బబ్బోయివి యెక్కడి
దెబ్బలు లెటుబోదుమనుచుఁ ♦ బృథుకంపమునన్
దబ్బిబ్బులగు తలారుల
యిబ్బందికి నగుచుసిద్ధుఁ ♦ డిట్లనివలికెన్ 89

క. తలవరులారా మనలో

పలుఁదపస్కరు లెవరొ తేట ♦ పడవలెనెపుడా
పులులకు మనవర్తనములు
దెలుపుదమన వారలెంతో ♦ దీనతఁదోపన్ 90

ఉ. నీమహాత్త్వముఁ న్దెలియ ♦ నేరకమూర్ఖతనిన్నుఁగొట్టివే
త్రాదులనెల్లఁదోచుకొని ♦ యాగురుపుత్త్రులకీయ నెంచి నీ
మీఁదికివచ్చినారమత ♦ మింపుముజ్ఞానమువచ్చెమాకుఁద్వ
త్పాదములేశరణ్యముల ♦ పాయముఁబాపుమటంచుభీతినై

క. సిద్ధయపదముల పైవా
రిద్దరుఁబడియామహాత్మ ♦ యీవ్యాఘ్రములన్
గద్దించితొలిమమ్మున్
సద్దయనేలుమని నుతులు ♦ సల్పుచునేడ్వన్

ఆ. అంతసిద్ధయాఖ్యుఁ ♦ డాదృతిభూతిమం
త్రించి పులులపైనిఁ ♦ దిగిచిపైవ
వ్యాఘ్రయుగమదృశ్య ♦ మాయెఁబాదాక్రాంతు
లైనవారలనుబి ♦ రాన లేపి 93

గీ. బుద్ధిగలిగియునిండ్లకుఁ ♦ బోండటంచు
సెలవొసంగిన యంతనే ♦ సిగ్గునొంది
సిద్ధయకుఁదలవరులుజే ♦ జేలొనర్చి
చనిరొదమటంచు నుడివెడి ♦ సమయమందు 94

—గోవిందయ సిద్ధయను మరలనింటికిరమ్మని బతిమాలుట—

క. రయమునగోవిందయ సి
ద్ధయకడకరుదెంచి నిర్మ ♦ లాత్మకరుణా

నయుఁడవు మహిమాంచితుఁడవు
నయశాలివి నినుగణింప ♦ నలువకు వశమే 95

క. తిట్టితిమి వలదు పొమ్మని
నెట్టితిమి సహింపలేక ♦ నిర్దయతో నిన్
గొట్టితిమి పెక్కు చిక్కులు
బెట్టితిమవి నీవు మదిని ♦ బెట్టకుమన్నా 96

క. ఉంటిని పొదలో డాగియు
వింటిని నీ భాషణములు ♦ విశదముగాఁగ
న్గాంటిని నీ మహిమను మా
యింటను భావనమొనర్ప ♦ నేతెంచఁగదే 97

క. ఇఁకఁ గొంతకాల మస్మ
న్నికటంబున నుండవలయు ♦ నీవియ్యెడమా
మకమందిరమునకును ద
ప్పకపోదము రమ్మటంచు ♦ బతిమాలు నెడన్ 98

క. గోవిందయతో సిద్ధయ
భావంబలరార నిటులఁ ♦ బలికె మహాత్మా
మీ వలనఁ దప్పు లేదటు
గావింపక కీర్తి యెటులఁ ♦ గలుగును నాకున్ 99

క. నిరసించితినని తలఁకు
మరయఁగ నీ వెఱుఁగనట్టి ♦ న్యాయము గలదే
గురునాజ్ఞ లేదు కావున
మరల నెటులనుందుఁ గంది ♦ మల్లయపల్లిలోన్ 100

క. ఇప్పుడు మత్పురమునకును
దప్పక యేతెంచవలయుఁ ♦ దత్పురమునకే
నప్పుడపుడు మీయానతి
చొప్పుననరుదెంచిపోవు ♦ చుందునుభక్తిన్ 101

క. అనియొడఁబరచిన గురునం
దఁనుడుఁదలారులును గలిసి ♦ ధామంబునకున్
జని జననికి నవజన్ముల
కునుసిద్ధని మహిమఁదెల్పెఁ ♦ గూర్మిజనింపన్ 102

వ. ఇట్లుదెల్పి తమమందిరంబున జరుగుప్రతికార్యంబునకును సిద్ధయన్ రావించి యగ్రశిష్య తాంబూలంబిచ్చి సత్కరిం పఁదీర్మానించుకొని యున్నంతనచ్చట

క. కడుమోదంబున సిద్ధయ
ముడుమాలకు నేగఁమార్గ ♦ మునభాసిలుచుం
డెడు పలుగురాళ్లపల్లియ
కడకే తెంచెన్ స్వధామ ♦ గమనోన్ముఖుఁడై 104

సిద్ధయోగిసర్పదష్టుఁడై మృతినొందినతిమ్మారెడ్డినిబ్రతికించుట

సీ. భక్తాగ్రిణులకాట ♦ పట్టనిచెప్పఁజా
లినపల్లురాళ్లప ♦ ల్లియన నొక్క
యువకుఁడు గుణరూప ♦ యుతుఁడు తిమ్మారెడ్డి
యురగదష్టుండయి ♦ మరణమొందఁ
గాటికిఁగొనిపోయి ♦ కాష్టంబుపైఁజేర్చి
తలిదండ్రులను బంధు ♦ తతియుమిగుల

విలపింపుచుండఁగా ♦ వినిసిద్ధయోగీంద్రుఁ
డేతెంచి శవమును ♦ జేతఁదట్టి
గీ. లెమ్ముపోవుదమని పిల్చి ♦ లేపుకొనియు
వెంటఁగొనిపోయి యాతని ♦ నింటజేర్చె
సంతనాపాలిటికి భగ ♦ వంతుఁడవని
యెఱిగియారెడ్డి సిద్ధయ కిట్టులనియె
క. దేవా తావకమహిమన్
జీవించితినెంతధనము ♦ చెలువుగనీకున్
గావలయునో కోరుము నే
భావంబలరారనిచ్చి ♦ పంపెదననినన్ 106
క. ధనమునకైనిను బ్రతికిం
చినవాఁడను గాదుగురుని ♦ చిరమహిమంబున్
జనులకుఁజూపించుటకై
నినుబ్రతికించితినిధనము నేఁగొనననఘా 107
క. ఒప్పితినీభక్తికి మా
యప్పనుదర్శించుకొనఁగ ♦ నతివేగమనే
నిప్పుడెమత్పురమునకును
దప్పకయేగవలెననుచు ♦ దాకిన్ బట్టెన్ 108
క. తిమ్మారెడ్డియు మఱియుఁద
తిమ్మారెడ్లెల్లరును ను ♦ తింపుచుఁగమనీ
యమ్ముగ భాషింపుచుఁదో
యమ్ముగసిద్ధయనుసాగ ♦ నంపిరిభక్తిన్ 109

— సిద్ధయోగి స్వగృహమునకుఁ జేరుట —

ఆ. అంతసిద్ధయోగి ♦ యటనుండి మూఁడుపూల
కరుదెంచినిజగృ ♦ హంబుఁజేరి
తల్లిదండ్రులకును ♦ దగుభక్తిమ్రొక్కఁగా
సుతునిగాంచివార ♦ లతిముదమున 110

ఆ. మదిఁదలంచిచూడ ♦ మనగృహంబునకొక
వత్సరంబునుండి ♦ వచ్చియెఱుఁగ
వింతకాలమిటకు ♦ నేతెంచకుండుట
ధర్మమగునెనీకు ♦ నిర్మలాత్మ 111

ఆ. అరయనేటికైన ♦ నటగల్గుపనులెల్లఁ
దీర్చుకొనియునేగు ♦ దెంచినాఁడ
వీఁకనిజాలయమున ♦ నేయుందువనివింటి
మెంతొముదమునగల్గె ♦ నది తెచాలు 112

ఆ. నిన్ననీపురాక ♦ మున్నెసమాధిలో
గురుఁడుజేరెననియు ♦ మరలనీకు
దర్శనంబునిచ్చి ♦ దయతోడఁబాదుకా
దులనొసంగెననుచుఁ ♦ దెలిసెమాకు 113

ఆ. విలువగల్గువస్తు ♦ వులుగల్గియు గురుండు
పాదుకాదులిడిన ♦ భావమేమొ
తెలిపిమమ్ముమోద ♦ కలితులఁజేయవే
వినయగుణసమాజ ♦ ప్రియతనూజ 114

క. అనిపల్కిన నగి సిద్ధయ

జననీ జనకులకు నిట్లు ♦ సరవి వచించెదన్
మన మాలరఁ బాదుకాదులఁ
గొనుమని గురుఁడిచ్చె నెందు ♦ గొరకన వినరే 115

సీ. ఇల విభూతి గణింప ♦ నిట్టిదంచు గ్రహింపఁ
బ్రీతిమై గురుఁడు వి ♦ భూతినిచ్చెఁ
వేదోడు వాదోడు ♦ నామనంచు గ్రహింప
వేత్రంబు జపమాల ♦ వేడ్కనిచ్చె
గురు పదార్చనె సదా ♦ శరణమంచు గ్రహింపఁ
బాదుకా ద్వయమును ♦ బరగనిచ్చె
జనుల బాగోగులు ♦ గనుట కంచు గ్రహింపఁ
దిలకింపఁగా యోగ ♦ దృష్టినిచ్చె

గీ. సాధురక్షణమే మోక్ష ♦ సాధనమని
మానసంబందున గ్రహింప ♦ మహిమనిచ్చె
నెంతయును భక్తిఁ గైకొంటి ♦ నింతకన్న
విలువగల యవి యేవి కా ♦ వలయునాకు 116

గీ. నను గురుండు నిజాలయం ♦ బునకు నేగి
యార్య సమ్మతముగ గృహ ♦ స్థాశ్రమమున
మెలఁగు మమ్మని సెలవీయ ♦ మిమ్ము నేను
జేరవచ్చితిఁ దలిదండ్రు ♦ లారయుఁడిన 117

వ. అంత నా యాదంబీ పీరుసాహేబు లెంతయు సంతసించి కుమారుండు మహాత్ముండై యేతెంచె నిఁక మన కింతకన్న వేరుభాగ్యంబేమి కావలయునని యన్యోన్యాను రాగం

బుల విలసిల్లుచున్న మరుదివసంబున 118

సీ. రాశింపఁగాఁ బల్గు ♦ రాళ్ల పల్లియయందుఁ
గల జనులెల్ల గుం ♦ పులయి యెచటఁ
గన్నఁ దిమ్మారెడ్డి ♦ పన్నగ దష్టుఁడై
మరణింప సిద్ధయ ♦ కరుణతోడ
మనిచి నాఁ డెంతటి ♦ మహానీయుఁడనుచును
గొంతమంది వచింపఁ ♦ గొందరట్లు
కాదు తిమ్మారెడ్డి ♦ కాకోదరవిషంబు
వలన నెంతయుసొమ్మ ♦ సిలినఁగాంచి
గీ. సొలిసెనని కాటి కడకుఁ గొం ♦ పోవనాయెఁ
గాని మృతి నొందలేదట్టు ♦ లైన మరలఁ
బూని బ్రతికింపఁగా విధి ♦ కైన వశమె
యనుచు ననుకొనుచుండి ర ♦ త్యద్భుతముగ 119

క. అంద రిటుల ననుకొన గో
.విందస్వామి యను నొకఁ ♦ విప్రుఁడు విని యా
సందేహంబును దీర్చఁగా
నా దిమ్మారెడ్డి దాపు ♦ నకు నేతెంచెన్ 120

వ. అట్లే తెంచి 121

క. అతని నతని జనయిత్రీ
పితరుల బాంధవుల నడుగఁ ♦ బ్రీతిన్ వారా
మృతి నిక్కమనియు సిద్ధయ
బ్రతికించిన యదియు వాస్తవంబని తెలుపన్ 122

క. యదుకుల మునహారివలె న
య్యదుకులమునఁ గల్గె సిద్ధ ♦ యాఖ్యుఁడనియుఁ బ
లుకుదురైన ఘనుఁడనియుఁ బ
లుకుదురైనన్ దర్శనమున ♦ కున్ సులభుఁడె కా 123

సిద్ధయోగి దర్శనమునకు గోవిందస్వామి
—— యను విప్రుండు వచ్చుట ——

క. అమ్మహనీయుని గనసి భ
వమ్మది వమ్మగు నటంచు ♦ వచియింపుచు శీ
ఘ్రిమ్మగ ముదువాలకుఁ బయ
నమ్మై మార్గమును బట్టి ♦ నన్ గనుఁగొనియున్ 124

క. అమ్మాన్యుని సిద్ధయను బ్రి
యమ్మున దర్శించు కొనఁగ ♦ నంతకుమున్నే
నెమ్మనమునఁ దలఁచిన యా
తిమ్మారెడ్డియును బయలు ♦ దేరన్ ద్విజుతోన్ 125

గీ. ఇరువురును ముదువాలకు ♦ నరుగుదెంచి
రాజవీధిని బోవుచు ♦ రచ్చకడకుఁ
జేర సిద్ధయ స్నానంబుఁ ♦ జేయ నదికి
నేగుచును వారి కచటనే ♦ యెదురు పడియె 126

వ. ఇట్లెదురు పడిన సిద్ధయోగీంద్రునకు వారిరువురు జోహా
రు లొనర్చునెడ

— కర్ణము పాపరాజు సిద్ధయను బరహసించుట —

క. అచ్చటఁ బలువురుఁ గూడియు

ముచ్చటలాడు కొనుచుండి ♦ ముని వేషముతో
వచ్చిన సిద్ధయ నారసి
రచ్చనఁ గలమంత్రి పాప ♦ రాజిట్లనియెన్ 128

శా. తండ్రిన్ దల్లిని పీడి వీరగురు చెం ♦ తన్ నిశ్చలాత్మండవై
పండ్రెండేడులు పంచఁగాచుకొని సే ♦ వల్ జేయుచున్నావటం
చండ్రా సద్గురుఁడెంత ద్రవ్యమిడి ని ♦ న్నంపించెనో నేడు పె
క్కండ్రాలింపఁ దలంచినా రిచట వే ♦ డ్కన్ దెల్పుమా సిద్ధడా 129

మ. అనినన్ సిద్ధయ పాపరాజునకు న ♦ త్యానంద మేపార ని
ట్లనె నోవిప్రకులాగ్రణీ వినుము నా ♦ కాచార్యుఁడే మీవలెన్
ధన ధాన్యంబుల మించఁగాఁ గలుగు జీ ♦ తంబౌనన్ బేర్మిఁగో
ల్వనకై యిచ్చిన పాదుకా ద్వయమె చా ♦ లున్ మేలు జేకూర్పఁగన్ 130

చ. అనవిని పాపరాజు పరి ♦ హాసముగా నిటుబల్కె సిద్ధఁడా
గొనకొని నాడు చెంగటను ♦ గొల్వొనరించినఁ బేర్మి వత్సరం
బున కొక పాదుకాద్వయముఁ ♦ బాల్పుగనీయనె యుంచు సవ్వఁజే
తిని బయికెత్తి సిద్ధముని ♦ ధేయుని పెద్దఁగఁ గేకఁ బెట్టినన్

చ. ఆదివిని పాపరాజు దుర ♦ హంకృతినిట్లనినిన్న వచ్చియున్
మొదటనె నన్నుఁటుల్ పసర ♦ మూఁకవలె ధేయని నీవదల్తువా
పిదపమధన్యు లెట్లుగను ♦ పింతురొ నీకును దుర్మదాంధనీ
మదమడగింతుఁజూడు మొక ♦ మాసములోపల నిశ్చ
యంబుగన్ 132

క. యోగిననుచు గర్వమున ని
యోగిని ననుబరిహాసింప ♦ నూరకపోనే
భోగినిదోఁకిఁకన నెంతటి
భోగినయినఁ గరువకెట్లు ♦ పోనదిసిద్ధా 133

క. అనవిని సిద్ధయ యిట్లనె
మనమునశాంతము వహించి ♦ మామకవిజ్ఞా
పనమును సాంతముగానిఁక
వినఁగదవే పాపరాజ ♦ విభవబిడౌజా 134

ఆ. పొలమునందుఁగోవ ♦ కులుగాయు నీయాల
మందలోననొకఁ ♦ మంచిగవిని
లాఘవముగఁజిఱుత ♦ లంఘించిపట్టిన
ధేయటంచుఁదోలి ♦ తిన్ద్విజేంద్రి 135

క. మెడయందున గాయంబులు
బడుటఁజికిత్సనొనరింపఁ ♦ బశువునుగోపా
లుఁడుమెల్లఁగఁదోలొఁకనినీ
కడకే విచ్చేయు మూడు ♦ గడియలలోనన్ 136

క. అనిసిద్ధయ స్నానంబున

కుమ నడికేతెంచనంత ♦ గోవిందస్వా
మిని శివమ్మారెడ్డి గలిం
చిన సిద్ధుఁడు మనిచెనటవ ♦ చింపుమదెట్లో 137

క. అనిపాపరాజు ప్రశ్నిం
చిన రెడ్డిని జూపి తద్వి♦ శేషము నెల్లన్
వినుపింపుచునుండిన యం
తని ఘటికాత్రయముగడచెఁ ♦ దత్సమయమునన్ 138

క. గోపకుఁడు చిఱుత బట్టిన
యాపశువును దోలుకొనియు ♦ నటకేతెంచన్
గాపరిని గాంచి కరణం
బీపసరమునిటకుఁ దెచ్చు ♦ టెందులకనినన్ 139

సీ. వినుమయ్య నేవనం ♦ బున నాలఁ గాయుచుం
డఁగ నొక్కపొదయందు ♦ డాగియుండి
వ్యాఘ్రమీ ధేనువున్ ♦ వడిమీఁదఁ బట్టఁగా
నెటనుండి యోసిద్ధుఁ ♦ డేగుదెంచి
ధేయని మిగులభీ ♦ తిలఁ గేక బెట్టినఁ
బసరమున్ విడి పులి ♦ పాఱిపోయె
గాయముల్ బడియున్న ♦ కతనఁ జికిత్సకై
తోడుకుని చోటికిఁ ♦ దోలుకొనియు

గీ. వచ్చినాడనటంచుగా ♦ పరివచింప
మొదవుదరికేగి పెనుగాయ ♦ ములను గాంచి
సిద్ధయోగిని ధిక్కరిం ♦ చిఱినిగానఁ

బాపరాజాఖ్యసార్థక ♦ పసునటంచు 140

క. కరణమపుడు సిద్ధయకడ
కరుదెంచి క్షమాపణంబు ♦ సర్థించుటకై
బరువడిఁజనుచుండఁగఁదన
సరసఁగల జనులవెంటఁ ♦ జనిరొక్క-మొగిన్ 141

వ. ఇట్లుజనిసిద్ధయోగీంద్రున్దర్శించి ముకుళితహస్తులై నిలిచి
న నామహాత్ముండు వీక్షించి కూర్చుండనియోగించినంతనే
వారెల్లరాసీనులైయుండుటయుఁ (బాపరాజొకండు మాత్ర)
మల్లేనిలిచి సిద్ధయోగీంద్రునితో నిట్లనియె 142

— పాపరాజు సిద్ధయోగిని క్షమాపణమును గోరుట —

క. మౌనివర నీమహాత్వము
నేనెఱుఁగక తూలనాడి ♦ నిందించితి న
జ్ఞానుఁడనై నినుదెగడిగిన
నానేరములన్ క్షమించి ♦ నన్నోమఁగదే 143

క. ఫులివక్త్రమునన్బడి నీ
వలనన్జీవించినట్టి ♦ పసరమువచ్చెన్
దిలకించితిమి భవన్మహి
మలువర్ణింపఁగవశంబె ♦ మముబోంట్లకిలన్ 144

క. మీపెద్దలసుకృతంబున
నీపురినిజనించినాడ ♦ విఁకనిటనీవే
కాపురమున్నలైనన్
మాపుణ్యంబెన్నశక్యమె ♦ మామహితాత్మా 145

క. మనగ్రామంబున నీకొక
ఘనతరమగునట్టి మఠముఁ ♦ గట్టింతుము ప్రే
మను నీవందుండియుఁ బా
వనులను మముఁ జేయుచుండ ♦ వలయు మహాత్మా 146

వ. అనిన తక్షణంబె 147

క. తిమ్మారెడ్డియు లేచి మ
ఠమ్మునకున్ బట్టినట్టి ♦ డబ్బున సగభా
గమ్మిచ్చెదనని వాగ్ద
త్తమును జేసెన్ సుధీవి ♦ తానము మెచ్చన్ 148

క. గోవిందస్వామియుఁ దన
భావంబలరారనిట్లు ♦ బల్కెను మీకున్
గావలసిన సాయంబును
గావించెద మఠవిశిష్ట ♦ కార్యములందున్ 149

వ. అనిపల్కినంతనే యటం గలవారెల్లరును వారివారిశక్త్య
నుసారంబుగా మఠనిర్మాణంబునకుఁ దోడ్పడుదుమని యేక
గ్రీవంబుగాఁ బల్కుటయు నంత సిద్ధయోగీంద్రుండో భక్తా
గ్రణులారా మీ సదుద్యమంబున కెంతయు సంతసించితిని గ
మీరొనర్పన్ బూనినకార్యంబు శీఘ్రంబ నెరవేరున్ గాక
యని దీవించి సెలవొసంగినయంత వారా గ్రామేశాన్య దిశన
లరు నిర్మలస్థలంబున నొకశుభముహూర్తంబున శంకుస్థాప
న మొనర్చి మఠనిర్మాణమునకుఁ బ్రారంభించి పనిసాగింపు
చుండుటయు నాడు మొదలు గోవిందస్వామి నిత్యంబును

సిద్ధయోగీంద్రున్ సందర్శింపుచు వేదాంత రహస్యంబు
లెల్ల దెలుసుకొనుచుండిన వాఁడాయెను 150

— ఆశ్వాసాంతములు. —

క. సతతాత్మయ పరితోషా
అతులిత సద్గుణ విభూష ♦ యాశ్రిత పోషా
రతిపతి సన్నిభ వేషా
మతసంస్కారణాభిలాష ♦ మంజులభాషా 151

క. దానకలాప్రావీణ్యా
దీన జనోద్ధార శరణ్య ♦ దీపితపుణ్యా
శ్రీనాయక కారుణ్యా
మానిత విబుధాగ్రగణ్య ♦ మనుజవరేణ్యా 152

పంచచా. అనేక దుష్ట గర్వభంగ ♦ యోగమోక్ష భాషణా
మనోజతుల్య సుందరాంగ ♦ మానితార్థపోషణా
వినోదదాయక ప్రసంగ ♦ విద్వద్విభీషణా
కసత్కృపాంచితాంతరంగ ♦ కమ్రశాంతభూషణా

గద్య

ఇది శ్రీ పరమేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా విచిత్ర విశ్వకర్మకుల పవిత్ర భద్రదత్త గోత్ర పోకూరి వంశాబ్ధి కైరవమిత్ర రామలక్ష్మమ్మాంబా సుబ్బయాచార్య పుత్ర కవిసింహ బిరుద పాత్ర బుధజనానుమతి కాశీపతి ప్రణీతంబైన శ్రీసిద్ధయోగి చరిత్రంబునందు చతుర్థాశ్వాసముసంపూర్ణము

## పంచమాశ్వాసము.

### అచ్చాంబీ పరిణయము.

క. శ్రీ రుచిర జగద్విఖ్యా
తారామాచార్య పౌత్ర ♦ తారాజారా
కారా జిల్లెళ్లాన్వయ
వీరబ్రహ్మాభిధాన ♦ విమలజ్ఞానా 1

ఆ. అవధరింపఁగదె మ ♦ హాత్ముఁడసన్ దపో
ధనుఁడసంగుఁ బుణ్య ♦ తముఁడనంగఁ
బరగు సిద్ధయోగి ♦ వరు చరిత్రమునందు
నెసఁగు నావలికథ ♦ యెట్టులనిన 2

వ. అంత నొకనాఁ డాదంబీన్ గాంచి పీరుసాహేబిట్లనియె 3

గీ. ఇంతిరో సిద్ధయకు మన ♦ మింక నేని
పరిణయముఁ జేయకుండుట ♦ పాడిగాదు
కాన మీయన్నయగు నల్లి ♦ ఖానునకడకు
నరిగి తన బిడ్డనిమ్మని ♦ యడుగఁగదవె 4

క. ఒకయూర నుండువారము
ప్రకటితమగునట్టి పూర్వ ♦ బంధుత్వము గ
న్యకయో సొగసరి గుణవతి
ఇఁక వేగే చోటికేగ ♦ నేటికి మనకున్ 5

క. మేనల్లుఁడు వీరేశుని
మానుగఁజేరి నది మొదలు ♦ మనతో నల్లీ
ఖానలిగి పలుకఁడైన

మేనరికము తప్పదనుము ♦ మీయన్నయతోఁ 6

క. చేవదొరగి వృద్ధత్వం
బావహిలియుఁ దరుణిఁ బెండ్లి ♦ యాడుటచే మా
బావనుడి సాగదిప్పుడు
మీ వదినదె పెత్తనము సు ♦ మీ తెలియఁగదా 7

గీ. మనము సామాన్యులము వారు ♦ ధనికులగుట
మన తనూజునకును వారి ♦ తనయ నిడఁగ
వల్ల గాదందురేమొ మీ ♦ వదినతోడ
మీకు మేనరికము తప్ప ♦ దీక నడుము 8

క. అనవిని యాదంబి మా
నిని యేగెద ననుచు భ్రాత ♦ నిలయంబునకున్
జని కాక్షింబీయునియెడు
తన వదినను గాంచి యివ్వి ♦ ధంబునఁ బల్కెన్ 9

**అచ్చాంబీని మనుమడుగుట**

క. వదినా మీయల్లునకిం
పొదవ వివాహంబొనర్చు ♦ నుద్యమమున మీ
సదనమునకుఁ బప్పన్నం
బు దినన్ వచ్చితిఁ బ్రియత్న ♦ మున్ జేయఁగదే 10

క. నీ తనయయైన యచ్చాం
బీ తరుణికి నాదుసుతుని ♦ పెండ్లికుమారున్
జేతాము వేడ్కఁగనులన్
జూతా మిద్దరికి నీడు ♦ జోడుగ నుండున్ 11

క. పెట్టవలెనేమొ యనుచున్
జెట్టుగ నను బిలువకున్న ♦ విచ్చేసియు నే
పుట్టిననాఁడే పిల్లకుఁ
బెట్టితి నా కోడలనుచుఁ ♦ బేర్కొనవింటే 12

క. అక్కలికికి నా కొమరుని
జిక్కించితిమేని మణిని ♦ జెక్కించిన బల్
చెక్కడపు మేల్మిబంగరు
ముక్కెరవలె నీకు కనుల ♦ ముందేయుండున్ 13

క. కన్యావరు లిరువురి సౌ
జన్య విలాసాదికములు ♦ చర్చింప నసా
మాన్యములిఁక సొమ్ములనో
ధన్యమతీయడుగఁగదవె ♦ తగురీతి ననున్ 14

వ. అనిన విని కాళింబి కోపోద్దీపిత మానసయై యిట్లనియె 15

— ఆదంబీని కాళింబీ పరాభవించుట. —

క. సొమ్ముకడకు వచ్చిన లే
లెమ్మిటఁ గూర్చుండఁ దగవు ♦ లేశమ్మును మా
యమ్మాయిని నీకొడుకున
కిమ్మని నోరెట్టులాడె ♦ నే యాదంబీ 16

క. ఈ గారేదుల నుండియు
వీరబ్రహ్మమును జేరి ♦ విశ్వముపైనన్
బైరాగి వలెను దిరుగు కు
మారున కస్మత్కుమారి ♦ మనుమడిగెదవా 17

క. కష్ట నిరంతరుఁడు మత
భ్రష్టుఁడు మాయావియగు భ ♦ వత్సుతునకు ని
ర్దుష్టమతిని మత్పుత్రి న
రిష్టముగా నెట్లు స్వీక ♦ రింపఁగ నిత్తున్ 18

క. శ్రీలేనివారి కెట లే
మేలేవి ధనికుల వియ్య ♦ మెటు చేకురు శా
ర్దూలంబుల నేస్తము మా
ర్జాలంబుల కెటులఁ గల్గుఁ ♦ జర్చింపంగన్ 19

క. లోకుల కనవరతము దూ
దేకుచుఁ బదిదుడ్లుమీర ♦ లెవ్విధముననో
చేకొనిన మాత్రనే మము
శ్రీకలితుల పిల్లనడుగఁ ♦ జెల్లునె మీకున్ 20

క. మీ సుతుఁడు మతభ్రష్టుం
డై సారెకు వచ్చిపోవు ♦ టారసి చుట్టా
లే సమయమందుఁదమను ని
వాసమునకు రారెఱుంగ ♦ వా యిప్పటికిన్ 21

ఆ. నీ కుమారునకును ♦ మా కూతునిచ్చియుఁ
జెలువుమీఱఁ బెండ్లిఁ ♦ జేతుమేని
కులమువారు మమ్ము ♦ వెలివేయరేనీకు
నింతమాత్రమైన ♦ నెఱుక లేదె 22
నీవిచట నిఁకఁ దిరిగితివైన ♦ నిల్వరాదు
లెమ్ము మంచిగఁ జెప్పిన ♦ లేవవేమి

వింటివా సిగ్గుమాలి కూ ♦ ర్చుంటి వేని
అర్థ చంద్రప్రయోగంబు ♦ లగును నీకు 23

క. అని కసరిన విని యన్నన్
గని భాయీ వదినవలుకు ♦ కఠినోక్తులు తా
విని నాడవుగద నీవే
మని యెదొ యొకసారి దెల్పు ♦ మాస్పష్టముగన్ 24

ఆ. అనిన తత్క్షణంబె ♦ యల్లిఖానిట్లనె
నాశలేదు పిల్ల ♦ నడుగ వలదు
కులము వారుమిమ్ము ♦ వెలిబెట్టిన దెఱింగి
ఏలవచ్చితమ్మ ♦ యేగుమమ్మ 25

క. అన నాదంబీసతి బో
రున నేడ్చుచు ఋణముదీరె ♦ రూఢిగ మనకున్
జనియెద మాకున్ దగు చో
టని కన్యన్ దెత్తునని త ♦ టాలున లేచెన్ 26

క. అత్తరి నచ్చాంబీయని
అత్తా నన్నేమిజేసి ♦ యరిగెదవిదె నే
వత్తును గొనిపొమ్మని పరు
గెత్తుచు నేతెంచి సరస ♦ నేడ్చుచు నిలిచెన్ 27

క. అయ్యెడ నాడున్ గొంటుచు
గయ్యాళి నెలంతయైన ♦ కాశింబీ యా
వియ్యమునకు వచ్చిన సతి
నెయ్యంబిసుమంత లేక ♦ నెట్టుచుఁ బలికెన్ 28

సీ. కదలవేమే వెను ♦ కకుఁ జూతువేటికి
యిట సడ్డుపడువార ♦ లెవరెనీకు
ఇంద్రజాలముఁజూపి ♦ యెల్లరిఁ వంచించి
గోరని గట్టించు ♦ కొనుచునున్న
నందను చెంగట ♦ మందులు మంత్రము
లెపుడు నేర్చితివె నీ ♦ వింతలోనె
మాపిల్లనెంతలో ♦ మలుపుకొంటివె నీవు
మచ్చుఁ జల్లితివకే ♦ మాయలాఁడి
గీ. అనుచు నిలువెళ్లనెట్టి పు ♦ త్రిని గనుఁగొని
ఏగదెచటికె నీకది ♦ యెక్కడత్తె
ఏమి రోగమె యిటులేడ్చె ♦ దేలె యనుచుఁ
గొట్టుచును నెట్టుకొని యుంటఁ ♦ గూఁలవేసె 29
వ. అంత నా యాదంబీ నిజాలయంబునకేతెంచి విలపింపుచు
నచటి యుదంతంబంతయు భర్త కెఱిగించిన నతండు విల
పింపనేల మనకిన్ దగినవారలు పిల్ల నీయ కుందురే
యూరడిల్లుమని భార్య నోదార్చి కన్యాన్వేషణంబునకు
నాలోచింపుచుండఁగా నచ్చట యచ్చాంబీ తన మనంబున

[redacted] అచ్చాంబీ విరహతాపము. [redacted]

ఉ. వియ్యముఁజేయవచ్చి కడు ♦ వేడెను నా ప్రియ మైన
యత్తపై
నెయ్యములేక మజ్జనని ♦ నెట్టెను దిట్టెను గాన బావయా
కయ్యపు సుద్దివిన్నఁగను ♦ గైకొనఁడే మొకొయంల్కఁబూని యా

దయ్యము నేమనందు బెడి ♦ దంబగు నాపదఁగూర్చె
నకటా 31

సీ. అల పురుషోత్తము ♦ పలుకులు వినకున్న
శ్రీనిభంబులగు నా ♦ వీను లేల
అల మహితకరు న ♦ ర్ధాంగిని గాకున్న
జానొందు నాసతీ ♦ జన్మ మేల
అలఘనుధామంబు ♦ నందు భాసిలకున్న
మించును బోలు నా ♦ మేనదేల
అల కళానిధిమోము ♦ నరయఁగా లేకున్నఁ
గలువలఁబోలు నా ♦ కన్ను లేల
గీ. అల సరసు నాక్రమణమును ♦ సలుపకున్నఁ
గమలములఁబోలు నట్టి నా ♦ కరము లేల
అల విబుధవరు ననుమతి ♦ మెలఁగకున్న
నభ్రికరిగతిఁబోలు నా ♦ యానమేల 32

చ. ఎటువలె నా మనోహరుఁడ ♦ హీన కృపారస ముప్పతిల్లఁగా
నిట కరుదెంచునో మదికి ♦ నింపగురీతిని నాదు విన్నపం
బెటువలె నాలకించునొ ర ♦ హింపఁగ నెన్నఁడు నన్నుఁబెండ్లియా
డుటకు ననుజ్ఞ నిచ్చునొ మె ♦ టుల్ మదభీష్టములెల్లఁదీర్చునో 33

వ. అని చింతింపుచు 34

క. చేతము శాంతి వహింపఁగఁ
జేతమనుచు నెంచి పెకటి ♦ చెట్లన్‌గల యా
చూతము నీడనఁ బడుకొని
చూతమనుచు నేగఁ బలికె ♦ శుకపికములటఁ 35

వ. అంత నా కీరాదులన్‌గాంచి 36

క. చిలుకా తగునే చిలుకల
కొలికిని ననుగాంచి పండ్లు ♦ గొరుకుచుఁ గఠినో
క్తులు బలుకుచుండు విటులన్
బలుకుట చేఁగాదె జనులు ♦ బంధింతురినున్ 37

క. కలరవమాదయఁ జూడక
పలుమరు గుడ్లాఱజేసి ♦ పలికెద వేలే
పలుగాకులు నీ గుడ్లన్
దలకొని చిదుముట నిజంబు ♦ తెప్పదు సుమ్మా 38

వ. అని దూషింపు చుండఁగా 39

క. అంతట రవిగ్రుంకిన నుడు
కాంతుం డుదయింప నతనిఁ ♦ గనుఁగొని దుఃఖా
క్రాంతయయి కాంత యిట్లనె
నంతంతకు విరహతాప ♦ మధికం బగుటన్ 40

క. ఇలవేల్పటంచు శశి నిను
దలఁతునె నాకింత వేడిఁ ♦ దార్కొనఁ జేయన్
జలమా నాపయి నీకిఁకఁ
జలువల రేఁడనెదు పేరు ♦ సార్థకమెల్లా 41

క. విరహిణుల వేచుట నెకద
పరికించియు దినదినంబుఁ బరమేశుఁడు నీ
కరములు తరుగుచు నుండెను
దరుగక యేయున్నఁ జెలులు ధరమునఁ గలరే 42

క. చలి నట్టటంచు విబుధులు
తెలియక పలియింతురయ్య దియె నిజమైనన్
జలముం గొని విరహిణులను
మలమల మాడింపఁగలవె మలయానిలమా 42

వ. అని చంద్రానిలంబుల నిందింపుచు

మ. ఇఁక నే నాటికి మా గృహంబునకు రాఁ డేమో కదా బావ కో
రికలీడేరఁగఁ జూచు టెట్లు నను దాఁ బ్రేమించు టెట్లా మన
మ్మిక వర్తా చేటిక నంపి దానివలన్ మా బావకున్ నేఁడు మా
మక విజ్ఞప్తిని దెల్పుకొందు నటుపై మద్భాగ్య మెట్లున్నదో

క. అని చింతింపుచుఁ దన చే
టిని బిల్చియు బావచెంగటికిఁ జని గని యా
ఘనునకు నిటువలె నా మన
విని దెల్పుమటంచుఁ దెల్పు విధి నెఱిఁగించెన్ 46

సీ. మాయమ్మ యరుదెంచి పోయినదాది నీ
మరిద లన్నము మానె దినము
పవలు రేలును నిద్ర బట్టక బావా య
టంచు సారెకుఁ బల్వరించుచునుము

విరహతాపంబును ♦ భరియింపఁజాలక
మెండుగా వగచుచు ♦ నుండుననుచు
ఆ చెలిన్ నీవు పెం ♦ డ్లాడక యుండిన
సత్యంబుగా మనఁ ♦ జాలదనుచు
గీ. సెనరుతోడను నిన్నుఁ జే ♦ కొనదనుచు
సతి రహస్యంబుగా వచ్చి ♦ యభయమిచ్చి
వేడుకలరఁగ మాటాడి ♦ వెళ్లుమనుచు
మొనసి పదివేలు సారులు ♦ మ్రొక్కెననుచు 47
క. నీ నేర్పు కొలఁదియేమే
మో నా విషయంబులన్ని ♦ యున్ బ్రియునకు సాం
పౌనటులఁ దెల్పి నా కే
ల్పొనఁగ నొనరింపుమనచుఁ ♦ బొమ్మని పంపెన్ 48
వ. ఇట్లంపి 49
— అచ్చాంబీ తన చేటిని సిద్దయకడకంపుట. —
ఆ ఇపుడు కొంతదూర ♦ మేగునప్పటికి మా
వారి యింటికడకుఁ ♦ జేరునిపుడు
బావతోడఁ జేటి ♦ భాషింపుచుండున
టంచుఁ దరుణి మదిఁ ద ♦ లంచుచుండు 50
గీ. అంతఁ జేటిక సిద్దయ ♦ చెంతకేగి
ఒంటపాటున నొకగది ♦ నుంటఁజూచి
నయభయంబులుఁ బెనఁగొన ♦ నతులొనర్చి
అమ్మ తమొలెక్కడు నుడుల ని ♦ ట్లనుచుఁ బలికె 51

క. అయ్యా నీమరదలు తన
నెయ్యుఁడు బెండ్లాడకుండు, వేని ధరిత్రిన్
జయ్యనఁ బ్రాణములన్ విడు
నెయ్యము గలదేని మాని నీ మనుపఁగదే 52

క. మరణించి నట్టి వానిని
కరుణించియు మనిచినట్టి ఘనుఁడవు నీకున్
మరణింపఁగఁ దలఁచిన యీ
తరుణిని మనుచుటొక లెక్క తాపసవర్యా 53

సీ. నిన్న నీ తలిపచ్చి చన్నది మొదలుగా
నీ మరదలు కూడు నీళ్లువిడిచె
నిదుర కంటికి లేక నిన్న మార్నిశలు సా
రకుఁ బ్రియాయని పల్వరింపసాగె
నీపైనిగల తమి నోపఁగాఁజాలక
డెందమందున నెంతొ కుందఁదొడఁగె
నెపుడు నా బావ యిం దేతెంచి ముదమందఁ
జేయునోయని నిరీక్షింపుచుండె

గీ. నలిశిపడుఁ దీక్షణముగను నిట్టూర్పుఁబుచ్చు
నెంత పిలిచినఁ బలుకదు సుంతయేని
కనులు విచ్చియుఁ జూడదు కాననీవు
వచ్చి చేపట్టి రక్షింప వలయునయ్యా 54

క. వనితామణి శడకేగియు
జననియుఁ జెలికత్తెలెన్ని సారులు బతిమా

లిన నన్నము మెసఁగదు వా
డిని గోష్ఠిలను తనువు పులక ♦ రించెన్ గాంచన్ 55

క. విలపించు నెవరుఁ బిలచినఁ
బలుకదు నిట్టూర్పుఁ బుచ్చుఁ ♦ బలుమరు దెసలన్
దిలకించు నుల్కిపడుఁ గడుఁ
బలవించు మహానుభావ ♦ బావాయనుచున్ 56

క. మహనీయుఁడ వగుటను నీ
మహిమను జూపించి దాని ♦ మాతా పితలన్
విహితులగు నట్లొనర్చియు
మహిళామణిఁ బెండ్లియాడి ♦ మనుపఁగదయ్యా 57

క. అన్నాతి నీవిటీవలఁ
గన్నాడవో లేదో కాని ♦ కనవలదే యా
యన్నుల మిన్నను మించిన
చిన్నెలుగల వన్నెలాడి ♦ క్షితిపైఁగలదే 58

చ. నెలను హసించు నెమ్మొగము ♦ నిర్మలమై తనరారునట్టి వె
న్నెలను హసించు హాసము గ ♦ ణింపఁగఁ బొంకముగాఁ దనర్చు కొ
న్నెలను హసించు నెన్నొసలు ♦ నీటుగ భాసిలుచుండు వేల్పుక
న్నెలను హసించు రూపముల ♦ నీరజగంధికి చెల్లునారయన్ 59

క. అచ్చాంబీ పిరుదులకెన

అచ్చాంబీ పిరుదు లెయున • నౌనయ్యారే
అచ్చాంబీ మధ్యమునకు
నచ్చాంబీ మధ్యమెసమ • మన నౌనారే 60

చ. కుదురగు లేమ ఫాలమున • కున్ సరిగావలెనంచుఁ గ్రొన్నెలన్
మొదట సృజించి పోలమిఁకి • మోమునకున్ సరిజేతునంచు నెం
పొదవఁగఁ బెన్నెలన్ సలిపి • యున్ సరిగామిఁ గృశింపఁజేసియున్
గుదరక సృష్టికర్త చెడ • గొట్టుచుఁ జేయుచునుండె నేటికిన్ 61

సీ. పైగేరి నొకయింటి • పడుచు నీ యెలనాగ
యందంబుచే సిగ్గు • నొందఁజేసె
దాని మూడవయింటి • దానిని బొమలచే
వంచె నాల్గవయింట • మించుదాని
జంఘలచే గుల్ల • సలిపె నైదవయింటఁ
గలదానిఁ జనులచే • వెలితిఁ జేసె
నాఱవయింటఁ జె • న్నారు దానిని గనుఁ
గవచేత వారిలోఁ • గలియఁజేసెఁ

గీ. బదనొకండవయింటను • బరగుదానిఁ
గానుచే నోరుఁ దెరిపెంచెఁ • గడమవాటి
నెదురఁ బనిలేదుగాని తా • నిద్దవయింట

దానికైనగాక నీకేలుఁ ♦ బూనఁదలఁచె 62

సీ. పోతమ్ము్రలింతిన ♦ డ్వన సరిపోలేక
పోలేక కనుఁగవన్ ♦ బోలనెంచెఁ
దారకాతతి నఖో ♦ త్కరతులగాలేక
కాలేకరదములన్ ♦ బోలనెంచె
మలయరాజము కుచం ♦ బుల సాటిరాలేక
రాలేకమైతావిఁ ♦ బోలనెంచె
నీట యీవరికైస్య ♦ నిభకాంతి నీలేక
యీలేక జంఘులన్ ♦ బోలనెంచెఁ

గీ. గాని సరిగాక తత్సతి ♦ కరుణనెనయ
వీఁసి తలపుష్పమై తూట్లు ♦ దొరసి గళక
లాపమై సాననరిగి మై ♦ లేపనము ను
పండితిన సన్నమైలోగి ♦ యుండెనహహా 63

సీ. ప్రహాసనేత్రోష్టముల్ ♦ రాకాబ్జ బింబముల్
రాకాబ్జబింబమే ♦ రమణిమోము
కచకుచనాభముల్ ♦ ఘనకోక నదములు
ఘనకోక నదము లు ♦ గ్మలి ప దములు
పురమధ్య వేణికల్ ♦ భూర్యభ్రి నాగముల్
భూర్యభ్రినాగమే ♦ పోలతి నడక
శ్రీవరద గ్రీవముల్ ♦ నవతారకంబులు
నవతారకంబులే ♦ నాతిగోళ్లు

ఆ. సౌరభ కటిభాగ ♦ సౌకుమార్యంబులు

చంపక కుసుమములు ♦ చంపక కుసు
మంబ నందనర్చ ♦ మానినీమణీనాస
ఔర యేమనందు ♦ నతివసాగసు 64

గీ కానుమా దృష్టి దోషంబు ♦ కతనసన్న
గిల్లె నండుౘ కుచాద్రిల ♦ క్రింద దృష్టి
సోకు నేయని సడిఁ దెల్ప ♦ శతృలకడకు
నేగవన నొప్పె నింతికి ♦ సోగకనులు 65

సీ. అతివ వక్షోజము ♦ లంటినచో నీకు
నచల భావంబెల్ల ♦ నర్థమగును
చెలిమోమునను మోముఁ ♦ జేర్చినచో నీకు
రాజయోగంబు సం ♦ ప్రాప్త మగును
సుందరి పల్గాట్ల ♦ నందినచో నీకు
తారకస్థితి యథా ♦ ర్థముగఁ దెలియు
చేగ వాతెఱను ము ♦ ద్దాడినచో నీకు
వరజపాధికత తా ♦ త్పర్యమగును

ఆ. భాసురాంగి పొందు ♦ జేసినచో నీకు
కోరికలర దాని ♦ కారణమున
నిరుప మానమైన ♦ పరిపూర్ణ సౌఖ్యంబు
లొందనగును సిద్ధ ♦ యోగిచంద్ర 66

ఆ. మోహనాంగి సుగుణ ♦ ములను గణింపవా
కృతికినైన వశము ♦ గాదుగాని
వెలఁది నింతికన్న ♦ వినఁగదే యొప్పుల

కుప్ప యనుట మేలు ♦ కోవిదాఖ్య 67

క. అని తెల్పిన విని సిద్ధయ
మనమున సంతోషవార్ధి ♦ మగ్నుండగుచున్
జనువొప్పఁగఁ జేటికకి
ట్లని పల్కె మనోజ్ఞ మంద ♦ హాసంబులతోన్ 68

క. వనితా నే నిపుడచటికిఁ
జనుదెంచఁగ నేల కన్న ♦ జననీ జనకుల్
పనిబూని వచ్చినను దో
డ్కొని చని బతిమాలి తమదు ♦ కూతురి నిడగే 69

— అచ్చాంబిని సిద్ధయ పెండ్లి యాడెదననుట. —

గీ. నాతి యిటు తొందరేల ము ♦ న్నాళ్ల కేను
శ్రేయసీరత్నమును జేరి ♦ పెండ్లియాడి
తోడుకొనిపోదు నీవార్త ♦ చేడెతోడఁ
దెలిపి వగపార్పుపొమ్మ శం ♦ కిలక లెమ్మ 70

ఆ. అనిన చేటియిట్టు ♦ లనెఁ దప్పననుచు నా
చేతిలోనఁ జేయి ♦ వేతువేని
వెడలి చేడతోడ ♦ నుడివెదననిపల్కి
సిద్ధయోగి నగుచుఁ ♦ జెలినిడాసి 71

క. తప్పను ముమ్మాటికి నా
యొప్పుల కుప్పకును వగపు ♦ నుడుగు మటంచున్
జెప్పఁగ నిఁక నేగవెయని
యప్పడఁతుక చేతిలోన ♦ హస్తము వేసెన్ 72

క. అంతటఁ జేటి గదుంగడు
సంతసమునఁ గన్నెకడకుఁ ♦ జని యచ్చటి వృ
త్తాంతంబంతయుఁ దెల్పినఁ
జెంతనఁగల చెలియ యొకతె ♦ చేటిక కనియెన్ 73

చ. వనితరొ నీదు భాగ్యమును ♦ వర్ణనఁ జేయఁ దరంబె కన్నెక
న్నను దాలి నిన్నె యాఘనుఁడు ♦ నట్టున గొంటిగఁ దీసె
నీమక
మ్మని నుడులాలకించె మరు ♦ మాటలు బల్కెను గేలు
బట్టె నీ
పనిని ముగించి పంపెనని ♦ పక్కన నవ్వెఁ జెలుల్ బళా
యనన్ 74

వ. అని పల్కిన చేటికతో మఱియొక చెలి యీసడింపుచు నిట్ల
నియె 75

క. అల మాన్యుని విషయంబై
నెఱఁతా యన్యార్థముల్ ధ్వ ♦ నించెదు సరసో
క్తులు బలుకరాదుబీబీ
కలుషంబొదవు ననుచుండఁ ♦ గాంచనీ యంతన్ 76

ఆ మూడునాళ్ల వరకు ♦ మోహనాకారు నా
వరాంపవశ్య నాను ♦ హానుభావుఁ
గనులఁ జూడకేట్లు ♦ మనదున హాయని
పడతి మూర్ఛనొంది ♦ పుడమివ్రాలె 77

క. అయ్యెడవెస కాశింబీ

లోయ్యాలి యరుదెంచి వగపు • తో నేర్పరితనా
నెయ్యఁపు రాలికి నిట్లనె
నయ్యారొయ్యా యేమిసేయ • నగుఁ బుత్రినిఁకన్ 78

ఉ. ఆదరమొప్ప నాసుతకు • నౌషధమెయ్యదియైన నీయఁగా
రాదె సఖీ యనంగ మక • రధ్వజ సేవనమైనఁ బూర్ణచం
ద్రోదయ సేవనంబఁయిన • నుగ్మలికిన్ బరితాపమున్
గడున్
బ్రోది నొనర్చుఁగాని సరి • పోయెడు మందొక డుండె
నీదగున్ 79

గీ. మలయ పవనంబుసోకిన • నలికిపమును
హెచ్చుగా సారె నిట్టూర్పుఁ • బుచ్చుచుండుఁ
గానఁ గామినికొక భిష • గ్వరునితోడ
వాత విధ్వంసి నిప్పించి • చూతమమ్మ 80

వ. అను చెలియతో మఱియొక చేటిక యిట్లనియె 81

క. శుద్ధములగు మందులు మా
బుద్ధికిఁదోచినటులెన్ని • పోసినఁ జెలి తా
పోద్ధతి తక్కువగా దిక
సిద్ధక్రియ వలనఁగాని • చెలిమనదమ్మా 82

వ. అనిన నచ్చాంబి యొకింత కదలి కనులు విచ్చి చూచు
చుండు నెడఁ గాశింబీతో నా చేటిక మఱియు నిట్లనియె 83

క. బోటీ సిద్ధక్రియ యను
మాటయె చెవి నాటినంత • మాత్రినె కనుఁలన్

దేటగను విచ్చిచూచు ని
కేటికి పెఱమందు లతివ ♦ కిచ్చుట యనినన్ 84

క. కాళింబీ లలనామణి
కాళ యొకింత జనియించి ♦ యలచేటిక సం
దేశమును వినఁగ వలెనని
పేశల వాక్యములనిట్లు ♦ ప్రియసఖి కనియెన్ 85

ఆ. చేటినీవుబల్కు ♦ శ్లేషార్థ వాక్యంబు
నందొకింత సంశ ♦ యంబు గలిగెఁ
జెలిమికత్తెవగుట ♦ సిద్ధక్రియ యనంగ
నదియొ తెల్పఁగదవె ♦ సదమలముగ 86

వ. అనిన కాళింబీ యువతికిఁ జేటిక యిట్లనియె 87

సీ. వినుమమ్మ నీపుత్రి ♦ వేయేల సిద్ధయన్
దటుకునఁ బెండ్లి యా ♦ డుటకు నెంచి
కూడునీళ్లును మాను ♦ కొని తపింపుచునుండెఁ
గాని వేరొక జబ్బు ♦ గలిగికాదు
కావున మీరలీ ♦ కాంతవరించిన
సిద్ధయకిడి పెండ్లిఁ ♦ జేయుటొప్పు
నదియె సిద్ధక్రియ ♦ యగునట్లుగాక మీ
దుహిత జీవించుట ♦ దుర్లభంబు

గీ. కాన నామాట దబ్బర ♦ గాదటంచు
నలరఁ దెల్పఁగ నల్లిఖా ♦ నటకువచ్చి
చేటిమాటల నాలించి ♦ చింతదోఁచఁ

దనయదరిఁ జేరి పిలిచి యి ♦ ట్లనుచుఁ బలికె 88

క. అమ్మా నిన్నొక ప్రభునకు
సమ్మతితో నిచ్చి పెండ్లి ♦ సలిపియు మీఁసౌ
ఖ్యమ్ములను జూఁడ నెంచితి
నిమ్మాడ్కిని బీదవాని ♦ నేటికిఁ గోరన్ 89

ఆ. ఎఱుఁగవేమొ సిద్దఁ ♦ డెన్న మతభ్రష్టుఁ
డరయ బీదవాఁడు ♦ దిరుగుఁబోతు
గాన వానిఁ గోరఁ ♦ గానేల హృదయమున్
మార్చుకొనుట నీకు ♦ మంచిదమ్మ 90

వ. అనినఁ గోపోద్దీపిత మానసయై యచ్చాంబీ తలోదరి తం
డ్రితో నిట్లనియె 91

క. మనభాగ్యమెంత తలఁపఁగ
మనమెంత యశోవిశాలు ♦ మాన్యు మహాత్మున్
ఘనునిటులఁ దెగడ నీకున్
జనునే యీపుణ్యపురుషు ♦ చరితలు వినియున్ 92

సీ. కడప నవాబు చెం ♦ గట రాతికి సలాము
బెట్టి వ్రక్కలుఁజేసి ♦ సట్టి ఘనుఁడు
తనను దోచుకొన వ ♦ చ్చిన తలారులకును
వ్యాఘ్రములనుజూపి ♦ నట్టి ఘనుఁడు
సర్ప దష్టుఁడయి ♦ సమసిన రెడ్డిని
బట్టుగా బ్రతికించి ♦ నట్టి ఘనుఁడు
అడవిని బులినోటఁ ♦ బడిన గిడ్డిని గ్రాను

మందుండె మనిచిన ♦ యట్టి ఘనుఁడు
గీ. తనియ మామేన బావయే ♦ యనుచు వినమె
అట్టి పుణ్యుని నీవు ని ♦ రాదరముగ
నరసి నిరసించి నంతనే ♦ యల్పుఁడగు నె
వేయు నేటికి నతఁడె నా ♦ విభుఁడు తండ్రి 93
క. అనవిని కాశింబీ నిజ
తనయన్ గని యిట్టులనియెఁ ♦ దండ్రి సమ_క్తిన్
వినవలయుఁగాని నిరసిం
చిన నిన్నుఁ గాంచి తోడి ♦ చెలువలు నగరే 94
క. బాబునకు నిన్నుమంచి న
బాబున కీయవలెనంచు ♦ భ్రమగల దీవా
బాబునకిటు లిడు నెదురు జ
బాబున కే మనఁగవలయు ♦ బాలానిన్నున్ 95
వ. అనినఁ గన్నతల్లికి నచ్చాంబీ యిట్లనియె 96
గీ. తల్లిరో మీరలిట్లు వృ ♦ ధా ప్రసంగ
ముల నొవర్చిన సుంతేని ♦ ఫలములేదు
సిద్ధయోగికి నిడి పెండ్లిఁ ♦ జేయరేని
ప్రాణములు వీడుదాన నీ ♦ పాదమాన 97
క. అనివల్కిన సుతశపథం
బునువిని తలిదండ్రులపుడు ♦ పుత్రికనల సి
ద్ధనికీక తప్పదిఁకఁ జ
య్యన వానిన్ సంస్కరించి ♦ యైన నటంచున్ 98

గీ. కూతురా నిన్ను సిద్దయ ♦ కునిడిసరగఁ
బెండిలి నొనర్తు మింక లేచి ♦ తిండిఁదినుము
తథ్యమీమాట నమ్ముము ♦ తప్పుమనిన
జననితోఁ బ్రియపుత్రి యి ♦ ట్లనుచుఁ బలికె 99

సీ. అమ్మరోమీరు మా ♦ యత్తవారింటికిఁ
జేరి వారిని మంచిఁ ♦ జేసికొనియు
నన్ను మాబావకుఁ ♦ జెన్నుగానిడి వివా
హముఁ జేయుసట్టి ల ♦ గ్నముసు దెలిపి
మాయత్తనిటకు స ♦ మ్మతిని దోడ్కొనివచ్చి
నటులైన నామె న ♦ న్నాదరించి
అన్నంబుఁ దినుమన్న ♦ నారగింతునుగాని
లేకున్నఁ దిననిట ♦ లేండటంచుఁ

గీ. గసరు కొనినంతనే యింకఁ ♦ గాదటంచు
రయముగా వారలిద్దరు ♦ బయలుదేరి
పీరు సాహెబు కెంకికిఁ ♦ జేరితొలుత
నెట్టఁ బడినట్టి యామెతో ♦ నిట్టులనిరి 100

క. అమ్మా మానేరమ్ముల
నెమ్మనమున నుంచుకొనకు ♦ నీ సుతునకు మా
యమ్మాయినీక యొరులకు
నెమ్మాడ్కి నొసంగుదుము బు ♦ ద్ధిందు ప్రిలునగరే

{ అచ్చాంబీని సిద్దయకు చేసుకొమ్మని
తలిదండ్రులు బతిమాలుట }

ఆ. అనిన తత్క్షణంబె యావంబి కినుకతో
వదిన కిట్టులనుచు బదులుఁ బలికెఁ
జాలుఁ జాలు నీకు సాంగత్య మొకనాఁగె
తెలిసి పోయెనమ్మ వలదు పొమ్మ 102

సీ. కులము వారెల్లరు వెలివేసినట్టి మా
వానిఁ బుసకు నెట్లు వచ్చితమ్మ
ధనికురాలవుగదా పెను బీదవారితో
వియ్యమే విధముఁ గా వింతువమ్మ
తిరుగఁబోతగు నాకా మరునకు నీముద్దు
పుత్రిక నెటులీయఁ బూనితమ్మ
మాయలాడిని జేరి మాటలాడుటకు నీ
కిప్పుడెట్టుల స్వాంత మొప్పెనమ్మ

గీ. నిన్న నేకద మాయింట నన్ను మిగులఁ
దూలనాడుచు మెడఁబట్టి త్రోసినావు
మనమునందింతలో నెట్లు మరచితమ్మ
నీ మొగముఁ జూడదగదిట్టు నిలువకమ్మ 103

క. అనవిని కాశింబీ మా
నిని నా నేరంబులను క్ష మింపుమనుచు గొ
బ్బున నాదంబీ పదయుగ
మును గైకొని నుదుటఁ జేర్చె బోరన శేడ్చెన్ 104

క. అట్టిమెడఁ బీబుసాహే
బిట్టులనియె భార్యతోడ నింతి నిన్నున్

నెట్టిన కరములె పదములఁ
బట్టెన్ క్షమియించుటొప్పు ♦ వదినను బేర్మిన్ 105

క. మీవదిన బాష్పధారలఁ
దావక పదములను గడిగి ♦ తనదు వదన రా
జీవమ్మునఁ బూజించుచుఁ
గావుమనుచు వేడుచుండెఁ ♦ గరుణింపఁగదే 106

వ. అని పలుక వల్లభుననునయోక్తుల కెంతయు నాదంబీ శాంతించి పదంబుల వ్రాలిన వదినన్ లేవఁదీసి నిన్నున్ జూడకున్నను నాగాదలి కోడలి నైనన్ జూడవలయును గదా మన్నించితి నీకుఁ గర్తవ్యం బాలోచింపుడని పల్కిన యాదంబీతోఁ గాశింబీ యిట్లనియె 107

ఆ. నిన్న నీవువచ్చి ♦ చన్నది మొదలు నీ
కోడ లింతవరకుఁ ♦ గూడు నీళ్లు
ముట్టదాయె నెంత ♦ పట్టుగలదియొ కాని
ఏమిసేతుఁ జిష్వర ♦ కిట్టులనియె 108

సీ. అకలంక దరహాసి ♦ తాస్వాబ్జవైనీవు
రాణమాయింటికి ♦ రావలెనఁట
తనను సిద్ధయకిడి ♦ తగ వివాహ మొనర్చ
లగ్నమున్ నీవె తె ♦ ల్పఁగవలెనఁట
దిగులేల నీకోరిక ♦ దీరె నన్నంబును
దినుమని నీవన్నఁ ♦ దినఁగలదఁట
ఇంతకుఁదప్ప వే ♦ రింకొక విధమున

నీ కోడలన్నముఁ ♦ గైకొనదఁట

గీ. కాన నీకోడలికి సమా ♦ ధాన మిఁపుడుఁ
జెప్పి యన్నముఁ దినిపించి ♦ శీఘ్రముగను
మరల వత్తువుగాని మా ♦ మందిరమున
కరుగు దెంచఁగదమ్మ జో ♦ హారులమ్మ 109

క. అనవిని యాదంబీ మా
నిని యిట్లనె లగ్నమెపుడొ ♦ నిశ్చయమును జే
యని దెటులఁ దెల్పవలెననఁ
గనుఁగొని తత్క్షణమె యల్లి ♦ ఖా నిట్లనియెన్ 110

క. ఆలస్య మేల యెల్లుం
డే లగ్నమటంచు నిశ్చ ♦ యించియుఁ దెలుఁపన్
మేలానాడే చేతము
చాలా మంచిదని పీరు ♦ సాహెబనియెన్ 111

క. అనఁగని యల్లీఖాని
ట్లనె బాబా చిన్నమనవి ♦ పాలింపుము సి
ద్ధని మతసంస్కారముఁ జే
సిన మీఁదటఁ బరిణయంబుఁ ♦ జేయఁగనొప్పున్ 112

క. మన మొకరికిఁ జెప్పఁగ నే
ర్చిన వారము మనకుఁ బరులుఁ ♦ జెప్పఁగ వలెనే
మును సిద్ధని సంస్కారం
బురు నొనరించియు వివాహ ♦ మున్ జేతమనన్ 113

గీ. మంచి దట్లైన సిద్ధయన్ ♦ గాంచినీవు

తెలుపు మేమనునో యని ♦ తెలిసిపోవు
ననిన వల్లే యటంచు సి ♦ ద్దయను జేరి
యల్లిఖా నిట్టులనియెఁ దీ ♦ యనగు నుడుల 114
గీ. సిద్దయానీవు వీరదే ♦ శికుని మతముఁ
జేకొనినదాడి మనకుల ♦ శ్రేష్ఠులెల్ల
నైచ్యముగ మిమ్ముఁ జూచుచు ♦ న్నారు గాన
సంస్కరింతుము నినుగుల ♦ సమ్మతముగ 115
ఆ. కులము వీడినట్టి ♦ కోతియు వనమును
వీడినట్టిపక్షి ♦ వెలయదనుచుఁ
బెద్దలనఁగ వినమె ♦ సిద్దయాధాత్రి నీ
వెఱుఁగనట్టి ధర్మ ♦ మెందుఁగలదు 116
క. అనిపల్కు నల్లిఖానుఁ
గని సిద్దయ నగుచు నిట్లు ♦ గా వచియించెన్
నను సంస్కరింపఁ గలిగిన
ఘనులుండిన సంస్కరింపఁ ♦ గానగు మామా 117
ఆ. మేనమామమాట ♦ మీఱరాదని బుధు
లందురుగానఁ దావ ♦ కాజ్ఞ మీఱ
నటులె సంస్కరింప ♦ నగుననంగీక
రించెననుచు సంత ♦ సించి మఱియు 118
వ. పీరుసాహేబున్ గాంచి బావా యెల్లుండి సాయంతనంబు
నఁ దమ సన్నిధానంబునకు వాటంబులగు ఘోటంబులను
బచ్చడంబుల సమర్చిన కచ్చడంబులను బంపించెద నకు

టుంబ బంధు మిత్రులందఱై విచ్చేయుడు వెంటనే పెండ్లి
కుమారున్ సంస్కరించి సాలంకృత కన్యాదానంబుగా
వింతు నీక మీయత్నంబున మీరలుండుఁడని తెల్పి తన
చెల్లెలగు నాదంబీని తోడ్కొని యింటికేతెంచి యంతనే
కోడలిన్ గాంచి యాదంబీ యిట్లనియె 119

గీ. కోడలా నిక్కముగ నీకు ♦ కోర్కె దీర
నలర నెల్లుండియే లగ్న ♦ మగును గాన
సిద్ధయోగికి భార్యవై ♦ చెలఁగఁగలవు
దిగులువిడి లేచి యన్నంబుఁ ♦ దినుమటన్న 120

క. అత్తా యన్నము నిర్భర
మిత్తరి నొక పళ్ళెరమున ♦ నే తినవలె నీ
చిత్తమును దెల్పుమన నా
కొత్తడి వల్లే యటంచుఁ ♦ గోడలి కనియెన్ 121

క. అత్తరిఁ గాశింబీ యొక
పుత్తడి పళ్లెమున నన్న ♦ మును బెట్టిన నా
యత్తయును ముద్దుకోడలుఁ
బొత్తున గూర్చుండి తినిరి ♦ ప్రమోదమునన్ 122

క. తదుపరి నాదంబీ సతి
సదమలముగఁ బెండ్లికనులు ♦ సలుపఁగ వలెఁ బో
యెదనని కోడలి కన్నకు
వదినకుఁ జెల్పియును నిజ ని ♦ వాసముఁ జేరెన్ 123

వ. అంత నల్లీ ఖానిల్లు జాజు సున్నంబులతో నలంకరింపఁ జేసి

భోజన పదార్థంబులును జల్తరు కట్టు పుట్టంబులును పరి
మళద్రవ్యంబులును మణిమయ సువర్ణ భూషణంబులను
తెప్పించి సిద్ధయుఁ సంస్కరించి వివాహంబున్ జేయుచు
న్నారమని బంధుమిత్రాదులకు శుభలేఖలంపించి వేదవే
త్తలగు నిర్వర ఖాజీలన్ బిలిపించి సిద్ధంబుగా నుండఁగా
నచ్చట బీరుసాహేబల్లీ పెండ్లిపనులన్నియు నెరవేర్చుకొని
శ్రీమత్కందిమల్లాయపల్లె యందున్గల గురుదేవియగు
గోవిందమాంబా నికటంబునకుఁ బ్రకటంబులగు శకటం
బులనంపి సకుటుంబముగా రావించి యల్లే పల్గురాళ్లపల్లె
గోవిందస్వామి తిమ్మారెడ్డి మున్నగు మిత్రమండలిని బిలి
పించుకొని పౌరజన యుక్తంబుగా సిద్ధపడి యుండు నెడ
ముహూర్తంబునాటి సాయంకాలంబున నల్లీఖాను పెండ్లికు
మారున్ దోడ్కొని వచ్చుటకు శకటతురంగాందోలికల
నంపింపఁగా నా సమయంబున 124

క. అక్షయముగ నుదుటన్ గం
ధాక్షతలన్ దాల్చి స్ఫటిక ♦ హారంబుల రు
ద్రాక్షల మాలికలు మెడన్
గుక్షిన్ వ్రేలగను బెండ్లి ♦ కొడుకు ధరించెన్ 125

ఆ. సంస్కరించునట్టి ♦ సమయంబునన్ బొట్టుఁ
బెట్టి మెడన సరులు ♦ వేసె నితఁడు
చివర దర్శనంబు ♦ లివియె పో యనియేమొ
యనుచు నెంచుచుండి ♦ రఖిలజనులు 126

సీ. బంధుమిత్రులయందు ♦ బండ్లపైఁ గొందరు
నందలంబులఁ గొంద ♦ రరుగుదేరఁ
గొందరు యువకులు ♦ గొనబు దుస్తులుదాల్చి
పదచారులై వేడ్క ♦ బయలుదేర
లలిత మంగళతూర్య ♦ ములను వాయింపుచు
గడుసొంపుగా మేళ ♦ గాండ్రు నడువ
ముంగిళ్లయందున ♦ ముత్తైదువులు మహా
నీయు దర్శింపఁగా ♦ నిలిచియుండ
గీ. పెండ్లికొడుకయి సిద్దయ ♦ ప్రియమెలర్ప
శుభ్ర తురగంబుపైనఁ గూ ♦ ర్చుండి సొగసు
మీఱ నూరేగుచును దన ♦ మేనమామ
భవనమునకును జేరె సం ♦ బరముతోడ 127

క. చేరిన వారలనెల్లర
గౌరవ మొనరించి యల్లి ♦ ఖానచట సభన్
దీరిచి సిద్ధయనొగి సం
స్కారముఁ జేయుటకుఁ బిలిచె ♦ ఖాజీయుగమున్ 128

— సిద్ధయోగిని సంస్కరింపఁ బూనుట —

క. ఇరువురు ఖాజీలచ్చటి
కరుదెంచి మహాత్ము సిద్ధ ♦ యన్ సభయందున్
దిరముగఁ గూర్చుండ నొన
ర్చిరి పెద్దలమనుచు సంస్క ♦ రించెడి కోర్కెన్ 129

క. యుక్తములైన ఖురాన్ సం

ప్రోక్తములగు మంత్రములు మ ♦ హోద్ధతితో నా
వక్త్రలు నుడువుచు జలమను
రక్తిన్ బ్రోక్షించిరా చి ♦ రంజివి పయిన్ 130

క. ఒక బాజీ సిద్ధయు నె
మ్మొకమున భాసిల్లు తిలక ♦ మున్ నుడుచును వే
ఱొకఁ డబుతన్ గల జపమా
లికఁ దీయున్ గాని పోవు ♦ లేశం బైనన్ 131

క. అలికమున బొట్టుఁ దుడిచినఁ
దొలుతటిగతి మొలుచు మరలఁ ♦ దుడుచున్ మొలుచున్
గళమునఁగల సరిఁదీసినఁ
దిలకింపఁగ వెలయు మరలఁ ♦ దీయున్ వెలయున్ 132

ఆ. బొట్టుఁదుడిచి తుడిచి ♦ పోకున్న నొకరుండు
విసికి కూరుచుండె ♦ వేఱొకండు
దండఁదీసితీసి ♦ తరుగక వేసారి
అలసి కూరుచుండె ♦ నతని సరస 133

ఆ. కూరుచుండి పండ్లు ♦ నొరుకుచుఁ గనులెఱ్ఱ
జేసి యా తపోవి ♦ లాసుఁగాంచి
కులములోనఁ గల్గు ♦ కొన పీలు లేదు నీ
వరుగు మిచటఁ జెల్ల ♦ వనుచునుండె 134

చ. ఖలుఁడగు దుస్ససేనుఁ డలు ♦ కన్ ద్రుపదాత్మజ చేల మున్ సభా
స్థలి విడిపింప మొల్చెనని ♦ సత్కవు లంట యొకాని చూడ మిం

పంరఁగ నీమహాత్మ్యతిల ♦ కాదులు మొల్చుటఁ గంటి
మంచు భా
సిలఁగాని యాడుచుండిరల ♦ సిద్ధయ నందునఁ గొంద
రయ్యెడన్ 135

క. కొని యాడెడు జనులన్ గనుఁ
గొని ఖాజీలనిరి పెండ్లి ♦ కొమరుఁడు నేడున్
గనుకట్టునేర్పుఁ జూపుట
మనకట్టులఁ గానుపించు ♦ మాన్యండగునే 136

క. వీరబ్రహ్మము చెంగట
గారడి నేర్చుకొనియిట్లు ♦ గా నొనరిచె నీ
కూ్రరాత్మునకిఁకను బహి
ష్కార మిడితి మనుచు నల్లి ♦ ఖానున్ గనియున్ 137

ఆ. కొలము పెద్దలనుచుఁ ♦ దల్చపక మము ధిక్క
రించి నేఁడు సంస్క ♦ రింపఁబడక
ఇంద్రజాలమును ర ♦ హింపఁ జూపెను గానఁ
బిల్లనీయవలదు ♦ వీనికనిరి 138

—ఖాజీలు పరాభవ మొందుట.—

క. అనవిని సిద్ధయ నవ్వుచు
మొనసి మదీయేంద్ర జాల ♦ మునొకింత గనుం
గొనఁ జేసెదఁ గనుఁడని చ
య్యన ఖాజీల భుజములను ♦ నంటుల్లయనెన్ 139

క. ఈపెండ్లి కేల వచ్చితి

మేపగిదిన్ మాగృహాముల ♦ కేగఁగవలయున్
మా పడతులతోఁ జేరియుఁ
గాపుర మెట్టుఁజేతుమనుచు ♦ ఖాజీలేడ్వన్ 140

ఆ. అనిన నొకని బాహు ♦ వునకు వేరొకని
బాహు వంటుకొనియు ♦ భయముఁజెంది
అకట యేమిసేతు ♦ మల్లాయనుచు గుంజు
లాడుకొన్న భుజము ♦ లూడిరాక 141

క. అత్తరి సిద్దయ చెంగటి
కత్తయు మామ జని ధర్మ ♦ మాయిటు జేయన్
మెత్తురె నిను జనులన మా
యత్తకు మామకును భుజము ♦ లంటుల్లయనెన్ 142

సీ. అనినంతనే వారి ♦ కటులె బాహువులంటు
కొని యెంతగా లాగి ♦ కొన్నరాక
కడువడి వారలున్ ♦ ఖాజీలు నిర్వురున్
సిద్దయపదములఁ ♦ శిరములొగ్గి
మొ్రుక్కుచు నోదేవ ♦ మూఢులమగుమమ్ము
కాపాడ నీకన్న ♦ ఘనులు లేరు
నీ ప్రభావ మెఱుఁగ ♦ నేరక నిను పంసక
రింపఁబూనితిమి తప్ ♦ మింపుమయ్యా
బుద్ధివచ్చెనుగాన మా ♦ భుజములికను
వీడునట్లుగ నేడు గా ♦ వింపుమయ్య
నీ మనోభీష్టముగను గ ♦ న్నియను బెండ్లి

యాడఁగాఁదగునయ్య జో ♦ హారులయ్య 143

క. అని వగచుచు వినుతించినఁ
గనుఁగొని సిద్ధయకుఁ గరుణ ♦ గల్గి జలంబుల్
గొని వారలపైనన్ గొ
బ్బున నభిమంత్రించివైవ ♦ భుజములు వీడెన్ 144

క. అంతటను వారలెంతో
సంతసమున లేచి యోగి ♦ సత్తమ నీ వృ
త్తాంతమును దెలిపియును మె
ప్పింతుము కులజులనుగన్నఁ ♦ బెండ్లాడఁగదే 145

క. అలర నిను సంస్కరింపఁగఁ
దలకొని నీవలన మేమె ♦ ధరణీస్థలి భా
సిల సంస్కరింపఁ బడితిమి
తలఁపఁగ మాభాగ్యమెన్నఁ ♦ దరమె మహాత్మా 146

క. అన మఱియున్ దగువారలఁ
గనుఁగొని యిట్లనిరి మీరు ♦ కన్యావరులన్
దనర నలుగులిడి స్నాతుల
నొనరుచు కొని తెండు వెస ము ♦ హూర్తమునకనన్ 147

ఆ. కడిమి వారలట్లు ♦ కావించుకొని తలఁ
బ్రాలు బోసుకొనెడు ♦ భవనమునకుఁ
బెండ్లికొమరు మఱియుఁ ♦ బెండ్లికూతునుదోడి
తెచ్చిరుత్సవమున ♦ ధీరుడెన్న 148

క. అచ్చట నంతకుమున్నే

పచ్చడమును బరచి దాసి • పైనఁ దివాసిన్
ముచ్చటగ వేసియుంచిన
నచ్చోఁ గూర్చుండఁ బెట్ట • రల సిద్ధార్యున్ 149

గీ. అంతఁ జెలికత్తియలు సిద్ధ • యార్యసరసఁ
బెండ్లికూతును గూర్చుండఁ • బెట్టఁబోవ
నెట్టుకొని యావలికివచ్చి • నిలుచుఁగాని
సుదతి సిద్ధయ సరసఁ గూ • ర్చుండదాయె 150

సీ. మాతాపితల నవ • మానించెనని యల్గి
సిద్ధయోగిని విస • ర్జించె నొకొ
ఐంద్రజాలికుఁడితఁ • డగును వన్నెపుడైన
వచించునని త్యజి • యించెనొకొ
సంస్కరింపఁగ నీక • చతురతఁజూపిన
దుర్వ్రతుండని • తొలఁగెనొకొ
బీదవాఁడగు వీనిఁ • బెండ్లియాడిననన్నుఁ
బోషింపలేడని • పోవునొకొ

గీ. లేనిచో తానకోరిన • మానితాంగు
సరసఁ గూర్చుండుటకు నేల • సంశయించు
ననుచు నెవరికిఁ దోచిన • యటులవార
లనుకొనుచు నుండిరల కన్ని • యను గుఱించి 151

క. ఆవేళన నాదంబీ
గోవిందమ లేగుదెంచి • కోడలితో వా
రీవిధమున వచియించిరి

నీకిటు లొసరింపనగరె ♦ నెలతుక లెల్లన్ 152

గీ. అరయ సిద్ధయ మహితాత్ముఁ ♦ డని యెఱింగి
కూర్మినాతని సరసనఁ ♦ గూరుచుండ
సంశయింతు వదేల వి ♦ స్పష్టముగను
దెలుపుమనఁ జెండ్లికూతురి ♦ ట్టుల వచించె 153

క. మరణించిన యతఁడీఘను
కరము తగులలేచివచ్చెఁ ♦ గద తుత్రిప్పుడు చేఁ
బరగిన తివాసి యీయన
కరము తగుల నాపయిన్ మె ♦ కంబయిపడదే 154

క. అనవిని వారలు నవ్వుచు
వనజాక్షీ సిద్ధయోగి ♦ వర్యుఁడు మనమం
దునను దలంపక యేతీ
రునఁ గేల్ సోకినఁ దివాసి ♦ తుత్రిప్పుడు మెకమా 155

ఆ. అబల యెన్నఁడైన ♦ నపకారమును మేము
సలుపమనుచు నీకుఁ ♦ దెలియునుగద
సంశయంబువీడి ♦ చనుమన వరుని చెం
గటను గూరుచుండెఁ ♦ గన్యయపుడు 156

... అచ్చాంబీకి సిద్ధయోగి నల్లలు గట్టుట ...

సీ. వీనులకింపుగా ♦ వివిధమంగళతూర్య
ములు ప్రతిధ్వనులీన ♦ మొరయుచుండ
రాణింప ఖాజీల్ ఖు ♦ రాన్పోక్తి మంత్రంబు
లిరువైపులను వచి ♦ యింపుచుండ

గోవిందులిరువురు ♦ గొనబు ఘటిల్లఁగా
సామగానంబులు ♦ సలుపుచుండ
ప్రవిమల కల్యాణ ♦ భవనమెల్లెడలఁ గ్రి
క్కిఱిసి జనాళి వీ ♦ క్షింపుచుండ
గీ. బుధజనంబులు మిగుల ను ♦ ప్పొంగుచుండఁ
జిరత రామోద కలితుఁడై ♦ సిద్ధయోగి
పేర్మి దళుకొత్తఁగా నల ♦ పెండ్లికూతు
గళమునందున నల్లలు ♦ గట్టెనహహా 156
క. ధృతి నాదట నానవదం
పతు లొండరు లపుడు శీర్ష ♦ భాగంబులపై
నతులితముగఁ దలఁ బ్రాలన్
హితమొప్పఁగఁ బోసికొనిరి ♦ హితులు గణింపన్ 157
వ. అంత నచ్చటి కాంతలెంతయు సంతసించి ప్రధాన గృహం
బునఁ జాన్పు వైచి యా నూత్న దంపతులన్ దోడ్కొని
పోయి వాకిట నడ్డగించి సిద్ధయోగీంద్రా నీ ధర్మపత్ని నా
మం బెఱింగింపుమను పేరఁటాండ్రకు దరహాసిత వదనార
విందుండై యా కోవిదుండిట్లనియె 158
క. యువతీ రత్నములారా
ప్రవిమలముగ మీకు నాదు ♦ భార్యాభిఖ్యన్
వివరించెద నాలింపుడు
అవర్ణ ముఖయగును నామ ♦ మరయంగదరే 159
వ. అనిన యంతనే సిద్ధయోగీంద్రుండెందులకో యవర్ణముఖ

యని కొత్త నామంబిడెనను వారును మఱియు నట్లు కా
నవర్ణ ముఖి యనఁగాఁ గళావిహీనమగు ముఖముగలదని
పరిహాసముగాఁ బల్కినను వారునైయుండఁగా నందు
నొకతొయ్యలిచెలులారా పెండ్లికూతు రచ్చాంబీయగుటచే
అకారము ముఖాక్షరమై యున్నందున నవర్ణముఖి యని
తెల్పెననిన యంతనే సిద్ధయోగీంద్రుని పాండిత్యమునకును
భావం బెఱింగించిన చెలినేర్పునకును గాంతలెంతయు
సంతసించి మఱియు నచ్చాంబీ నిఁక నీ వరుని నామం బె
ఱింగింపు మట్లెఱింగింపవేని మూగిపిల్లలు బుట్టెదరనిన నా
వధూరత్నంబు ముసిముసి నవ్వుతోఁ దెల్పందొడంగె నది
యెట్లన్నను 160

క. జాంబూనద ముకురక్షీ
రాంబుధి వేశ్యల సమాహ్వ • యంబులను దిగ్వ
ర్ణంబులుగ వ్రాసి నడివ
ర్ణంబులు గైకొన్న నాదు • నాథుని పేరౌ 161

వ. అనిన విని యా చెలువ లీ భావంబంతకన్న నెక్కుడుగాం
భీర్యంబుగా నుండెనని యెఱుంగన్ జాలక యోజించుచుం
డఁగా నందున నొక సుందరీమణి చెలులారా జాంబూనద
ము, ముకురము, క్షీరాంబుధి, వేశ్య, అను శబ్దంబులకు
వరుసగా మూడక్షరములుగల యర్థములు, పసిడి, అద్ద
ము, పయోధి, భోగిని, అని యుండినందున నీశబ్దములలో
నడిమి యక్షరములను దీసుకొనినచో సిద్ధయోగియని వ

చ్చును. గావున నచ్చాంబీ వరుని నామంబెఱింగించె ననిన
యంతనే భావగర్భితంబుగా విభుని నామంబున్ దెల్పిన
పెండ్లి కూతురి నైపుణ్యంబునకును సాంకేతిక భావంబున్
గుర్తించి తెల్పిన చెలిసేర్పునకును బేరంటాండ్రెంతయు
సంతసించి యట్లుకాదీ పాన్పుపైఁ జేరవచ్చిన దెవరెవరో
నామంబులు విస్పష్టంబుగాఁ జెల్పకుండిన మిమ్ముఁ బోనీ
యమని యా నూత్న దంపతుల నాటంకపరుపఁగా నా వ
ధూవరులిట్లు దెల్పం దొడంగి రది యెట్లన్నను 162

క. అచ్చాంబీ నేన్ శయ్యకు
వచ్చితిమని మెల్ల నగుచు • వరుఁడనఁగనె నేన్
ముచ్చటగ సిద్దయోగియు
వచ్చితిమని వధువుబల్కె • వనితలు మెచ్చన్ 163

వ. అంతన్ గాంతలా దంపతులన్ బాన్పున్ జేర్చి పెండ్లిపాట
లన్ బాడుచు వేడుకలఁ జరిపి నాటి కార్యక్రమంబులన్
ముగించి మఱియు రెండు దివసంబులట్లే వేడుకలన్ జరిపిన
తదనంతరంబునఁ గాశింబీ యల్లిఖాను లావధూవరులకు
మంచంబులన్ గంచంబులఁ బేటికలన్ జేటికలఁ గచ్చ
డంబులఁ బచ్చడంబులన్ మఱియు నానావిధ వస్త్రభూ
షణ వస్తుజాలంబుల నర్పించి మహోత్సవంబున్ జేయుచు
సాగనంపఁగా నా సిద్దయోగీంద్రుండు సపరివారుండై
స్వగృహంబునకున్ జేరి బంధుమిత్రాదులన్ మూడుదినం
బులు నిల్పుకొని మాతృయుక్తులగు గురునందనుల క్షాక్షే

యాంబర దక్షిణ తాంబూలాదులతో నర్చించి తక్కుం గల వారల నర్హ రీతిన్ సత్కరించి పంపించి భార్యాయుక్తుండై సుఖస్థితి మెలంగుచుండఁగా 164

క. కఠిన శిలాంచిత మండప
జఠరాలయ గోపురము లె ♦ సంగెడు గతిఁగ
ర్మఠులగు నా పురిజనములు
మఠమును గట్టించి రైదు ♦ మాసంబులకున్ 165

గీ. ఇటులఁ గట్టించి సిద్ధయో ♦ గీంద్రునకును
దెలిపి మఱి యిట్టులనిరి భా ♦ సిల మఠమున
రక్తి నినుగురు పట్టాభి ♦ షిక్తుఁజేయ
నెంచితిమి లగ్నమును నిశ్చ ♦ యింపు మనిన 166

— సిద్ధయోగికి గురుపట్టాభిషేకము జేయుట —

క. నాలుగు దివసంబుల కను
కూలముగా నుండుననుచుఁ ♦ గూరిమినాధీ
శాలి వచియింపఁగా వా
రాలాగే యనుచుఁ దగు ప్ర ♦ యత్నముఁ జేయన్ 167

గీ. సిద్ధయోగీంద్రుఁ డంత వి ♦ శిష్ట సాధు
శేఖరుల కాప్తులకు శుభ ♦ లేఖలంపి
కందిమల్లయ పురిగురు ♦ నందనులకు
శకటముల నంపి రప్పించె ♦ సుకరముగను 168

వ. తదనంతరంబునఁ బట్టాభిషేక ముహూర్తంబునాడు ముదుమాఁ పురంబున మహాత్ముని బంధుమిత్ర జాలంబులును

బల్లురాళ్లపల్లె గోవిందస్వామి తిమ్మారెడ్డి మున్నగు భక్త
సంచయంబులును లెక్కింపరాక చిక్కటంబుగా నెక్క-
డఁ జూచినన్ గిక్కిఱిసి యుండఁగా నా ముహూర్తం
బునకు 169

సీ. సిద్ధయోగియుఁ దన ♦ చెలియుఁ బన్నిట న
భ్యంజన స్నానము ♦ లాచరించి
పట్టుపుట్టములను ♦ బసిఁడి సొమ్ములుదాల్చి
మహితోత్సవంబుతో ♦ మఠముఁ జేరి
విబుధానుమతమునఁ ♦ బీఠ మధిష్ఠించి
లలితమంగళ తూర్య ♦ ములు సెలంగఁ
బోతులూరయ పవిత్ర ♦ ములు వచింపుచునుండ
సాధువర్గేణ్యుల ♦ నుతులు సల్ల
గీ. నాగమోక్షుల గోవింద ♦ యార్యులమృత
కలశమున్ బూని శీర్ష భా ♦ గంబునందుఁ
జెలువలర ధార వోయఁగా ♦ సిద్ధయోగి
శ్రీమహాగురు పట్టాభి ♦ షిక్తుఁడయ్యె 170

వ. అంతన్ భక్తజనంబులు సిద్ధయోగీంద్రునకుఁ బదపూజ లొనర్చి కట్నంబులు సమర్పించి గురుపూజ పరిసమాప్తంబైన యంతనే మూడుదివసంబు లన్నప్రదానంబుఁ గావించి గోవిందాచార్య పోతులూరాచార్యులను వస్త్రదక్షిణ తాంబూలాదులతో నర్చించి మఱియుఁ బూజ్యులగువారలను దక్షిణ తాంబూలాదులతో సత్కరించి సాగనంపిన

తదనంతరంబునఁ బల్లుర్లాళ్లపల్లె నిలయుండగు గోవిందస్వామియను విప్రపుంగవుండొకనాడు సిద్ధయోగీంద్రున్ దర్శించి యిట్లనియె 171

{ గోవిందస్వామి యను విప్రుఁడు సిద్ధయోగిని గురునిగాఁ గైకొనుట }

ఆ. సిద్ధయోగిచంద్ర ♦ శేముషీవిస్తంద్ర
నెనరుతోడ నొక్క ♦ మనవి వినుము
చెలువుమీఱ నీకు ♦ శిష్యుఁడ నేనాదుఁ
గారణంబునిచ్చి ♦ కావుమయ్య 172

గీ. వేషధారులు పెక్కురీ ♦ విశ్వమందు
నలరుచుండ్రుగాని వారిచే ♦ నాశ్రయింప
సద్గురుఁడవీవయనుచునా ♦ స్వాంతమునను
దెలిసికొంటిని నాకోర్కెఁ ♦ దీర్పగదవె

క. వింటిని తావకసూక్తులు
కంటిని నీ మహిమ లెక్కను ♦ గారణమిడవే
యంటని భవజలధినిబడి
యుంటిని నను దెల్పఁగదె మ ♦ హోన్నతచరితా 174

చ. అనవిని సిద్ధయోగి విన ♦ యంబున నిట్లను నో సుధీమణీ
వినుము మహాత్మ్యదీయునను ♦ విప్రకులాగ్రణివైననీవు వే
డ్కను గొనియాడుచున్ గురుని ♦ గాఁదల భక్తిఁ బరిగ్ర
హించినన్

నినుగులమందు బాంధవులు ♦ నేర్పఁదలిర్పఁ బహిష్కరింపరే

ఆ. లోకనిందనొంద ♦ నీకేల నాకేల
మీకులంబునందు ♦ నేకగురువు
లుండఁ గలరు వారి ♦ దండఁ జేరి కటాక్ష
మొందుమయ్య ముక్తి ♦ నందుమయ్య 176

క. నావుడుఁ దస్వామినిగని
గోవిందస్వామి పల్కెఁ ♦ గోవిదవర్యా
నీవెఱుఁగని ధర్మంబులు
క్ష్మావలయము నందుఁగలవె ♦ చర్చింపంగన్ 177

క. గోపన విప్రుఁడుగాదే
దీపించు కబీర్బ్రహ్మ ♦ దీయుఁడుగాదే
తాపసులు మెచ్చఁగా నల
గోపనకుఁ గబీరుదాసు ♦ గురుఁడన వినమే 178

క. అజ్ఞుల కుండిన రీతిగ
విజ్ఞుల కేటు కులములుండు ♦ వివరింపంగన్
సుజ్ఞాన శేఖరా నను
బ్రాజ్ఞుని గావించి కరుణఁ ♦ బాలింపఁగదే 179

క. భాసురముఁగను వశిష్ట
వ్యాసాదుల భవము లెఱిఁగి ♦ వారలవారల్
భూసురులనుచు నను వెలి
వేసిన నేమగు నమేయ ♦ విజ్ఞాననిధీ 180

క. సేవింపుచుంటి నిరతము

గావింపుచు నుంటినీకు ♦ ఘన శుశ్రూషల్
భావింపుచుంటి గురుఁడని
దీవింపుచునాకు సదుప ♦ దేశంబిడవే 181

క. అనవిని సిద్ధయ నవ్వుచు
ననఘాత్ముఁడవని యెఱుంగ ♦ నాకారణమున్
మనమలర నొసంగియు వే
డ్కను నిను నాయంతవానిఁ ♦ గావింతుసుమీ 182

క. లోకమునకు నీవలన వి
వేకము గల్గుటకు నిట్లు ♦ వెచుకాడితి సు
శ్లోకుఁడవై తనరారెడు
నీకుఁ గారణము నిడుదు ♦ నేడేయునినన్ 183

క. గోవిందస్వామి యరిగి
కావలసిన వస్తువులను ♦ గైకొని హిత భ
క్తావళిని గూర్చుకొని మే
లౌ వాద్యాంచితులతోడ ♦ నరుదెంచంగన్ 184

వ. నాటిరాత్రి

సీ. సిద్ధయోగియుఁ దన ♦ చెలువయు స్నానముల్
సలిపి పీతాంబరా ♦ దులు ధరించి
సింహాసనమున నా ♦ సీనులైయుండ మం
గళ తూర్యములు మ్రోయఁ ♦ గా సమస్త
భక్త జనంబులు ♦ భజన లొనర్పఁగా
వేదోక్తముగను గో ♦ విందశర్మ

గురు దంపతులకును ♦ చరణ సమర్చసల్
జేసిన యంతనే ♦ సిద్ధయోగి
గీ. శిష్యవరు ముఖవస్త్ర భా ♦ సితు నొనర్చి
హస్తమస్తక సంయోగ ♦ మాచరించి
శ్రవణమందునఁ దనదు వ ♦ క్త్రము నొకింత
చేర్చి మంత్రోపదేశంబుఁ ♦ జేసెనహహ 186

వ. ఇట్లు మంత్రోపదేశంబు నొనర్చి తీర్థప్రసాదంబుల నొసంగి తక్కొరుల కట్లే తీర్థాదుల నొసంగినన్ స్వీకరించిరి. తదనంతరంబున సిద్ధయోగీంద్రుండది మొదలు గోవింద స్వామికిఁ దారక సాంఖ్య మనస్కంబులను గాలజ్ఞానాదికంబులను బోధింపుచునుండె నెండియును 187

— సిద్ధయోగి జీవసమాధి నొందుట —

సీ. పురజనంబుల నెల్ల ♦ నిరుపమానస్థితి
వేదాంత శాస్త్ర కో ♦ విదులఁజేసె
సకల దేశంబులు ♦ సంచార మొనరించి
పరమ సుజ్ఞానముఁ ♦ బ్రబలఁజేసె
హైందవులకును మ ♦ హమ్మదీయులకును
లలితైక మత్యమున్ ♦ గలుగఁజేసె
నొనర నచ్చాంబీ త ♦ లోదరి యందునఁ
బీరయ యనెడు కు ♦ మారునిఁగనె
గీ. శిష్య సందోహమును సమా ♦ ర్జించె దీర్ఘ
కాలమును దివ్యతపముల ♦ నోలిసలిపెఁ

గడన జీవసమాధి ను • గాదినాడు
గాంచె సిద్ధయు నెన్న వా • కృతికిఁ దరమె 188

క. శ్రీసిద్ధయోగి చరితము
వ్రాసిన చదివినను విన్న • వారికి సౌఖ్యో
ల్లాసములుం నిహపరంబుల
భాసురముగఁ గల్గుఁగాత • భగవత్కరుణన్ 189

గీ. శాలివాహన శకగత • సమల నెన్న
నద్రిరస వసు విధుల సం • ఖ్యల నెసంగు
నపుడు కాశీపతియను నే • నార్యులెన్న
సిద్ధయోగి చరిత్ర ర • చించినాడ 190

... ఆ శ్వా సాం త ము లు. ...

క. మేరు ధరాధర ధైర్యా
నీరధి గాంభీర్య ప్రథిత • నిస్తులచర్యా
వారణరిపునిభ శౌర్యా
వీరబ్రహ్మార్యశిల్ప • విద్యాధుర్యా 191

క. పరమ సువర్ణస గోత్రా
సురుచిర లక్ష్మీకళత్ర • శుభచారిత్రా
శరణాగతవన చైత్రా
సరసీరుహ బాణగాత్ర • సజ్జనమిత్రా 192

పాదప. సారసనాయక • సన్నిభగాత్రా
ధీరజనస్తుత • దివ్యచరిత్రా
స్ఫారయశోంచిత • సాత్త్వికమిత్రా

ఔరగభూష ద ♦ యారసపాత్రి 193

గీ. మంగళము వీరగురుశిష్య ♦ పుంగవునకు
మంగళము భక్తహృత్పద్మ ♦ భృంగునకును
మంగళము ముద్దమాల స ♦ న్మందిరునకు
మంగళము సిద్ధయోగి రా ♦ ణ్మణికి నెపుడు 194

గద్య.

ఇది శ్రీ పరమేశ్వర వరప్రసాద లబ్ధ చతుర్విధ కవితా
విచిత్ర విశ్వకర్మకుల పవిత్ర భద్రదత్త గోత్ర
పోకూరి వంశాబ్ధి కైరవమిత్ర రామలక్ష్మాం
బా సుబ్బయాచార్య పుత్ర కవిసింహా
బిరుదపాత్ర బుధజనానుమతి
కాశీపతి ప్రణీతంబైన
శ్రీసిద్ధయోగి చ
రిత్రంబునందు
పంచమా
శ్వాసము
సంపూర్ణ
ము



## మా వద్ద [illegible]

1. పంచబ్రహ్మోపనిషత్తులు 0=
2. సంధ్యావందన భాష్యములు 0=
3. వీరబ్రహ్మముగారి పూజావిధానము 0=
4. చిత్తూరుజిల్లా తీర్పు 0=
5. శిల్పవిద్యా రహస్యోపనిషత్తులు 0=
6. విశ్వకర్మ ప్రభావము 0=
7. విశ్వకర్మ శతకము 0=
8. విశ్వకర్మ వ్రతము
9. పితృదేవతారాధనము 0
10. స్వస్వరూప ధ్యానము 0
11. వీరబ్రహ్మంగారి శతకం 0
12. కాళికాంబ పద్యరత్నములు 0
13. శంకర చాండాలుర సంవాదము 0
14. ఏదిస్వరాజ్యం లేక (బాపూజీ పసిడిపలుకులు) 0
15. పంచీకరణ విధానము 0
16. వీరబ్రహ్మ దండకములు 0=
17. వీరనామములు 0—
18. శివతాండవస్తోత్రము 0—
19. వీరబ్రహ్మ వాక్యరత్నములు 0—
20. మూలస్తంభము 0—

వలయువారు, త్వరపడుడు—

జే. వీరబ్రహ్మాచార్యులు, దువ్వూరు పోష్టు (కడపజిల్లా)